# నొప్పులతో అలిసిపోయిన మీ శరీరానికి క్షణంలో నూతనోత్సాహాన్ని చేకూర్చండి.




పొద్దస్తమానం బస్సుల్లోనూ, ఆటోల్లోనూ, ద్విచక్ర వాహనాల పైననూ, గతుకు, బొతుకు రోడ్లపైననూ ప్రయాణం చేసి, చేసి.డస్సిపోయి. గూటికి చేరుకొనే సమయానికి వొళ్లంతా హూనమై, నొప్పులతో బాధపడ్తూ వుంటారు. ఈ బాధా నివారణకు ఓ చక్కని చిట్కా ఇదుగో! కొద్దిపాటి అశ్విని మజిల్ ఆయిల్‌ను తీసుకొని, వొళ్లంతా చమిరి, కొద్దిసేపైన తర్వాత,ఒక వేణ్ణీటి స్నానం చేస్తే చాలు. క్షణంలో సొళ్ళు నొప్పులన్నీ మటు మాయమై పోగలవు. బడలిక వదిలి, శరీరానికి నూతనోత్సాహాన్ని, ఆదమరిచే గాఢ నిద్రను చేకూర్చగలదు. అశ్విని మజిల్ ఆయిల్ సొళ్ళు నొప్పులను, కండరాల నొప్పులను, మోకాళ్ల నొప్పులను, బెణుకులను నివారించే దివ్యౌషధం.

**మంట పుట్టనిది. ఘాటైన వాసన లేనిది.**

**బాధ తీవ్రముగా వున్నట్లయితే మజిల్ ఆయిల్‌తో మర్దన చేసిన తరువాత వేడి నీళ్ళలో బట్టను తడిపి కాపడం పెట్టవలయును.**




## అశ్విని మజిల్ ఆయిల్

పంపిణీదార్లు :

**వజ్రా మార్కెటింగ్ అసోసియేట్స్**

మూసాపేట, హైదరాబాదు 500 018

**ఇంటింటా వుండవలసిన అద్భుత బాధా నివారిణి.**



# వికాస భారతి

## రెసిడెన్షియల్ & డే స్కూల్

**సెంట్రల్ ఆఫీస్:**

జడ్జెస్ కాలనీ,
మలక్‌పేట. హాస్పిటల్ ఎదురుగా,
హైదరాబాద్-500 036
ఫోన్: 525013

**మెయిన్ కాంపస్:**

చిన్నారిపురం,
19వ కి.మీ.నాగార్జునసాగర్ రోడ్డు,
రంగారెడ్డి జిల్లా - 501 510
ఫోన్స్: తుర్కయాంజాల్ 273, 379

## అసలు స్కూళ్ళు ఉండాల్సిందీ...

పిల్లల అనుభూతులకూ, అవసరాలకూ, ఆలోచనలకూ-
మొత్తంగా వాళ్ళ శారీరక మానసిక వికాసాలకు
ఆటపట్టుల్లా. అంతేగానీ...
తల్లిదండ్రుల కోరికలకూ, ఆర్భాటాలకూ,
వాళ్ళ హెూదాలకూ గుర్తులుగా కాదు.
పిల్లల ఆసక్తులే ప్రధానంగా నడిచే స్కూళ్ళకోసం
వెదకండి. వాళ్ళ ప్రచండమైన మేధస్సుకు
పటిష్టమైన పునాది వెయ్యండి.

**పిల్లల సహవాసంలో ఇది మా పదో సంవత్సరం**

[redacted] అడ్మిషన్ల కోసం సంప్రదించండి

# 'స్వాతి' మినీకథలు

## విజిల్ పజిల్

టకటకమంటూ విన్పిస్తున్న టైప్ శబ్దం తప్ప ఆఫీసు వాతావరణమంతా నిశ్శబ్దంగా ఉంది. ఎవరిపనుల్లో వాళ్లం మునిగిపోయాం. ఎలాగై



నాసరే, ఈ పూటతో ఆ పని పూర్తిచెయ్యాలనే ఆరాటంతో స్టేట్‌మెంట్‌లోని అంకెలతో కుస్తీప డుతున్నాను.

అలాంటి సమయంలో పోలీసు విజిల్‌కన్నా స్ట్రాంగ్‌గా ఆఫీసు దద్దరిల్లేలా విజిల్ విన్పించేస రికి బిత్తరపోయాను. బిక్కచచ్చినట్లయి తలెత్తి చూద్దునుగదా! నా ఎదుటిసీటులోని మా హెడ్ క్లర్క్‌గారు కుడిచేత్తో గుండెను పట్టుకుని టేబు ల్‌పై ఉన్న గ్లాసులోని మంచినీళ్లు గటగటా తాగేస్తున్నారు.

అప్పటివరకు కునికిపాట్లు పడుతున్న ప్యూ న్‌రంగయ్య ఒక్కఉదుటున లేచి స్ట్రెయిట్‌గా నిలబడి నిద్రకళ్లతోనే భయంగా దిక్కులు చూస్తూ కన్పించాడు. నా పక్కసీటువైపు చూశా ను. ఆ సీటులోని జూలీ చాలా ఇబ్బంది పడిపోతున్నట్లు కన్పించింది. అలవాటులేని వేషం మరి. నలభైయ్యేళ్లు దాటినా అందంగా, చిన్నదానిలా కన్పించాలనే ఆరాటంతో రంగు లన్నీ మొహానికి పాముకోవడమే ఫాషన్ అను కునే మనిషి. దానికితోడు ఈరోజు కొత్తగా మిడ్డీ వేసుకొచ్చిందామె. దాన్ని లాక్కోలేక, పీక్కో లేక నానా అవస్థలు పడుతోంది. తన బాధలు చూసే ఎవరో ఈ విజిల్ వేసివుంటారనుకుంటు న్నట్లుంది. అందుకు తగినట్లు ఆమె ఎదుటిసీ టు మధుసూదన్ ఏదో తప్పుచేసి దొరికిపోయి నవాడిలా ఎగరేసిన కాలర్‌ను సర్దుకొని ఒద్దిక గా కూర్చుని ఏమీ తెలీని అమాయకుడిలా చూస్తున్నాడు. అతగాడి సంగతి అందరికీ తెలిసిందే. స్టెనో కుమారిని చూసి అస్తమానూ ఇకిలిస్తూనో, సకిలిస్తూనో ఉంటాడు. ఆ పి వీడి వాలకం చూసి మరింత హొయలు తుంది. దాంతో వీడి పైత్యం మరీ మితిమీ తుంటుంది.

నా ఆలోచనల్లో నేనుండగానే ఆఫీసర్‌గా పిలుపు అందుకుని లోపలకు పరిగెత్తాడు మ హెడ్.

"ఇది ఆఫీసనుకున్నారా, సినిమా హాలన

ముఖచిత్రం: జగ్‌మోహన్

న్నారా? హు ఈజ్ దట్ బ్రూట్, ఆఫీసులో విజిల్ వేస్తాడా? డిసిప్లిన్ అనేది ఒకటుందని తెలిసేడిస్తేగా, తక్షణం వాడెవడో కనుక్కొని చెప్పండి. ఐ వాంట్ టూ టేక్ యాక్షన్ ఇమ్మీడియెట్లీ' అంటూ అరిచేశారు మా బాస్. పాపం ఆమె సహజంగా నిదానస్తురాలే. కానీ సందర్భం ఇలా వచ్చింది మరి.

"ఎవరయ్యా బాబూ, విజిల్ వేసి నా గొంతుమీదకు తెచ్చింది. అక్కడ అమ్మవారు చిందులు తొక్కుతున్నారు'' అంటూ గుండె పట్టుకుని హాలంతా పిల్లికళ్లతో పరిశీలిస్తూ తిరిగేస్తున్నాడు మా హెడ్. అంతలో అటు మూలగా కూర్చున్న ఆనంద్ లేచాడు. అతన్ని చూస్తూనే మా హెడ్ "ఏమయ్యా ఆనంద్, నీవేనా విజిల్ వేసిందీ?" అనడిగారు కోపంగా.

"హి... హి... హి... నేను కాదండీ! అదుగో ఆ బుజ్జిగాడుగారి పనే అది'' అన్నాడు. ఆనంద్ అటు మూలగా ఉన్న టాయ్‌లెట్ నుంచి బయటపడి ఆఫీసులోకొస్తున్న బుజ్జిగాడు గారిని చూపుతూ,

మా ఆఫీసరిణిగారి ఏకైకపుత్రుడు, గారాల పట్టి బుజ్జిగాడుగారు ఆరోక్లాసు చదువుతున్నాడు. దగ్గర్లోనే ఉన్న స్కూలు వదలగానే ఆఫీసుకు వచ్చి అమ్మగారితోపాటు కారెక్కి ఇంటికి పోతుంటాడు. బుజ్జిగాడుగారు దగ్గరకు రాగానే, "ఏం బాబూ, ఈలవేసింది నీవేనా?" నసిగేరు హెడ్డుగారు.

పళ్లికిలిస్తూ, "పొద్దుటినుంచి కడుపు నొప్పిగా ఉంది అంకుల్, మీ టాయ్‌లెట్‌లోకి దూరగానే అదంతా ధామ్మంటూ ఎగిరిపోయిందనుకోండి. ఆ సంతోషంలో దానికితోడుగా విజిల్ అదే వచ్చేసింది సుమండీ. ఏంటి అంకుల్, అది మీ క్కాడా విన్పడిందాండీ?" అంటూ అమాయకంగా అడిగేడు ఆఫీసరిణిగారి ముద్దులపుత్రుడు బుజ్జిగాడుగారు.

-యం.రాజేశ్వరి

---

# వీధిలో ఈల

బస్సుదిగి ఇంటివైపు నడక ప్రారంభించింది మాధవి. అసలే చికాగ్గా ఉందేమో, కిక్కిరిసిన జనంతో కలిసి చేసిన ప్రయాణం మరింత అలసటని పెంచింది.

ఏదో ఆలోచిస్తూ గబగబా అడుగులేస్తోంది. అంతలో వినిపించింది. వెనుకనుండి ఈల చప్పుడు. ఎవరైఉంటారబ్బా అని ఓ క్షణం అనుకున్నా ఇంటికెళ్లే తొందర ఆమెని వెనక్కి తిరిగి చూడనివ్వలేదు.

నడకవేగం పెంచింది,

రెండు, మూడు నిమిషాలు గడిచాయో లేదో మళ్లీ ఈల.

రాస్కెల్స్! పనిపాటా ఉండదు. వీధిలో కనిపించే ప్రతి అమ్మాయికీ సైటుకొట్టడం, ఈల వేయడం... ఛీ ఛీ...

ఈ సమాజం ఎన్నటికి బాగుపడేను?

వెనక్కి చూసింది.

ఎవరూ కనిపించలేదు. మళ్లీ నాలుగడుగులు వేసిందో లేదో మళ్లీ ఈల వేసిన శబ్దం. వళ్లు మండిపోయింది మాధవికి. వాడెవడో గానీ, వాడి దవడ పేల్చేద్దామని విసురుగా వెనక్కి తిరిగింది. సందు చివరినుండి వస్తున్నాడొక వ్యక్తి. లాల్చీ, పైజామా, గడ్డం, నల్లఫ్రేము కళ్లజోడు... పెద్దమనిషిలానే ఉన్నాడు. తెల్లని తెలుపు. బహుశా ఫారెనరేమో! పెద్దమనిషిలా ఉన్నాడు.

మరీ బుద్ధేమిటి?

అతను కాకపోయి ఉండవచ్చును.

మరెవరు? మనసు మూలలో కించిత్ భయం.

నో... నో... తనకెందుకు భయం?

వడివడిగా ముందుకు నడవసాగింది మాధవి.

ఒక ఫర్లాంగు దూరం నడిచిందో లేదో ఈసారి పెద్దగా వినిపించింది నోటి ఈల.

ఎవరో ఇతను?



దగ్గరగా వచ్చి కన్ను గొడతాడేమో? చెయ్యి పట్టుకుంటాడేమో? పెళ్లి చేసుకోమని బెదిరిస్తాడేమో?



ఛీ... ఛీ... ఛీ తనకు నిండా పాతికేళ్లు లేవు. అతను చూస్తే యాభైదాటినట్లున్నాడు. ఈ ఉద్దేశం అయివుండదు.

ఏమో? ఎవరు చెప్పగలరు?

మునలిమంత్రులే మళ్లీ పెళ్లి చేసుకుంటున్నారు. రేప్‌కూడా చేసి సంచలనం సృష్టించటం జరుగుతోంది. ఏ పెద్దమనుమల్నీ నమ్మడానికి వీల్లేకుండా పోతోంది.

అంతలో....

పెద్దగా మళ్లీ విజిల్!

తాడో పేడో తేల్చుకోవలసిందే! ''విజిల్లు వేసే వయసేనటమ్మా నాది? ట్రాఫిక్ పోలీసుల కే తప్ప నా బోటివాళ్లకి విజిల్ వేయడం వస్తుందా?'' అంటాడేమో? ఏదేమైనా దీని అంతు చూడాల్సిందే! వెనుదిరిగింది.

''ఏయ్ మిస్టర్! ఎవరున్నవ్వు? ఈ ఈలల గోలేంటి? మానర్స్ తెలియని రోడ్డుసైడు రోమియోలా ఏమిటది...'' అరిచిందతన్ని చీదరగా చూస్తూ.

లాల్చీ, పైజామా వేసుకున్న ఫారెనర్ చిన్నగా నవ్వేడు.

''ఇంకా వెధవ నవ్వొకటి! ఏం? పెద్దమని షిలానే ఉన్నావు. ఇదేంరోగం...'' ఎడాపెడా వాయించేసింది ఉగ్రరూపంతో.

''చూడమ్మా! నేను నీ కోసం ఈల వేయలేదు'' మర్యాద ఉట్టిపడుతున్న స్వరంతో, అచ్చ తెలుగులో అన్నాడు.

''మరి?''

''నేనూ, మా ఫ్రెండూ కలిసి 'ఈల'పై పరిశోధన చేస్తున్నాం. ఈల చప్పుడు విని ఇండియన్ వుమెన్ తీవ్రంగా స్పందిస్తుందని మా ఫ్రెండొకడి థీరీ! అది ఎంతవరకు నిజమో తెలునుకోవాలనే ఈ ప్రయత్నం... అంతే!'' అన్నాడాయన మరింత మర్యాదగా.

**-జ్యోతిరాణి**

---

# ఎగ్జిబిషన్

**వా**రంరోజులుగా కిట్టు, కాంతి ప్రాణాలు కొరుక్కుతినేస్తున్నారు ఎగ్జిబిషన్‌కి తీసుకెళ్లమని.

చిన్నపిల్లల్ని నా మీదకి ఎగదోసి వెనక నుంచి మా ఆవిడ నన్నాయి నొక్కులు నొక్కసాగింది.

తప్పుతుందా! సరే వచ్చే ఆదివారం వెళ్దామన్నాను. అంతే! ముగ్గురూ సీలింగ్ నెత్తికి తగిలేలా ఎగిరిగంతేశారు.

ఆదివారం రానేవచ్చింది.

టిక్కెట్లు తీసుకుని ఎగ్జిబిషన్ లోపలికి ప్రవేశించాం. ఎంత పెందరాళే వచ్చినా ఆదివారమేమో మంచి రష్‌గా వుంది.

మెల్లిగా ఒక్కో స్టాలూ చూసుకుంటూ నడుస్తున్నాం. అప్పటిదాకా బుద్ధిగా వున్న మా వాళ్లిద్దరికీ తోకలొచ్చాయి. దానికి తోడు మా

ఆవిడ ప్రతి దుకాణంలోకీ దూరడం, అన్నీ చూడ్డం, బేరాలాడ్డం, కొనకుండా రావడం. కాంతి కాస్త నయంగానీ కిట్టూగాడు ప్రతి నిముషానికీ మాయమై దొరుకుతున్నాడు. వెతుక్కోలేక చచ్చాను. మానేజ్ చేయడం కష్టంగా వుంది. ఇది పద్ధతి కాదని-

"ఒరేయ్, జనం మధ్యలో అలా దూరిపోకు. ఓవేళ మేం కనబడకపోతే అక్కడే వుండు. అటూ ఇటూ పోకు. నా ఈల వినబడగానే వచ్చెయ్" అని చెప్పాను, నరేనన్నాడు.

మణిపూర్ చీరలషాపుల దగ్గర, మాజిక్ పెన్నుల దగ్గర, మిరపకాయ బజ్జీల దగ్గర ఈల వేయాల్సివచ్చింది. మరీ పెద్దగా కాకపోయినా ఆ మాత్రం దానికే చుట్టుపక్కలవాళ్లు విడ్డూరపడివుండచ్చు. అయినా నేను పట్టించుకోదల్చుకోలేదు. కిట్టూలాంటి వాడితో ఎగ్జిబిషన్ కి వచ్చి అవన్నీ అనుకుంటే ఎలా?

గాజుల దుకాణాల దగ్గర కాంతి, మా ఆవిడ బిజీ అయిపోయారు? ఎగ్జిబిషన్లో సగంమంది ఆడవాళ్లు అక్కడే వున్నట్టున్నారు- ఇంతలో ఎప్పుడు చెయ్యివదిలేశాడో! కిట్టూగాడు మాయం. ఓసారి ఈల వేశాను. ఊహు! ఈసారి ఇంకాస్త పెద్దగా... అంతే! నా చెంప ఛెళ్లుమంది.

నా ఎదురుగా నాతో సమానమైన ఎత్తులో కోపంతో వురిమిచూస్తున్న పచ్చచీర వంకజాక్షి ఎవరో!

"ఏమన్నా బుర్రా బుద్ధీ వుందా? ఇందాకట్నించీ చూస్తున్నాను, మంచి మర్యాదా వుండక్కర్లా? అటు చూసి ఇటుచూసి దొంగచూపులు చూస్తూ ఈల వేస్తావా? ఏదీ మీ ఆవిడ? పిలిటూ" అంటూ దడదడ వాయించేసింది.




అందరికీ మా ఆవిడ సర్దిచెప్పేలోపల కనబడిన కిట్టూ చేయిపట్టుకొని గేటుదగ్గరికి వచ్చేశాను. ఇంక జన్మలో ఈలా లేదు, ఎగ్జిబిషనూ లేదు అనుకుంటూ.

-కె.బి.లక్ష్మి

## ఇంట్లో ఈల

"మా అమ్మాయి నళిని ఈమధ్య తరచూ ఈల ప్రాక్టీసు చేస్తోంది. ఆ విషయంమీద దానికీ నాకూ రోజూ ఓ పెద్ద యుద్ధం జరిగిపోతూవుంటుంది. ఆడపిల్లలు ఈల వెయ్యడానికి నేను పూర్తిగా వ్యతిరేకం.

"ఇంట్లో ఓ మాటు ఈలేస్తే ఏమవుతుందిట. నేనేమన్నా రోడ్డుమీదేస్తున్నానా? ఆ శీనుగాడు ఈలతో చేంతాడులాంటి పాటలు పాడుతున్నా నువ్వేమీ అనవు" అని నామీద గయ్యిమంటుందది.

"వాడికీ నీకూ పోలికేమిటే? మొగపిల్లాడేం చేసినా చెల్లుతుంది. వాడిలా అర్ధరాత్రి ఒక్కర్తివీ రెండో ఆట సినిమా చూసిరాగలవా నువ్వు?" అని నేనరుస్తూవుంటాను.

ఇది మామూలేగానీ, ఉదయంపూట నా హడావిడి నాది. ముగ్గురుపిల్లలకి బాక్సులు కట్టడం, ఆయనగారికి పదేపదే కాఫీలు, టీలు... ముఖ్యంగా కొత్తగా చేరిన మునలిపని మనిషికి వేడివేడిగా డికాక్షన్ అదిగో... సరిగ్గా ఆ హడావిడి టైములో ఇది ఈల రిహార్సల్స్

మొదలెడితే ఏ గరిటో దానిమీదకి విసరక తప్పదు.

రెండు నెలలు అష్టకష్టాలువడితే చచ్చీచెడి దొరికింది ఈ పనిమనిషి. పని నెమ్మదిగా చేసినా శుభ్రంగానే చేస్తుంది. 'ఆఫీసుకెళ్లేలోగానే పూర్తి చేస్తుందిలే' అని సరిపెట్టుకుంటున్నాను.

అనలే రాత్రి వారి స్నేహితులకు డిన్నరయింది. వంట గదినిండా గిన్నెలే, పళ్లాలే. దానికితోడు.... ఆరోజు పొద్దున్నే దిగారు ఊరునుంచి చెల్లెలూ, మరిదీ, పిల్లలూ! ఆ మాటా,



ఈ మాట మాట్లాడాక నేనే ఓ గిన్నె కడిగి గబగబా టిఫిన్ చేసిపెట్టాను. ఆఫీసులో అర్జంటు వర్క్ వుండటంతో ఆరోజు శలవు పెట్టడానికి లేదనీ, సాయంత్రం తీరిగ్గా మాట్లాడుకుందామనీ చెల్లాయితో చెప్పేశాను.

"ఫరవాలేదే అక్కా! మేం శుభ్రంగా భోంచేసి పడుకుంటాం. నువ్వొచ్చేసరికి వంట కూడా చేసేస్తాను. అప్పటికి తీరిగ్గా అన్నీ మాట్లాడుకుందాం" అంది చెల్లాయి శోభ.





అప్పుడు... హడావిడిగా వంటింట్లో కాఫీ కలుపుతున్న నాకు హటాత్తుగానూ, భయంకరంగానూ వినిపించిదో ఈల.

హడిలిపోయాను.

"దీనికి బుద్ధిలేదా? ఎన్నిసార్లు చెప్పినా ఇంతే. అవతల చెల్లీ, మరిదీ... ఏమనుకుంటారు?" అనుకుని వళ్లు నూరుకుంటూ హడావిడిగా బెడ్‌రూమ్‌లోకెళ్లి దాని చెవి మెలిపెట్టాను.

ఈ హటాత్సంఘటనకి అది బిత్తరపోయి అరిచేలోగా మా చెల్లెలు లోపలికి వచ్చేసింది. దాంతో నేను కాస్త తగ్గాల్సొచ్చింది. ఏడుపుస్థానంలో నవ్వు పులుముకుని చెల్లెలి పిల్లలకి 'బై' చెప్పి స్కూలుకెళ్ళిపోయింది నళిని.

మర్నాడు ఆదివారం కావడంతో తీరుబడిగా కాఫీ తాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నాం. కాసేపు వంటపని పక్కకు పెట్టి ఆరోజు సిటీలో తిరగాల్సిన ప్రదేశాలు, పట్టుకెళ్లాల్సిన తినుబండారాల గురించి చర్చించుకుంటున్నాం. అంతలో... రయ్! రయ్‌మని రెండుసార్లు వినిపించింది ఈల. అంతే! నా కోపం నషాళానికంటింది. అలా ఈల వేసింది గ్యారంటీగా మా అమ్మాయే. అబ్బాయయితే కనీసం ఓ 3, 4 నిమిషాలు ఏదో పాట ఈల వేస్తాడు. ఇంక నాకు ఆవేశం ఆగలేదు. మా మరిది బాత్‌రూమ్‌లో వున్నాడు. ఇక వున్నది చెల్లేలేకదా అని మా అమ్మాయిని గదిలోంచి లాక్కొచ్చి ఎడాపెడా వాయించడం మొదలెట్టాను.

"చెప్పవే... మానావా లేదా ఆ దిక్కుమాలిన ఈల. నీకేం పొయ్యేకాలం వచ్చిందే బొత్తిగా చెప్పిన మాట వినకుండా తయారవుతున్నావ్" నళిని వంటిమీద దెబ్బమీదదెబ్బ పడుతోంది.

అక్కడికీ శోభ ఆపుతూనే వుంది. అయినా ఆవేశం చల్లారట్లేదు.

"నేను కాదమ్మా!" అని అది అంటున్నకొద్దీ నా కోపం పెరిగిపోతోంది.

అంతలో ఆరోజు మా పనిమనిషితో వచ్చిన దానికోడలు పరిగెత్తుకుంటూ వచ్చింది.

"అమ్మగోరూ! పాపని కొట్టమాకండి. ఈల వేసింది మా అత్తమ్మ. గిన్నెలెక్కువవడితే ఎక్క

డయినా ఇంతే. రెండుసార్లేసిందిగదా! ఇంకో సారి అంటే మొత్తం మూడుసార్లు ఈలేసిందంటే మీ ఇంట్లో పనిమ్మానేత్తుందని అర్థమన్నమాట. మా మామ పోలీసుపనిచేసి ఇది మాత్రం నేర్పిచచ్చాడులెండి'' అంది.

''ఆ...'' అని తెల్లమొహం వేశాం అందరం

-రాధాశివమోహన్

# పక్కింట్లో ఈలల

ఆఫీస్ తరవున మాకు ఈ కాలనీలో స్థలాలు అలాట్ చేసిన తరువాత మా ఆఫీసువాళ్లందరం కలిసి ఇళ్లు కట్టుకున్నా తొలి గృహప్రవేశం మాదే! ఇక్కడి ప్రశాంత వాతావరణానికి ముగ్ధులైన రిటైర్డ్ ఆఫీసర్లు తెగమోజుపడి ఎంత రేటు అయినా పెట్టి ఇక్కడే స్థలాలు కొని ఇళ్లు కట్టుకున్నారు. కొందరైతే పిల్లలకి స్కూలు కుదరదనో, ఆఫీసుకి దూరమనో అమ్ముకోవడం ప్రారంభించేరు. అవిధంగా ఇప్పుడు కాలనీలో సగంమంది రిటైర్డ్ వాళ్లే వచ్చి చేరారు. ఆ కోవలోనే మాకు ఈ పక్కనా, ఆ పక్కనా ఓ రిటైర్డ్ మిలిటరీ ఆఫీసరూ మరో రిటైర్డ్ పోలీసాఫీసరూ వచ్చిచేరేరు.

ఇక్కడకు వచ్చిన తరువాత వాళ్లిద్దరూ మంచి ఫ్రెండ్స్ అయ్యేరు. జాము పొద్దుండగానే ఇద్దరూ బంగ్లాలమీదెక్కి ఈల వేసుకుంటూ ఒకరినొకరు పిలుచుకుంటూ మాట్లాడుకుంటూ జాగింగ్, ఎక్సర్‌సైజులు చేస్తూ ఉంటారు. మధ్యలో మా ఇల్లు అడ్డం వాళ్లకి. వాళ్లు ఇల్లు కట్టుకోవటంలో సహాయం చేసిన నేనంటే వాళ్లకి అభిమానం. మొదట్లో వాళ్ల చేష్టలకి నాకు నవ్వూ, విసుగూ వచ్చినా రానురాను అలవాటయిపోయింది. వాళ్ల ఈలలు వినపడగానే నాకు ఇంక నిద్రపట్టదు. నేను కూడా పైకి వెళ్లి వాళ్లతోపాటు జాగింగ్, ఎక్సర్‌సైజులు చేస్తూ మధ్యమధ్య నా పద్ధతిలో నేను మాట్లాడుతుంటాను.

ఓ ఉదయం మేం ముగ్గురం అలా మాట్లాడుకుంటుంటే మా పెద్దబ్బాయి విజిల్ వేసుకుంటూ వచ్చేడు, ''డాడీ! మమ్మీ పెళ్లికి వెళ్లాలంట నిన్ను త్వరగా తయారయి రమ్మంటోంది'' అంటూ.

ఇప్పుడే వస్తానంటూ వెళ్లబోతుంటే ''మేము కొత్తగా కొన్న ఏ.సి చూడడానికి రావడం మర్చిపోకండి'' అన్నారు పోలీసాఫీసర్ సుబ్బారావు గారు.

''ఆ...ఆ... ఇప్పుడే వస్తాను'' అంటూ కిందకి వెళ్లాను. స్నానం చేసి రెడీ అయి ''నువ్వు తయారుగా ఉండు నేను ఇప్పుడే పది నిమిషాల్లో వస్తాను'' అని శ్రీమతికి చెప్పి సుబ్బారావింటికి బయలుదేరాను విజిల్ వేసుకుంటూ.

నా వెనకాలే మా పెద్దాడు, చిన్నాడు బయ



టకు వచ్చి ''మేము స్కూలుకి వెళుతున్నాము డాడీ!'' అన్నారు.

''జాగ్రత్తగా రండి, తాళం పట్టికెళుతున్నారుకదా? మీరు వచ్చేటప్పటికి ఇంట్లో ఎవ్వరూ ఉండరు'' అని పిల్లలకి జాగ్రత్తలు చెప్పి, సుబ్బారావింటిగేటు తీసేను.

సుబ్బారావు, మిలిటరీ ఆఫీసర్ రామారావు గారు కూర్చుని అప్పుడే స్వీట్లు తింటున్నారు

"ఆ... రండి! మీకోసమే చూస్తున్నాము. తీసుకోండి!" అంటూ నాకూ స్వీటు అందించేరు. తింటూ వాళ్ల ఏ.సి హాయిని అనుభవిస్తూ కబుర్లు చెప్పుకుంటున్న మాకు గట్టిగా ఈల శబ్దం వినబడింది. అందరం ఒకరి మొహాలు ఒకరం చూసుకున్నాం. సుబ్బారావుగారు లేచి లోపలికి వెళ్లబోతుండగానే వాళ్లావిడ వచ్చి నాతో "మీ ఆవిడ పిలుస్తున్నారు" అన్నారు.

నా కర్తవ్యం గుర్తొచ్చిన నేను శలవు తీసుకుని హడావిడిగా గేటు దగ్గరకు వచ్చేను.

అప్పటికే మా ఆవిడ ధుమధుమలాడుతూ "కబుర్లలో పడితే ఈ లోకం తెలియదు మీకు. అవతల ముహూర్తం టైం దాటిపోతుంది. మా చెల్లెలి ఆడపడుచు కూతురి పెళ్లాయె! 'పెళ్లయిన తరువాత తింటానికి వచ్చింది మీ అక్క' అంటూ దాన్ని దెప్పిపొడుస్తుందేమో! తొందరగా స్కూటర్ స్టార్ట్ చేయండి!" అంటూ ఉపన్యాసం ఇస్తూనే ఇంటికి తాళం వేసి వచ్చి "ఊఁ పదండి" అన్న మా ఆవిడ గద్దింపుకి స్కూటరు ముందుకురికింది గానీ నా మైండ్ అంతా ప్రశ్నల్తో గందరగోళంగా మిగిలిపోయింది. గమ్యంచేరి స్కూటర్ దిగగానే తేరుకుని "ఇంతకీ ఈల..." అంటున్న నా మాటమధ్యలోనే-

"అదీ... ఆ సుబ్బారావుగారు మరీ కబుర్లపోగు కదాండి! ఆయన్ని పిలవాలంటే వాళ్లావిడ ఈలతోనే పిలుస్తుందంట. ఈమధ్య మీరు కూడా అలానే తయారయ్యారుకదా! అందుకని ఆమె దగ్గర నేను కూడా నేర్చుకున్నాను" నవ్వుతూ అంది శ్రీమతి.

మళ్లీ నా బుర్ర గందరగోళంగా తయారయింది... రేపట్నించి ఎవరి విజిల్ ఏదో ఎలా తెలుసుకోవాలో గదా? అని.

-రాధిక

---

# ఆఫీసులో ఈల

అరగంటనుండీ కాంటిన్‌కెళ్లి టీ తాగొద్దామనుకుంటూనే ఈ ఫైల్ చూడగానే వెళ్దాం, ఆ ఫైల్ పూర్తి కాగానే పోదాం అనుకుంటూ గడిపేశాను. ఇక అన్నీ సర్ది పేపర్ వెయిట్‌లు సరిగా పెట్టి లేచాను.

అంతే... టైప్‌రైటర్ టకటకలు, ఆఫీసర్ అరుపులు టెలిఫోన్ ట్రింగ్ ట్రింగ్‌లు, బజర్ చేసే బరబరలూకి భిన్నమయిన శబ్దం. అందరినీ ఆశ్చర్యపరుస్తూ పెద్దపెట్టున ఈల.

ఆ ఈల ఎటునుండి వచ్చిందో బోధపడలేదు. ఎవరిని చూడాలో అర్థం కాలేదు. తెరుచుకున్న నోరు రెప్పవేయని కళ్లు, నా పరిస్థితే కాదు అటెండర్ నుండి ఆఫీసర్ వరకూ అందరూ. అయోమయంలో పడిపోయారు.

అందరికంటే ఆఫీసరుగారే ముందు తేరుకున్నారు. వెంటనే ఆయన ఆశ్చర్యం కోపంగా మారిపోయింది. క్వింటాల్స్ కొద్దీ కోపాన్ని కళ్లలో నింపుకుని అందరినీ అనుమానంగా చూడసాగారు.

ఆ చూపు నా వైపు మళ్లబోయేసరికి చెప్పొద్దూ నాకు మహా కంగారేసింది. నిలబడినవాడిని కాస్తా ఠపీమని పేడకడిలా చతికిలబడి మూసేసిన ఫైళ్లలోంచే ఫైది తీసి దేనికోసమో వెతుకుతున్నట్లు కంగారుగా కెలకసాగాను. అందుకే నేనలా తల దించుకోవడంవల్ల ఆయన నన్ను ఎలా చూస్తున్నారో నాకు తెలిసే అవకాశం లేకపోయింది.

ఫైలు తిరగేస్తున్నానన్న మాటేగానీ నా కళ్లుగానీ బుర్రగానీ వాటి మీదలేవు. గబుక్కున తలెత్తి ఆఫీసరు వంక చూశాను. నెత్తిమీద పిడుగుపడినట్లయ్యింది.

ఆయనగారు నన్నే చూస్తున్నారు. ఆ చూపు కోపంగానేకాదు అనుమానంగానూ ఉంది. కుడితిలోపడ్డ ఎలుకలా ఓ క్షణం గిలగిలలాడి, పరధ్యానంగా చూసిన చూపులా నటించి ఒక క్షణం కళ్లు మూసుకుని, నుదుటిమీద ఏదో గుర్తు తెచ్చుకోడానికి కష్టపడుతున్నపుడు సుతారంగా కొట్టుకునేట్లు వేలితో కొట్టుకున్నాను.

అబ్బా... ఎన్ని తిప్పలురా బాబూ? ఆ ఈల వేసిన ఘనుడెవరో తెలీదుగానీ ఆఫీసురుగారి చూపులు మాత్రం నన్ను తినేసేలా వున్నాయి. బహుశా ఆయన నన్నొక్కణ్ణేకాదు డిపార్ట్‌మెంట్‌లో వున్న మగవాళ్లందర్నీ ఇలాగే చూస్తున్నారేమో! లేకుంటే ఇన్నాళ్లూ నేనంటే సదభి





ప్రాయం వున్నట్లే చూసేవారు. ఆ అభిప్రాయ మంతా ఈ ఈల గాలికి కొట్టుకుపోయిన ట్లుంది.

నిజానికి నేను ఏ తప్పూ చేయకపోయినా ఆ ఈలకీ నాకూ ఎలాంటి సంబంధమూ లేకపోయినా ఈ గుండె దుడుకేమిటి? ఛఛ... నామీద నాకే కోపం వచ్చింది. చికాకేసింది.

ఫైలు మూస్తూ తెరుస్తూ నా పక్క సీటు ప్రమీలవంక ఓరగా చూశాను. నేను చూట్టం ఆలశ్యం ఆవిడ "ఎవరండీ బాబూ! కొంపతీసి మీరు కాదుగదా?!" అంది.

"భలేవారే, నేనలాంటివాణ్ణా" అని నవ్వి అనుకోకుండా ఆఫీసరు వంక చూశాను.

మళ్లీ మా చూపులు కలిశాయి.

హడలిపోయాను. వికసించిన పెదాలు ముకుళించాయి.

చూపులు కలిసిన శుభవేళ అన్న మహానుభావులు ఎవరోగానీ ఇపుడు మాత్రం ఆ కవి మీద, పాట మీదకూడా కట్టలు తెచ్చుకు ప్రవహించింది కోపం.

మళ్లీ పనిలో లీనమైనట్లు నటించాను.

ఎంతోసేపు అలా వుండలేక ఏమయితే అదయ్యిందని ఎటూ చూడకుండా కాంటీన్‌కెళ్లాలనుకున్నాను. కానీ సాధ్యం కాలేదు. అందరూ కనిపిస్తున్నారు. అయితే అందరూ నాలాగే టెన్షన్‌లో మునిగి వుండడం చూసి నేను రిలీఫ్ ఫీలయ్యాను.

మొత్తం డిపార్ట్‌మెంట్‌లో 15 మంది మగవాళ్లం కాగా ముగ్గురంటే ముగ్గురే ఆడవాళ్లున్నారు.

అయితే నా దృష్టి నాలుగో యువతిపై పడింది.

వినీల పక్కనున్న ఎక్స్‌ట్రా ఛెయిర్‌లో చూడగానే ఛమక్కు మనిపించే ఓ స్పార్కింగ్ బ్యూటీ కనిపించింది.

నాకు కొంచెం కొంచెం అర్థమవసాగింది. ఈమెని చూసిన పారవశ్యంలో ఏ తుంటరివాడో ఈల వేసి వుంటాడు.

ఆఫీసరు మీద కోపం కూడా వచ్చింది. గుర్రాన్నీ మేకనీ ఒక రాటకి కట్టేసినట్లు జాయింట్ ఇన్సల్టింగ్ చూపులేమిటి? పెళ్లయ్యి పిల్లలున్న వాడిని అంతకుమించిన జంటిల్‌మాన్ని. ఇంకా పెళ్లి చేసుకోకుండా హాయిగా ఎంజాయ్ చేస్తున్న వాళ్లని అనుమానిస్తే ఫరవాలేదు.

నాకు కాస్త తెగువ వచ్చేసింది. మరోసారి ఫైళ్లు మూసేసి ధైర్యంగా కాంటీన్‌కి వెళ్లిపోయాను.

కాంటీన్‌లో మాత్రం ఈ విషయమై హాయిగా ముచ్చటించుకున్నాం. మనసారా నవ్వుకున్నాం.

ఎవరి వెర్షన్‌లో వాళ్లు జోకులు కట్ చేస్తుంటే సరదాగా కులాసాగా గడిపి, ముఖాలకి



సీరియస్‌నెస్ అంటించుకుని సీట్లు చేరాం.

సెక్షన్ ఆఫీసర్ వెళ్లి సూపరింటెండెంట్ చెవిలో వూదినట్లున్నారు. ఆయనోసారి విజిట్ చేసి చీమలూ జెర్రులూ పాకుతున్నట్లు ముఖం పెట్టి విష్ చేసినా రెస్పాన్స్ లేకుండా వెళ్లిపోయారు.

చిన్నపాటి ఈల కూడా సంచలనం రేపగలదని ఆవేళే తెలిసింది.

మొత్తానికి ఆ రోజు సాయంత్రం కాన్ఫరెన్స్ హాలులో ఎమర్జెన్సీ మీటింగ్ అరేంజ్ చేసి, తలవాచేట్లు చివాట్లు పెట్టారు. నా మట్టుకు నాకు హరి, గిరిలపై అనుమానం వుండడాన వాళ్లనే తిడ్తున్నట్లు భావించి సంతోషించాను.

ఎలాగో మీటింగ్ ముగించి, మమ్మల్ని కరుణించి సూపరెన్టెంట్ వెళ్లిపోయారు.

ఒకరి వెంట ఒకరం అందరం లేచాం.

ఇంతకీ ఇది హరి పనాలేక గిరి పనా రేపు కనిపెట్టాలి అనుకుంటూ బస్టాపువైపు నడిచాను. జనసందోహంలో కలిసిపోయి మా కాలనీ బస్ కోసం వడిగాపులు మొదలెట్టాను.

నా కొలీగ్ రజని స్వరం వినిపించి అటు తిరిగాను. ఆవిడ ప్రమీలతో "మా చెల్లాయి ఉత్త అల్లరి పిల్ల, అది పెద్దపెట్టున ఈల వేస్తుంది. నాకు రాదని గేలి చేస్తుంటే మొన్నటి నుండి ప్రాక్టీస్ మొదలెట్టాను. పొరపాటున ఈవేళ ఆఫీసులో" అంటోంది.

దేవ రహస్యం తెలిసి తెల్లబోయాను.

**పుష్పా. యల్.వర్ఘా**

# విజిలమ్మాయి

**ఉ**దయం పదిగంటలు. నత్తగుల్లల్ని విదేశాలకు ఎగుమతి చేసే 'గుల్లా ఇంటర్నేషనల్' కంపెనీలో ఉద్యోగులంతా బిజీగా ఉన్నారు. పోస్టు తెచ్చి టైపిస్ట్ 'కోకిల'కిచ్చి వెళ్లిపోయాడు పోస్ట్‌మెన్. కోకిల లెటర్లన్నీ విప్పి లెడ్జర్‌లో ఎంట్రీచేసి హెడ్‌కిస్తుంది. ఇంతలో హెడ్ అర్జంటు వసుందని కోకిలకి చెప్పి బయటకెళ్లిపోయాడు పాపం! ఆయనకి 'జిలేబి' అంటే మహాఇష్టం. అది గుర్తొచ్చినప్పుడల్లా తమ కంపెనీకి ఎదురుగానే ఉన్న స్వీట్ షాపుకెళ్లి ఒక పావుకేజి తినేసి వస్తుంటాడు. అప్పుడప్పుడూ ఆయన తన డెస్క్‌లో జిలేబి దాచుకొని వేళాపాళా లేకుండా ఉద్యోగుల ముందే తినేసే అలవాటు కూడా ఉంది. కోకిల లెటర్లన్నీ విప్పి ఎంట్రీ చేసుకుంటూనే అవి చదివేస్తుంది. ఆరోజు ఓ గవర్నమెంట్ ఆఫీస్‌నుండి వచ్చిన లెటర్ ఉంది. అది చదివి ఆనందంతో తబ్బిబ్బయిపోయింది. మళ్లీ మళ్లీ చదివింది. ఆనందం బరస్టయిపోయింది కాబోలు. "రయ్‌"మని చేతివేళ్లు నోట్లో పెట్టుకుని "విజిల్" వేసేసింది. ఆ శబ్దం "గుల్లా ఇంటర్నేషనల్" ఫ్లోర్ మొత్తం రీసౌండ్‌తో దద్దరిల్లింది. వెంటనే పక్కసెక్షన్లో వాళ్లు లేచి ఆమెవైపు చూశారు. ఆమె సిగ్గుపడలేదు సరికదా గర్వంగా చూస్తోంది.

పక్కతను అడిగాడు కోకిలని ఏమైందని "ఈల వెయ్యాలనిపించింది వేశాను" అంది సూటిగా.

అతనెప్పుడూ అతని పనిచేసుకోకుండా ఆమేం చేస్తుందో గమనిస్తుంటాడని కోకిలకి అతనంటే కోపం.

ఆ విజిల్ విషయం సెక్షన్లో అందరూ చర్చించుకున్నారు. "ఆ పిల్లకి కాస్త పిచ్చిలే" అన్నాడు గుర్నాధం.

"నీ మొహం దానికి పెద్ద గర్వం" అన్నాడు అప్పారావు.

"ఆమె జిలేబిగాడి దగ్గిరి బంధువు కావడంతో సెక్షన్లో తెగసుపీరియారిటీలే" అన్నాడు డిప్పారావు.

మొత్తంమీద రకరకాలుగా డిస్కస్ చేసుకున్నారు. ఇంతలో ఎం.డి.గారి బోయ్ వచ్చి సెక్షన్ హెడ్‌ని ఎం.డి.గారు పిలుస్తున్నారని తీసుకుపోయాడు.

"ఏమయ్యా... నీ సెక్షన్లో ఎవడో గాడిద విజిల్ వేశాడు తెలుసా?" అన్నాడు యం.డి. హెడ్ బిత్తరపోయాడు. వెంటనే యం.డి.గారి దగ్గరనుండే ఇంటర్‌కామ్‌లో కోకిలను అడిగాడు "విజిల్ వేసింది ఎవరూ?" అని.

ఆమె "నేనే"నని చెప్పడంతో హెడ్ కంగారుపడిపోయాడు.

"సారీ సార్! నాకూ ఆశ్చర్యంగా ఉంది. ఒక ఆడపిల్ల విజిల్ వేసిందంటే" అన్నాడు.

"వ్హాట్ అమ్మాయి విజిల్ వేసిందా! పొరపాట్న నీవు కొత్త బెల్లంతో చేసిన జిలేబిగాని తిన్నావా ఏంటి?" అన్నాడు ఎం.డి.

"లేదు సార్ నిజం. ఆమె తానే విజిల్ వేశానని నాతో స్వయంగా చెప్పుకొంది"




"చాలా వింతగా వుందే. కొంపదీసి ఆమె ఈలపాట రఘురామయ్యగారి చుట్టం కాదు కదా..."

"కాదండి ఆమె కొస్త మాకు తెలిసినవాళ్ల అమ్మాయండి" అన్నాడు హెడ్.

"కొస్త న్యూసెన్సుగాని లూజా ఏమిటి ఆమెకి" అన్నాడు ఎం.డి.

"అన్నీ టైటేనండి. మరెందుకు విజిలే సిందో తెలీదు"

"సరే ఆమెను ఇలా రమ్మను"

కోకిలమ్మ ఎం.డి.గారి క్యాబిన్‌లోకి వచ్చింది.

"చూడమ్మా నేనింతవరకూ ఎన్నో విచిత్రాలు మన ఆఫీసులో చూశాను. సెక్షన్లో కూరలు తరుక్కునే అమ్మాయిల్ని చూశాను. డెస్కులో క్వార్టర్స్ దాచుకొని మందుకొట్టే కుర్రోళ్లని చూశాను. నేనొస్తున్నానే భయంతో సిగరెట్ తాగుతున్న ఓ బోయ్ భయంతో దాన్ని మింగెయ్యటం చూశాను. కానీ నీలా "విజిల్" వేసే వింతని ఇదేనమ్మా చూడటం. ఎందుకు విజిల్ వేశావ్! ముందు విజిల్ ఎలా నేర్చుకున్నావో చెప్పు" అన్నాడు ఎం.డి.

"మా నాన్నగారు డ్రిల్‌మాష్టర్. ఆయన జేబులో ఎప్పుడూ విజిల్ వుండేది. అది నా చిన్నప్పటి అలవాటు. తర్వాత కాలేజిలో ఆ అలవాటు ప్రాక్టీస్‌గా మారి నాకు నోటితో "విజిల్" వేసేస్థాయికి తెచ్చింది. పట్టరాని ఆనందమొస్తేనే ఇలా విజిల్ వేసేస్తాను"

"మరిప్పుడు ఎందుకు వేశావ్?"

"మన నత్తగుల్లల బిజినెస్‌ని ప్రభుత్వం గుర్తింపుకోసం మనం గత ఆరేళ్లనుండీ ప్రయత్నిస్తున్నాంకదా" అంది కోకిల.

"అవును. ఆ గుర్తింపు వస్తే ఏటా అయిదుకోట్లు గవర్నమెంట్‌కి డ్యూటీ కట్టే అవసరం ఉండదు. పైగా రెండుకోట్లు గవర్నమెంట్ ఇస్తుంది మనకు డెవలప్‌మెంట్ కోసం" అన్నాడు ఎం.డి.

"ఆ కాగితాలన్నీ నేనే టైప్ చేస్తానుకదాండి. ఆ విషయంమీద నాకూ బాగా కాన్సంట్రేషన్ వుంది సార్. ఈరోజు ఈ లెటర్‌లో మన సంస్థని ప్రభుత్వం గుర్తించినట్లు కమిషనర్ తెలియజేశారు సార్! అందుకే ఆనందంతో విజిల్ వేశాను" అంది కోకిల లెటర్ ఆయన చేతికిస్తూ.

"ఏంటమ్మా మన సంస్థని గవర్నమెంట్ గుర్తించిందా...!" అంటూ ఎం.డి.గారు దిగ్గున లేచి ఆమె చేతిలో కాగితాలు అందుకొని గబగబా చదివేసి ఆనందంతో "రయ్‌ః"మని విజిలేశాడు.

మరుక్షణం పక్కనేవున్న హెడ్ కూడా విజిలేశాడు.



"థాంక్స్ అమ్మా, అనవసరంగా నిన్ను టెన్షన్‌కి గురిచేశాం" అంటూ ఎం.డి.గారు కంగారుగా కాగితాలు పట్టుకొని "ఛైర్మన్"గారి క్యాబిన్‌కేసి పరుగున వెళ్లిపోయారు ఆనందంగా.

కొన్ని నిమిషాల తర్వాత "రయ్... రయ్‌ః"మంటూ ఛైర్మన్‌గారి రూంనుండి పెద్ద విజిల్స్‌తో "గుల్లా ఇంటర్నేషనల్" ఆఫీసంతా దద్దరిల్లిపోయింది.

-బలరాం

# చతుర

సంపుటి : 17
సంచిక : 4
మే 1994




వి. నాగరత్న

# స్పృహ



"ఎవరైనా ఎప్పుడైనా భయపడినంత కాలం భయపెడతారు. అది వాళ్ల గొప్పతనంకాదు, మన పిరికితనం..." అంటుంది వర్ష.

"నువ్వెంతసేపూ స్త్రీ స్త్రీ అంటావు. నువ్వు చలాన్ని చదివావని నాకు గుర్తుందిలే. ఇష్టంలేని భార్యలతో జీవితాల్ని వెళ్లదీస్తున్న భర్తలూ అనేక మంది వున్నారు" అంటుంది చిత్ర.

"నేనెక్కువగా పుస్తకాలతోనే కాలక్షేపం చేసేదెందుకో తెలుసా? టెన్షన్లూ, తల్నొప్పులూ నా మనస్తత్వానికి సరిపోవు. లైఫీజ్ టు ఎంజాయ్. ఐ బిలీవిట్..." అంటుంది బిందు.

విభిన్న మనస్తత్వాలని తమ స్నేహంతో గాఢంగా పెనవేసుకున్న ఆ అమ్మాయిల జీవితాల్లోని అనేక సంఘటనలను అక్షరబద్ధం చేస్తూ వి.నాగరత్న రాసిన 'స్పృహ' ఈ నెల 'చతుర' సమర్పణ.

"వర్షా! ఎంతసేపే టీ పెట్టడం! వెళ్లి గంట సేపయింది, వంటింట్లోనే సెటిలయిపో యావు'' అంటూ ఓ గావుకేక పెట్టింది బిందు.

"ఒచ్చేస్తున్నా ఒక్కక్షణం" అదే రేంజ్‌లో సమాధానం ఒచ్చింది వంటింట్లోంచి.

మరో రెండు నిమిషాలకి ఒక ట్రేలో మూడు కప్పుల టీతో ప్రత్యక్షమయి "చాయ్ చాయ్'' అంది వర్ష రైల్వే స్టేషన్లలో సుపరిచితమయిన కంఠస్వరాలని అనుకరిస్తూ.

"థాంక్ గాడ్! ఇంకా అస్సాం వెళ్లి తేయాకు కోసుకొచ్చి- మరగపెట్టే ప్రోసెస్‌లో వున్నావేమో అనుకున్నాను'' అంది చిత్ర కప్పు అందుకుంటూ.

"అవునవును తేయాకు ఒక్కటుంటే సరిపోతుందా?! దూడని పెంచి పెద్దచేసి, అది గేదయ్యాక పాలు పిండి... ఒక్కటిస్తా జాగ్రత్త' అంది వర్ష తనూ కూర్చుంటూ.

"ఓహ్! బ్రహ్మాండంగా వుందే నీ టీ. నీ జాబ్ నీకెప్పుడయినా నచ్చనట్లు అనిపిస్తే వెంటనే మానేయొచ్చు'' అంది బిందు.

"ఇదేం స్టేట్‌మెంటే తల్లీ? నీ రెండు వాక్యాలకీ లింక్ కుదిరినట్లు లేదు పారలల్ లైన్లలా వున్నాయి'' అంది చిత్ర.

"ఏ వాక్యానికావాక్యం విడగొట్టి అర్థాలు చెప్తారీ పంతులమ్మలు. అందుకే పిల్లలంతా అలా అజ్ఞానంతో అఘోరిస్తున్నారు. రాణీ ఒచ్చింది, వాణి వెళ్లింది- అని వుందనుకో దేనికది విడిగా చూట్టంలో అర్థంలేదు. రాణీ రావడానికి, వాణీ వెళ్లడానికి మధ్య వున్నదేంటో అది ముఖ్యం... అర్థమయిందా?" అంది వర్ష ముసిముసిగా నవ్వుతూ.

"ఏడ్చావులే నోర్మొయ్యి, ఎక్కొచ్చిన మెట్లనే మర్చిపోయేరకం నీలాంటివాళ్లంతా. మా పంతుళ్లే లేకపోతే ఏ రంగంలోనూ ఎవరూ పైకొచ్చే ప్రసక్తేలేదు. ఇంతకీ అసలు విషయం నీకైనా అర్థమైందా?" అంది చిత్ర.

"ఏంలేదే తల్లీ! టీ పెట్టడంలో ఎక్స్‌పర్ట్‌వే కాబట్టి, ఉద్యోగం ఒదిలేసి ఓ టీస్టాల్ పెట్టుకోమని దాని ఉచిత సలహా'' అంది వర్ష.

"ఆ పెట్టేదేదో మా స్కూలు పక్కన పెట్టుకో. నా కొలీగ్స్ అందరూ నీ దగ్గరే ఖాతా పెట్టేట్లు రికమండ్ చేస్తాను'' అంది చిత్ర.

"బడిపంతుళ్లు. వాళ్ల మొహం. టీ అయినా ఏం తాగుతారో అనుమానమే. పోనీ మా ఆఫీసు పక్కన పెట్టుకోవే వర్షా! నా కొలీగ్సే కాదు, ఒచ్చేపోయే కష్టమర్స్‌కి కూడా నీ టీ గురించి ఫ్రీ పబ్లిసిటీ ఇస్తాను'' అంది బిందు.

"ఫలితంగా గంటకో కప్పు టీ తనకు ఫ్రీగా పంపమంటుంది జాగ్రత్తే వర్షా'' అంది చిత్ర.

"శుభం పలకరా పంతులూ! అంటే పెళ్లికూతురు ఎక్కడ చచ్చిందీ అన్నాడట మీలాంటివాడే. శుభమని ఉద్యోగంలో చేరినందుకు ఏదో దీవించి ఏడుస్తారుకదాని మిమ్మల్ని పిలిస్తే మీ దిక్కుమాలిన దీవెనలు ఇవా మిత్రద్రోహులారా!" కాస్త నాటకఫక్కీలోనే అంది వర్ష.

"దీవించడమంటే అంత కారుచవక అనుకున్నావా ఏంటీ, ఓ కప్పు టీ ఇచ్చేసి దీవించమంటే ఎలా అమ్మాయీ?" అంది బిందు.

"ఓహో టీ చాలదా.. ఓ బాటిల్ స్కాచ్‌విస్కీ కావాలా ఏం?" అంది వర్ష.

"ఫ్రీగా దొరికితే పాయిజన్ అయినా సరేనని తీసుకునే మొహం కాదు నాది. ఎప్పుడయినా బచ్చన్ని ఇంటర్వ్యూ చేసే ఛాన్స్‌గానీ నీకొస్తే నన్నూ తీసికెళ్లాలి, ఒకే?!" అంది బిందు.

"అనవసరంగా నిన్ను ఇబ్బంది పెట్టడం నాకిష్టం లేదు. ఖర్మగాలి బచ్చన్‌గానీ నాకు సైట్ కొడితే కుళ్లుకోగలవు'' అంది వర్ష.

"నో ఛాన్స్ బేబీ! ఈ ఛామింగ్ ఫేస్ పక్కనుండగా బచన్ నిన్నెప్పుడు చూడాలి? ఇమాజిన్! నువ్వు నోట్‌బుక్ చూస్తూ ఒక్కో ప్రశ్నా అడుగుతుంటే బచన్ నన్ను కళ్ళప్పగించి చూస్తుంటాడు. నీ ప్రశ్న అయిపోయి సమాధానం కోసం తలెత్తితే... వ్వావ్వా... ఏం మజా ఒస్తుంది'' అంటూ చప్పట్లు కొట్టింది





బిందు.

ఆ సీన్ ఊహించుకుంటూ చిత్ర కూడా నవ్వింది.

"వాట్ నెక్స్ట్ అనేది కూడా చెప్పవే...ప క్కనే వున్న జయాబచ్చన్ కర్ర తీసుకు వెంట బడితే ఇక అప్పుడు చూడాలి అమ్మాయిగార్ని. కాళ్లకి చెప్పులేసుకోవడం కూడా మర్చిపోయి పరుగో పరుగు..." అంది వర్ష.

"ఒసేయ్ అక్కుపక్షీ! ఊహించడానిక్కూడా కాస్త బుర్ర వుండాలే. నంబర్‌వన్, జయా పక్కనుంటే నన్నెంత చూడాలని వున్నా బచ్చన్ మరీ కళ్లప్పగించి చూడడు. నంబర్ టూ, ఓ వేళ ఆపుకోలేక చూసినా జయా రియాక్షన్ అలా వుండదు..." అని బిందు చెప్తుండగా.

"అబ్బబ్బ ఆపండీ సోది. ఇంకేం టాపిక్ లేనట్లు సినిమావాళ్లమీద ఇంతసేపు డిస్కషన్. అందుకే అన్నారు రానురాను గుర్రం గాడిదయ్యిందని" విసుక్కుంది చిత్ర.

"సందట్లో సడేమియాలా గుర్రం, గాడిద అంటూ తిట్టేస్తోంది చూడవే ఇది" అంది బిందు.

"బ్రాపే టైం చూడండి, అప్పుడే పన్నెండయింది" అంది ఆశ్చర్యంగా గోడ గడియారం చూస్తూ వర్ష.

"మరి లేవండి బయల్దేరదాం" అంది బిందు.

ముగ్గురూ లేచి చెప్పులేసుకున్నారు.

"హర్షా! తలుపేసుకో, మేమెళ్తున్నాం" అంటూ పెద్దగా అరిచి చెప్పింది వర్ష తమ్ముణ్ణి ఉద్దేశించి.

"చుట్టుపక్కలవాళ్లంతా నాకు చెవుడు కాబోలనుకోవాలా, కాస్త మెల్లగా చెప్పొచ్చుగా" నొసలు చిట్లిస్తూ వచ్చాడు హర్ష.

"నువ్వంటే కాలేజ్ మానేసి ఇంట్లో కూర్చున్నావుగానీ నిన్ను గూర్చి ఏదో ఒకటి అనుకోడానికి ఎవరూ ఏదీ మానేసి రెడీగా లేరులే! అమ్మకి చెప్పు పాలు కాచాననీ, కూరలు తెచ్చాననీ... మర్చిపోకూ" అంటూ గేటు దాటింది.

"త్వరగా ఒచ్చేస్తావుగా" అన్నాడు హర్ష.

అలాగేనన్నట్లు తలా, చెయ్యీ ఊపి ముందు నడుస్తున్న చిత్ర, బిందులని సమీపించింది వర్ష.

"అయితే నువ్వింకో పని కూడా చేయగలవే వర్షా" అంది బిందు ఆమెని సాలోచనగా చూస్తూ.

"ఏపని?" అర్థంగాక అడిగింది వర్ష.

"కూరగాయలమ్మడం. వంకాయలు, బీరకాయలంటూ నువ్వీ సందులో అరిస్తే, చాలు పదిసందుల అవతలవాళ్లు కూడా బుట్టలు పట్టుకు బయటికొస్తారు" అంది.

"ఈ వర్షని మరీ అంత తక్కువ అంచనా వేయకు. అమ్ముకోవాల్సిన అవసరమొస్తే కూరగాయలేం ఖర్మ వజ్రాలు, వైఢూర్యాలంటూ నవరత్నాలమ్ముకుంటాను, అర్థమైందా?" లేని కాలరెగరేస్తూ చెప్పింది వర్ష.

"నువ్వేం కృష్ణదేవరాయలు కాలంలో వున్నాననుకుంటున్నావా, అవి రోడ్లమీద తోపుడుబండీలో వేసుకుని అమ్మే కాలం నువ్వు మరో వేయిజన్మలెత్తినా రాదు" అంటుండగా చిత్ర వర్ష చేతిని పట్టుకుని గట్టిగా పక్కకు లాగింది.

అలా లాగడంలో వర్ష పడబోయి నిలదొక్కుకుని కాస్త అయోమయంగా చూసింది చుట్టూ. ఏమీ ప్రశ్నించకుండానే ఆమెకి అర్థమయిపోయింది.

ఒక తాగుబోతు తూలుకుంటూ అడ్డదిడ్డంగా నడుచుకుంటూ వీరి పక్కనుండే వెళ్లాడు.

ముగ్గురూ ఒక్కక్షణం ఒకళ్లనొకరు చూసుకున్నారు.

"సిగ్గులేకపోతే సరి. పట్టపగలు తప్పతాగి రోడ్డెంట నడుస్తున్నాడు" పళ్లు కొరుకుతూ మెల్లగా గొణిగింది వర్ష.








# ప్రమాదకర విహార యాత్రలు

ఆస్ట్రేలియాలో సిడ్నీకి ఉత్తరంలో ఉన్న బ్రిస్‌బేన్ బీచ్‌కి అమ్మా, నాన్నలు, అంకుల్స్, ఆంటీలతోపాటు ఈ పసివాడు కూడా పిక్నిక్‌కి వెళ్లాడు. వీడిచేతిలో ఓ కేక్ పెట్టి కూచోబెట్టి పెద్దలందరూ తినడం, తాగడంలో మునిగిపోయారు. అంతలో సముద్రం మీంచి ఎగురుకుంటూ వచ్చిందో కింగ్ ఫిషర్. మొదట పిల్లవాడిని చిన్నగా ముక్కుతో పొడిచి బెదిరించడం ఆరంభించింది. కెమేరా భుజాన వేసుకుని తిరుగుతున్న ఓ అంకుల్ సరదాగా ఆ సీన్‌ని ఫిల్మ్‌లో బంధించాడు. అంతలోనే పిల్లవాడిని వదలకుండా రక్తం కారేలా పొడవడం ప్రారంభించిన ఆ రాక్షసి పక్షినుంచి వాణ్ణి రక్షించడం చాలా కష్టమయిపోయింది బంధువులకి. మొత్తంమీద దక్కిన కుర్రవాడికి ఒంటినిండా గాయాలే. అలాంటి ప్రమాదకర ప్రదేశాలకి పిల్లలను తీసుకెళ్లాడమేగాక వాళ్లని మరచి మైమరచే పెద్దలకు ఇదొక పాఠంలా మిగిలింది.

"అంటే పగలు తాక్కూడదుగానీ రాత్రయితే ఫరవాలేదనా నువ్వనేది'' అంది బిందు.

"నీతో ఏం మాట్లాడినా చిక్కే. రాత్రి ఎలాగూ తాగితందనాలాడతారు. కనీసం పగలు పనీపాటా లేకుండా ఇలా అయితే పాపం భార్యాపిల్లలు..." అర్థోక్తిగా ఆపింది వర్ష.

"హుం భార్యాపిల్లలు... ఏం చేస్తారు, ఏం చేయగలరు? ఎదిరిస్తే నాలుగు తంతాడు, ఇంకా మాట్లాడ్తే ఇంట్లోంచి గెంటేస్తాడు. మగవాడు. వాడింటికి వాడే రాజు. రాజుని ఎవరు డిక్టేట్ చేయగలరు?" అంది చిత్ర.

"అదిసరే, అసలు ఇలాంటివాళ్లకి పనిపాటా లేకుండా డబ్బెక్కణ్ణుంచి ఒస్తుంది. తాగడానికి?" అంది వర్ష.

"నువ్వేం జర్నలిస్టువే తల్లీ! ఆమాత్రం ఊహించలేవా? వాడి వాలకం చూస్తే ఏ కూలీనాలీ చేసుకునేవాడిలానో వున్నాడు. నిన్నటి పనిలో కాసిని ఎక్కువ డబ్బులు వచ్చివుంటాయి లేదా పెళ్లాం తెచ్చిన డబ్బులు గుంజుకుని వుంటాడు'' తన లోకజ్ఞానాన్ని బయటపెట్టింది బిందు.

వర్ష ఒక నిట్టూర్పు విడిచింది. ముగ్గురూ మౌనంగా నడుస్తూనే ఆటోలని పరికిస్తున్నారు.

"ఇక్కణ్ణుంచి జూ వరకూ ఆటో అంటే చాలా అవుతుంది. ఎందుకు డబ్బు దండగ. ఈ టైంలో బస్సులు కూడా ఖాళీగా వుంటాయి, హాయిగా బస్సులో వెళ్దాం" అంది చిత్ర.

"చూద్దాం, డైరెక్ట్ బసెస్ చాలా తక్కువ. ముందైతే బస్‌స్టాప్‌కెళ్దాం. వీలునిబట్టి కొంత దూరం ఆటో. తర్వాత బస్‌లో వెళ్లడమో ఏదో ఒకటి చెయ్యొచ్చు'' అంది వర్ష.

బస్‌స్టాప్‌లో జనాలు తక్కువగా వున్నారు. షెల్టర్ కిందున్న సిమెంటుదిమ్మమీద ముగ్గురు నలుగురు మగవాళ్లు కూర్చుని వున్నారు. ముగ్గురమ్మాయిలూ షెల్టర్‌కి దూరంగా బస్సులు కన్పించేట్లు నిలబడ్డారు. బస్‌నంబర్ల అంకెలు రాసివున్న నంబర్‌ప్లేట్‌పై ఏదో పోస్టర్ అంటించివుంది. దాంతో ఆ నంబర్లేవీ కన్పించడంలేదు.

"బుద్ధిలేని వెధవలు. ఆ దిక్కుమాలిన పోస్టర్ అంటించడానికి వాళ్లకెక్కడా స్థలం దొరకలేదా?" కోపంగా అంది బిందు.

"బుద్ధిలేని అనకు లెంపలేసుకో. బుద్ధిగల మేధావుల పనులే ఇవి. ఎక్కడో గోడల మీదైతే కొందరే చూస్తారు మనలాంటి ముక్కుసూటి మొహాలైతే చూడరు. కానీ ఇలాంటి చోట్లయితే ప్రతిఒక్కరూ తప్పనిసరిగా చూస్తారు, వాళ్లక్కావల్సిందదే'' అంది వర్ష.

"వాళ్ల పబ్లిసిటీకోసం పబ్లిక్ ఎంత సఫరౌతుంది? ఇలాంటివాళ్లమీద గవర్నమెంట్ ఏక్షనెందుకు తీసుకోదో అర్థంకాదు. వాడి అడ్రస్ ఎలాగూ అందులోనే వుంటుంది. ఇన్‌ఫర్‌మేటివ్ ప్లేట్స్‌పై ఎక్కడైనా సరే ఏదైనా అంటిస్తే లక్షరూపాయిల పెనాల్టీ వేయాలి. అలాంటి రూల్‌వుంటే ఎవడికి ధైర్యముంటుంది మళ్లీ ఆ పని చేయడానికి?" కోపంగా అంది బిందు.

"రూల్స్‌కేమొచ్చెలే, చాలా వున్నాయి. వున్నవాటిని ఎవడు పాటిస్తున్నాడు? పాటించనివాళ్లని ఎవరు పట్టించుకుంటున్నారు? ప్రతి ఒక్కడు తను బాగుంటే చాలు దేశమెలా తగలడ్తే తనకెందుకు అనుకునేవాడే. అందుకే మనదేశమిలా అఘోరిస్తోంది'' అంది వర్ష.

"పోన్లేవే. అందరి సంగతీ మనకెందుకు? మన ప్రవర్తన బాగుండేట్లు మనం చూసుకుంటే పోలా?" అంది చిత్ర.

"ముళ్లూ, రాళ్లూ మనం విసరనంతలో సరిపోతుందా? దారిన నడుస్తున్నంతవరకూ ఎవరు విసిరినా అవి అందర్నీ బాధిస్తూనే వుంటాయి'' అంది వర్ష.

ఆ విషయంమీద వాళ్ల సంభాషణ అలా మరో అరగంటైనా కొనసాగేదే. కానీ వాళ్ల కళ్లెదురుగా చిన్న సంఘటన జరగడంతో మాటలు మర్చిపోయి, అటు చూస్తూండిపోయారు.

ఇందాక వాళ్లని దాటివెళ్లిన తాగుబోతు మిర్చిబజ్జీ కొరుక్కుతింటూ వచ్చాడెక్కణ్ణుంచో. అతని ఎడమచేతిలో ఒక కాగితపు కవరుంది. అందులో కూడా బజ్జీలే వున్నట్లు కాగితం నూనెమరకలతో కన్పిస్తోంది.

అప్పటికే అక్కడ ఒక యువకుడు తెల్లషర్టు, తెల్లపాంటులో వున్నాడు. అతను రెండు చేతులూ జేబుల్లో పెట్టుకుని రిథమిగ్గా తల వూపుతూ నిలబడివున్నాడు.

మిరపకాయ బజ్జీ తొడిమపడేస్తూ ఆ యువకుణ్ణి ఇతడు ఏదో అడిగాడు. వాళ్ల మాటలు వీళ్లకి విన్పించడం లేదు.

"వాడి ఎన్‌క్వయిరీకి ఆ హాండ్‌సమ్ పిల్లడే కావల్సొచ్చాడు కాబోలు'' అంది వర్ష.

"ఏం సంగతి? ముందే పరిచయముందా ఏం?" అంది చిత్ర కళ్ళెగరేసి నవ్వుతూ.

"ఛ పోవే. మీకస్సలు సౌందర్యారాధనే తెలీదు. ఏం అబ్బాయిలయితే మాత్రం బాగున్నారు అనకూడదా?" అంది వర్ష.

చిత్ర, బిందు నవ్వి వూరుకున్నారు.

ఆ యువకుడు లేదన్నట్లు తలూపాడు.

అంటే చూసేవాళ్లకెవరికైనా అర్థమవుతుంది, తాగినవాడు బహుశా ఏ బస్‌నంబరో చెప్పి వచ్చేల్లిందా అని అడుగుంటాడని.

ఇతను మళ్లీ ఏదో ప్రశ్నించాడు.

యువకుడు తిరిగి అడ్డంగా తలూపాడు.

అంతే తాగుబోతు తల అతివేగంగా స్ప్రింగుబొమ్మలా అటూ ఇటూ వూపుతూ ఆ యువకుణ్ణి వెక్కిరించి ఏదేదో మాట్లాడుతున్నాడు.

కాలుజారి పడినందుక్కాదు, ఎవరు చూసి నవ్వారోనని బెంగగా వుంటుందెవరికయినా. అలాగే ఆ యువకుడు వెంటనే చుట్టూచూశాడు, తనని వెక్కిరించడం ఎవరు చూశారో అన్నట్లు.

ఈ ముగ్గురమ్మాయిలవైపు చూడగానే అతడికి పౌరుషం పెల్లుబికింది.

యువకుడు కళ్లు చిట్లించి ఏమో అన్నాడు. బహుశా 'నోర్మూసుకు ఫో' అనుంటాడు.

తాగుబోతూ ఏమాత్రం బెదరలేదు. ఈసారి తలే కాదు నడుము దగ్గర్నుంచి తలవరకూ అటూ ఇటూ స్పీడుగా వూపుతూ మాట్లాడుతున్నాడు.

ఆ యువకుడు ఒక నిమిషం ఇగ్నోర్ చేసినట్లు తల స్టైలుగా సరిచేసుకుంటూ అటూ ఇటూ చూపులు మార్చి చూస్తున్నాడు.

కానీ తాగుబోతు ఇంకా కవ్విస్తున్నాడు.

అంతే ఆ యువకుడు వాడి చెయ్యిపట్టుకు లాక్కెళ్లబోయాడు, పోలీస్‌స్టేషన్‌కి కాబోలు. అప్పటికి వాడి నిషా కాస్త దిగినట్లుంది, మెల్లగా చేయి విడిపించుకుని మరోవైపుకి వెళ్లిపోయాడు.

వర్షకి ఆ యువకుణ్ణి ఒకసారి ప్రశంసాపూర్వకంగా చూడాలన్పించింది, కానీ అతను ఇటు తిరగనేలేదు.

ఇంతలో వీళ్లక్కావల్సిన బస్సొచ్చింది.

బిందు, చిత్ర ఎక్కారు. వర్ష ఎక్కబోతుంటే బస్ కదిలింది. బస్‌తోబాటు పరిగెత్తుతుంటే ఆ యువకుడు "పడిపోతావమ్మా, నెక్స్ట్ బస్‌కెళ్ళొచ్చుగా'' అంటున్నాడు. వర్ష రన్నింగ్‌బస్ ఎక్కేసి, ఒకసారి వెనుదిరిగి అతణ్ణి చూసి, తర్వాత డ్రైవర్‌ని విసుక్కుంది.

చాలామంది చాలామాటలు ఒక చెవితో విని రెండో చెవితో ఒదిలేస్తారు. కానీ మన ఆర్టీసీ డ్రైవర్లకి మాత్రం చెవివరకూ కూడా చేరవు. వాళ్లు చెవుల్లోముందే కాస్త దూది నింపుకొస్తారు.

బస్సు చాలా ఖాళీగా వుంది. ముగ్గురూ ఒకే సీట్‌లో ఇరుక్కుని కూర్చున్నారు.

"కాస్తలో తప్పిపోయింది ప్రమాదం. రన్నింగ్ బస్ ఎక్కడం అలవాటు లేదు, కాలుజారి పడబోయాను'' అంది వర్ష.

"ఎక్కడయినా పడినా పరవాలేదు. కాసేపు హాయిగా నవ్వుకోవచ్చు. బస్సుల్లోంచీ, ఆటో




ల్లోంచీమాత్రం పడకు తల్లీ! హాస్పిటల్‌వరకూ మోయలేక మేం చావాలి'' అంది బిందు.

"ఒసేయ్ మిత్రద్రోహీ! నాకు కాళ్లో చేతులో విరుగుతాయని కాదన్నమాట నీ బాధ" అంది వర్ష.

"ఛఛ... తమాషాక్కూడా అపశకునాలు మాట్లాడకు'' అంది చిత్ర.

మాట్లాడుకుంటూ కూర్చుంటే సమయమే తెలీలేదు.

జూలో ప్రవేశించగానే వర్ష తన హాండ్‌బాగ్ లోంచి మూడు బిస్కెట్ పాకెట్స్ తీసి వాళ్ళిద్ద రికీ ఒక్కొక్కటిస్తూ "ఈరోజుఎంత చల్లగా వుంది?" అంది మబ్బులవంక చూస్తూ.

"ముగ్గురికీ కలిపి ఓ పాకెట్ చాలదూ, ఇన్నెందుకు?" అంది చిత్ర.

"ఈ కాలప్పిల్లలకి బొత్తిగా తిండిధ్యాస లేదు. ఫాషన్లు ఎక్కువైనాయి'' అంది వర్ష గొంతుమార్చి.

"బామ్మ కారక్టర్‌కి బాగా సూటవుతావే, హాట్సాఫ్ టుయూ. ఈ రోజెన్ని కాంప్లిమెంట్సి చ్చానే నీకు. అయినా నీకు బొత్తిగా కృతజ్ఞత లేదనుకో. సరేగానీ, నేనయితే నా బిస్కెట్స్ చింపాంజీకి పెట్టుకుంటాను'' అంది బిందు.

"అరే, బుర్రంటే నీదేనే. బాగుంది'' అంది చిత్ర.

"కాపీ కాట్, నువ్వూ వేస్తే దానికి నేనేం ప్రత్యేకంగా కన్పిస్తాను?" నవ్వింది బిందు.

"అసలు ఈ ప్రోగ్రాం సంగతి నాకు ముందే తెలిసుంటే ఎంచక్కా బిర్యానీ తెచ్చేదాన్ని'' అంది చిత్ర.

"లెస్ లగేజ్‌మోర్ కంఫర్ట్ అన్నారు పెద్ద లు. ఎందుకవన్నీ మోత బరువు? ఇప్పుడు మనకన్నీ ఇన్‌స్టంట్ ఫుడ్స్ వచ్చేసాయిగా'' అంది వర్ష.

"నిజమే ఒక్కోసారి వీటివల్ల ఎంత టైం సేవౌతుంది కదాని సంతోషంగా వుంటుంది. కానీ బొత్తిగా ఈ సౌకర్యాలకి అలవాటు పడిపో తే మన వంటలూ వార్పులూ, సంస్కృతీ సంప్రదాయాలూ మర్చిపోతామేమోనని దిగు లుగా వుంటుంది'' అంది చిత్ర.

"ఎందుకు మర్చిపోవడం?! మనకి చాద స్తం, మూర్ఖత్వం వుండకూడదనేదే నా ఉద్దేశం తప్ప పొరుగింటి పుల్లకూరని కూడా ప్ర శంసించి దాన్నే తినమని కాదు. ఎప్పుడేది సౌకర్యంగా వుంటే అప్పటికి అదే మంచిది. ఇప్పుడు మనం సరదాగా కులాసాగా గడపా లని బయటికొచ్చాం. కాబట్టి మోతబరువు లేకుండా ఏ బిస్కెట్లో, అరటిపళ్లో వీటితో సరిపెట్టుకుంటే కావల్సినంత సమయం మిగుల్తుంది. దాంతోపాటు ఆనందమూ..."

"నా ఓటు నీకేనే వర్షా. బిర్యానీ, పులి హోర గట్రా తీరిగ్గా ఇంట్లో వున్నప్పుడు చేసుకోవాల్సినవి. అనకూడదు కానీ మనవా ళ్లలో చాలామందికి రక్త మాంసాల్లా చాదస్తం కూడా శరీరంలో ఒక భాగమయిపోయిందా అన్పిస్తుంది కొన్నిసార్లు. కొన్ని విషయాలు మనకి తెలియకపోయినా వినో, చదివో తెలుసు కోవాల్సిన అవసరం వుంది''

"ఆపండి తల్లీ మీ ఉపన్యాసాలు. వున్న ఒకే ఒక్క శ్రోతని బలితీసుకుంటే ఆ తర్వాత బాధపడ్డా ప్రయోజనం వుండదు'' అంది చిత్ర.

జంతువులనీ, పక్షులనీ చూసుకుంటూ బిస్కెట్లు, పల్లీలు తింటూ, కబుర్లు చెప్పు కుంటూ చాలా సేపు గడిపారు. చింపాంజీతో దూరంనుంచే ఆడుకున్నారు. రకరకాల పక్షుల అరుపులకి పులకించిపోయారు. పాములని జుగుప్సతో చూస్తూనే చిత్రమయిన అనుభూ తులు పొందారు.

కొంతసేపు రన్నింగ్‌రేస్ పెట్టుకుని పరిగెత్తా రు. బిందు, వర్ష పోటీలు పడి తెగ పరుగుతీశా రు కానీ చిత్రమాత్రం తనకి అనువైన కండిష న్స్ పెడ్తుంది. ఆయాసమొస్తే కూలబడిపో తుంది. అప్పుడు అంటుకోకూడదు. ఎవరయి నా అల్లంతదూరాన వున్నా తప్పుకుని పరుగెత్త దు, "టైం ప్లీజ్" అని ఆగిపోతుంది. ఇలా ఆమె దొంగాట ఆడటంవల్ల అంటించుకునే

ఆట సాగలేదు.

మళ్లీ కబుర్లలో పడ్డారు. ప్రపంచాన్ని మర్చిపోయి ఆనందపు అంచుల్ని తాకి పరవశిస్తున్నారు. వాళ్ల పలుకుల సెలయేళ్లలో నవ్వుల పువ్వులు తేలియాడుతున్నాయి.

ఆ సమయంలో ఇద్దరు అటుగా పోతున్న సుమారు పాతికేళ్ల వయసున్న పురుషపుంగవులు వీళ్లని చూసి వెకిలినవ్వు నవ్వారు.

తమలోతామే మాట్లాడుకుంటున్నట్లు "పిట్టలు బానే వున్నాయిరా'' అన్నాడు గళ్ళషర్టతను.

"అవున్రోయ్! వాటి కూతలు కూడా'' ఇకిలించాడు చారల చొక్కావాడు.

ముగ్గురమ్మాయిలకీ అర్థమయింది ఆ పక్షి పదశ్లేష. అయినా అర్థంకానట్లు నటించారు.

స్త్రీ జన్మ ఎత్తిన ప్రతి ఒక్కరికీ పదిహేనేళ్ళు దాటాయంటే ఇలాంటి అనుభవాలు తప్పవు, శాతంలో భేదాలుండచ్చు తప్ప.

"ఎక్కణ్ణుంచి వచ్చాయో'' మొదటివాడు.

"ఏమో భాయి. మొత్తానికి గా తెల్లది శాన బాగుందిలే' రెండోవాడి కామెంట్.

బిందు తెలుపుమీద గులాబిరంగు చిన్న పూలున్న చుడీదార్ వేసుకుంది. ఆమె ఆ మాట విని కళ్లు చిట్లించింది.

"ఎర్రపిట్ట కూడా మంచిగ్గొడ్తోంది'' మొదటివాడు.

అది వర్షకి వర్తిస్తుంది. ఆమె ఎరుపుమీద పసుపురంగు డిజైన్ వున్న డ్రెస్ వేసుకుంది. వర్షకి కోపంతో నరాలు బిగుసుకున్నాయి.

"మూడోపిట్ట గట్ల దొంగచూపులు చూస్తదేం భయ్?"

"మన్ని చూసి బెదిరిపోయి వుండాలి''

ఈ మాటలు వింటున్నకొద్దీ వారిలో అసహనం పెరగసాగింది. కానీ తమనితామే నిగ్రహించుకుంటున్నారు. ఆ దగ్గర్లో ఎవరూ లేరు. కాస్త ఏకాంతంగా వుందనే వారు ఆ స్థలాన్ని చూసుకుని కూర్చున్నారు.

అప్పుడే కుటుంబసమేతంగా ఓ పెద్దమనిషి అటుగా రావడం చూసిన బిందులో ధైర్యం అంకురించింది.

"ఏయ్! సరిగా చూడండే ఈ ఆస్ట్రేలియా కోతుల్ని! అదే బోన్నుండి తప్పించుకున్నట్లున్నాయి. వీటికి తోకలు కత్తిరిస్తే అచ్చం మనలా మాట్లాడ్తాయని చెప్తే నమ్మకం కలిగేది కాదు. భలే గమ్మత్తుగా వుంది కదూ! షర్టూ, పాంటూ తగిలించినంతమాత్రాన మనుషుల్లానే ఫీలయిపోతున్నాయి'' అంది బిందు.

బిందు మాటలు వినేసరికి వర్షక్కూడా ధైర్యం కలిగింది.

"నిజమే... అచ్చం మనిషిలా వుండే కోతులు. ఇది మర్చిపోలేని తమాషా. కానీ మనుషుల్లో కలసిపోతే అడ్రస్ లేకుండా తన్నగలరు. పాపం రిపోర్ట్ చేసి పుణ్యం కట్టుకుందామే'' అంది వర్ష.

చిత్ర భయంభయంగా చూస్తోంది.

"ఏం కోతులు గీతులని వాగుతున్నారు, తిక్కతిక్కగా వుందా?" చారల చొక్కా ప్రశ్న అది.

"లేకపోతే పిట్టలు గిట్టలని వాగుతున్న రెండు శాల్తీలకీ ఒళ్ళు కొవ్వెక్కిందా?" బిందు తారాస్థాయిలో మాట్లాడ్తుంటే ఆమె స్వరం కాస్త కంపించింది.

"మేం చెట్లమీద పిట్టల్ని చూసి మాట్లాడాం"

"మేం మాక్కన్పిస్తున్న కోతుల గురించి అనుకున్నాం"

ఇంతలో పెద్దమనిషి కుటుంబం సమీపించింది.

"ఏంటమ్మా ఏమయింది?" అన్నాడు అమ్మాయిల్నుద్దేశించి.

"చూడండంకుల్! ఆడపిల్లలు ఒంటరిగా కన్పిస్తే చాలు ఏదో ఒకటి వాగాలి, నోటి దురద. ఇందాకట్నుంచీ పిట్టల నెపంతో ఏదేదో వాగుతున్నారు'' అంది బిందు.




"వాళ్ళే మమ్మల్ని కోతులన్నారు, పైగా..."

"అంటే నీ ఇష్టమొచ్చినట్లు వాగుతుంటే నోర్మూసుకు కూర్చుంటామనుకున్నావా? చెప్పుల్తో సత్కారం చేయలేదు సంతోషించి దయచేయండి'' కోపంగా అంది వర్ష.

వాళ్ళిద్దరూ గొణుక్కుంటూ వెళ్ళిపోయారు.

"వాళ్ళేదో వాగారే అనుకోండి, విననట్లు వూరుకుంటే పోతుంది కదమ్మా'' అన్నాడు పెద్దమనిషి.

అతని భార్య కాబోలు, "అవునమ్మా! విననట్లు నటిస్తే ఎంతసేపు వాగుతారు, వాళ్ళకే విసుగొచ్చి వెళ్ళిపోతారు. ఇలా ఎదురు మాట్లాడ్తే కక్ష పెట్టుకుంటారు. ఆడపిల్లలు మీరేం చేయగలరు చెప్పండి. ఒంటరిగా చూసి ఏమైనా చేస్తే. అసలిలాంటి ప్రదేశాలకి పెద్దవాళ్ళు లేకుండా ఒంటరిగా రాకూడదమ్మా'' అంది శాంత గంభీర స్వరంతో.

ముగ్గురమ్మాయిలూ చెప్పిందంతా విని వూరుకున్నారు. వాళ్ళకి సమాధానం చెప్పాలనిపించలేదు. ముగ్గురూ లేచి నెమ్మదిగా నడక సాగించారు.

"చూశారా, వాళ్ళు కూడా ఏం చెప్తున్నారో?! మీరేదో రాణీ రుద్రమదేవి, ఝాన్సీ లక్ష్మీబాయి అనుకుంటారు. కానీ వాళ్ళు తల్చుకుంటే మనమేం చేయగలం? దుష్టుడికి దూరంగా వుండమంటారు, కాబట్టి..." చిత్ర అంటుంటే ఆమె మాటలకి అడ్డొస్తూ.

వర్ష "నీలాంటి చచ్చుపద్ధతిలో ఆలోచించే జనాలే తొంభయి తొమ్మిది శాతం వున్నారు కాబట్టే ఈ రోడ్డుసైడు రోమియోలు రోజురోజుకీ పెరిగిపోతున్నారు. ఎప్పుడైనా, ఎక్కడయినా భయపడినంతవరకూ భయపెడ్తారు. అది వాళ్ళ గొప్పతనం కాదు కేవలం మన పిరికితనం. మధ్యాహ్నం నువ్వూ చూశావుగా ఆ తాగుబోతుని. వాడు కారణం లేకుండా ముఖంలో అమాయకత్వం చూసి ఒక ఆట ఆడిద్దాం అనుకున్నాడు. అదే ఎదురు తిరిగేసరికి తోకముడిచి పారిపోయాడు. ఇది చాలా సహజం" అంది తీవ్రంగా.

"మరయితే ఆ పెద్దమనిషిని చూసేవరకూ ధైర్యం చేయలేదే?" కాస్త వ్యంగ్యంగా అంది చిత్ర.

"తమరేం వ్యంగోక్తులు విసరనవసరంలేదు. మనం మగవాళ్ళకంటే ఎందులోనూ తక్కువ కాకపోయినా శారీరకంగా బలహీనమని తెలీకేం కాదు. అందుకే పొట్టకోస్తే అక్షరంముక్కరానివాడిక్కూడా ఆడపిల్లంటే లోకువ. కనిపించిన ప్రతి ఆడపిల్లనీ లేకిగా, ఆత్రంగా చూట్టం, వీలయితే పనికిమాలిన చెత్తకామెంట్స్ చేయడం, ఇంకా వీలయితే ఇంకేదో చేయడం... ఇదంతా పశుపద్ధతి. కేవలం ఫిజికల్ స్ట్రెంత్ లేనంతమాత్రాన వాళ్ళు చేసే అరాచకాలన్నిటీ్న సహించాలా? ఇలాంటి వాళ్ళంతా నా దృష్టిలో మృగాలకంటే హీనం. కుక్కని కొట్టాలన్నా ఏదో ఆయుధం కావాలి. అందుకే ఆ పెద్ద మనిషి సపోర్ట్ చూసుకోవాల్సొచ్చింది'' అంది బిందు.

"కానీ చూశావుగా బిందూ! వాళ్ళ హితోపదేశం" వర్ష గొంతులో బాధ ధ్వనించింది.

"వాళ్ళని తప్పుపట్టి ప్రయోజనం లేదు వర్షా! ఈ పురుషాధిక్యత అనేది తరతరాలుగా ప్రతివ్యక్తి నరంలోనూ జీర్ణించుకుపోయింది. అయినా మనలాంటి వాళ్లం దాన్ని వదిలించుకునే ప్రయత్నం చేయాలి'' అంది బిందు.

"ఏంలాభం? కందుకూరి, గురజాడ, చలం కూడా చాలా ప్రయత్నాలు చేశారు'' అంది చిత్ర.

"అవును మరి మాలాంటివాళ్ళు ఒకడుగు ముందుకి వేస్తే నీలాంటివాళ్లు రెండడుగులు వెనక్కి లాగుతున్నారు. అందుకే ఎన్ని తరాలు మారినా తిరోగమనంలోనే వున్నాం" బాధగా అంది వర్ష.

"వర్షా! నేను మాత్రం అమ్మాయిని కానా? నాకు మాత్రం స్త్రీలని అణిచివేయడం చూస్తే



సరదానా? కాకపోతే నేను వాస్తవాన్ని గుర్తిస్తున్నాను మీరేమో స్వర్గానికి నిచ్చెన వేయాలని కలలు కంటున్నారు'' అంది చిత్ర.

"స్వర్గానికి నిచ్చెనేం ఖర్మ స్వర్గాన్నే తెస్తే పోలే? ముందు నరకాన్ని అంటిపెట్టుకున్న మీలాంటి వాళ్ళందర్నీ ఆ స్వర్గంలోకి లాక్కురావాలిగా'' అంది వర్ష.

"నోర్మూయ్యవే పిచ్చిమొహమా! ఆ స్వర్గంలో ఏముంది? రంభ, ఊర్వశులు మనకెందుకు? అంతకంటే ఈ భూలోకమే బావుంది, ఎంచక్కా బచన్ సినిమాలు చూసుకుంటూ..." అంది బిందు.

"ఇదొకతి బచన్ పిచ్చిది, అస్సలు సీర్యస్‌నెస్సే లేదు'' చిరుకోపం ప్రదర్శించింది వర్ష.

"సీర్యస్‌నెస్ ఆరోగ్యానికి మంచిది కాదు. ఎప్పుడూ కులాసాగా నవ్వుతూ తుళ్ళుతూ వుండాలి. ఆ మాట నేనే కాదు ఓ సినిమా కవి కూడా చెప్పినట్లు గుర్తు'' అంది బిందు.

"అసలు నవ్వెప్పుడొస్తుందే?" అంది వర్ష.

"నవ్వినప్పుడు'' అంది బిందు.

"ఇదిగో తిక్క జవాబులు చెప్పొద్దు. మీ ఇద్దరిలో ఎవరైనా సరే సరైన సమాధానం చెప్పగల్గితే అందమైన గిఫ్ట్ ఇస్తాను'' అంది వర్ష.

"ఇదిగో జర్నలిస్టూ! నువ్వు మరీ ఇంత నాసి ప్రశ్నలేస్తే ఎలాగే? ఎవర్నయినా ఇంటర్వ్యూ చేస్తూ ఇలాంటి చచ్చుప్రశ్నలేశావంటే వాళ్ళో లుక్కిస్తారు, అంతే అక్కడికక్కడే భస్మమైపోగలవు'' అంది బిందు.

చిత్ర పడీపడీ నవ్వింది.

"టూ బర్డ్స్ ఎట్ వన్ షాట్. ఓ పక్కన నిన్ను తిట్టాను ఇంకో పక్క ప్రాక్టికల్ వేలో సమాధానం చెప్పాను'' అంది బిందు.

"ఏడ్చావులేగానీ మీకు నవ్వు గురించి ఫండమెంటల్స్ కూడా తెలీవన్పిస్తోంది. నవ్వులు అనేక రకాలున్నాయి''

"ఇది మరీ మనని ఎల్‌కేజీ పిల్లల్లా ట్రీట్ చేస్తోందే. మాకూ తెల్సు తల్లీ. చిరునవ్వు, హాస్యపు నవ్వు, వ్యంగ్యపు నవ్వు, మొక్కుబడి నవ్వు, పలకరింపు నవ్వు... ఇలా చాలా వున్నాయి'' అంది బిందు.

"ఇంకో రెండు మర్చిపోయావు'' అంది వర్ష.

చిత్ర, బిందు ఆలోచించారు.

"ఇంకేం లేవు, బిందూ అన్నీ చెప్పింది'' అంది చిత్ర.

"లేదు, మీకు రెండ్రోజులు టైమిస్తాను కావాలంటే ఆ రెండూ చెప్పండి చూద్దాం'' అంది వర్ష. కానీ మరుక్షణమే మర్చిపోయారు దాని గురించి ఆలోచించడం.

ముగ్గురూ బస్‌స్టాప్ చేరుకున్నారు.

"ఈరోజు బాగా గడిచిందే, థాంక్స్ ఎ లాట్ అండ్ విష్ యూ గుడ్ లక్' అంది బిందు.

"విష్ యూ ఆల్ సక్సెస్ ఇన్ యువర్ జాబ్' అంది చిత్ర.

"ముందు నేనే థాంక్స్ చెప్పాలి మీకు. పాపం మీరిద్దరూ నాకోసం లీవ్‌పెట్టి రాలేదూ?" అంది వర్ష.

ఎవరి రూట్ బస్ వాళ్ళెక్కి ఇళ్ళు చేరుకున్నారు.



వర్ష ఉద్యోగంలో చేరి నెల రోజులయ్యింది. ఆమెకి సాధారణంగా డెస్క్ వర్కే వుంటుంది.




అంటే అనువాదాలు చేయడం, రిపోర్టర్లు సేకరించి తెచ్చిన విషయాలని సంక్షిప్తీకరించి, అందులోని ముఖ్యాంశాన్ని పత్రికకి అనుగుణంగా మలచి వ్రాయడం, పేజ్ మేకప్ మొదలయిన పనులు చేయవలసి వుంటుంది.

అదొక వార పత్రిక. ప్రతివారం ఒక ఫీచరుంటుంది. ఆ ఫీచర్ సామాన్యంగా ఏదో ఒక రంగంలో కీర్తి ప్రతిష్టలు సాధించిన వ్యక్తితో ముఖాముఖి ఇంటర్వ్యూ జరిపి, స్థూలంగా వారి జీవిత చరిత్రతోబాటు అవసరమయిన ఫొటోలు కూడా ముద్రిస్తారు.

ఆరోజు వర్ష తన మొదటి జీతం అందుకుంటుంటే మనసంతా ఒక రకమయిన ఆనందంతో గంతులేసింది. అప్పటి వరకూ అమ్మా, నాన్నా ఇచ్చిన డబ్బులు ఎన్నిసార్లు చూసినా కలగని థ్రిల్ ఈ డబ్బుల్లోనే ఎందుకుందని ప్రశ్నించుకుంటే ఆమెకి సమాధానం దొరకలేదు. ఈ నోట్లలో వున్న ప్రతిపైసాలోనూ తన శారీరక లేదా మానసిక శ్రమ వుంది కదా అనుకుని చిత్రమయిన అనుభూతితో తనలో తనే నవ్వుకుంది. వ్యక్తి సైకాలజీని నిర్వచించడం కష్టం. పరుల కార్లో వెళ్ళినా కలగని ఆనందం సొంత సైకిల్‌వల్ల కలుగుతుంది.

వర్ష లంచ్ బ్రేక్‌లోనే ఫోన్ చేసి చెప్పింది. తల్లిని ఇంటికి వెళ్ళొద్దనీ, ఆఫీసు దగ్గరే వెయిట్ చేయమనీను.

వర్ష వెళ్ళేసరికి గిరిజ ఏవో ఫైల్స్ చూస్తూ కూర్చుంది.

"ఏంటమ్మా?! ఇంకా సీట్లోంచి లేవలేదు?" అంది వర్ష.

"నీకోసం బయట వెయిట్‌చేసేబదులు ఇక్కడ పనిచేసుకుంటున్నాను. ఇంతకీ ఎందుకాగమన్నావు?" అంది గిరిజ ఫైల్స్ సర్దేస్తూ.

"సస్పెన్స్ చెప్పను'' అంటూ బయటికి నడిచింది వర్ష.

ఫాను, లైటూ ఆఫ్ చేసి, బాయ్‌కి చెప్పి గిరిజ కూడా వర్షని అనుసరించింది.

ఇద్దరూ ఫుట్‌పాత్‌పై నడుస్తున్నారు.

"ఈరోజు నాకెంత సంతోషంగా వుందో తెల్సా అమ్మా!? ప్చ్... మాటల్లో చెప్పలేను. రియల్లీ మమ్మీ! ఐ కాంట్ డిస్క్రైబ్‌ఇట్ ఇన్ వర్డ్స్... టుడే ఐ గాట్ మై శాలరీ..." అంది వర్ష.

గిరిజ ఏమీ అనలేదు, నవ్వి వూరుకుంది.

"ఏంటమ్మా, ఏం మాట్లాడవు? నాకేనా, అందరికీ ఇలాగే వుంటుందా?" అంది వర్ష.

"మొదటి జీతం అందుకోవడం అందరికీ సంతోషంగానే వుంటుంది''

"అమ్మా, నీకో చీర తీసుకోవాలనుకున్నాను ఫస్ట్ శాలరీతో'

"నా సంగతి తర్వాత చూద్దాం. ముందు నీకు తీసుకుందాం"

"అమ్మా! నీ త్యాగాలు ఈరోజుకాస్త పక్కనపెట్టు. ఈరోజు మాత్రం నేనెలా చెప్తే అలా వినాలి. నేనెక్కడికి రమ్మంటే అక్కడికి రావాలి, అంతే'

వర్ష ఒక బట్టలషాపులోకి దారితీసింది. తల్లికి ఒక చీర, బ్లవుజ్ పీస్, తండ్రికీ, తమ్ముడికీ షర్ట్ పీసెస్ తీసుకుంది.

"ఇదేంటీ వర్షా?! చిన్నదానివి నీకు లేకుండా నాకు తీసుకోవడం ఏమిటి? ఇలా చేస్తే నాకేమైనా సంతోషంగా వుంటుందనుకున్నావా?"

"డోంట్ బీ సిల్లీ మమ్. నౌ అయాం క్రాసింగ్ ట్వంటీవన్... ఇప్పటివరకూ ఎన్నిసార్లు నీకేం లేకుండా నాకు కావల్సినవన్నీ తీసుకున్నావో నేను లెక్కపెట్టలేదు. జీవితంలో నీకంటూ ఏదో ఒకటి కొనిపెట్టడం ఇదే మొదటిసారి, ఇంత చిన్నచిన్న సంతోషాలని కూడా పిల్లలకి ఎందుకు దక్కనివ్వరమ్మా మీ పెద్దవాళ్ళు?'

"ఇప్పుడు తీసుకోవడం కాదు ముఖ్యం. రేపు మరీ ముసలివాళ్ళం అయినాక ఓల్డ్‌ఏజ్‌డ్ హోంలో చేర్చకుండా చూసుకుంటే చాలు'' నవ్వింది గిరిజ.

"నే బ్రతికుండగా మీకలాంటి గతి పట్టనివ్వను'' అంటూనే ఆటో పిల్చింది వర్ష.

అయిదు నిమిషాల్లో ఇల్లు చేరారు.

"అమ్మా! ఈ ఒక్కసారే నీకేం ఇవ్వడం లేదమ్మా. ఈ సార్నుండీ జీతం తెచ్చి నీకే ఇస్తాను, నువ్వే నాకు పాకెట్‌మనీ ఇద్దువు గాని''

"ఇప్పుడు నేనడిగానా, డబ్బుల సంగతి?!"

"అడగకపోయినా చెప్పాల్సిన బాధ్యతుందిగా. ఏం లేదు బిందు, చిత్రలక్కూడా ఏమైనా తీసుకోవాలని..."

"సరే సరే... చాలా లేటైంది పద పద..."

హర్ష వాకిట్లోనే నిలబడి వున్నాడు. గుర్రుగా చూస్తున్నాడు.

"కుక్కర్ అయినా కడిగి పెట్టావా?" అంది వర్ష.




"ఆ, అదొక్కటే తక్కువ. కుక్కరట ఇంకా నయం కూరా, చారూ కూడా చేయొద్దూ?" హర్ష గొంతులో వ్యంగ్యం తొంగిచూసింది.

"ఏం తప్పా చేస్తే? ఎప్పుడూ ఎవరో చేస్తే లొట్టలేయడం కాదు. మనం కూడా చేసి సంతోషపెడదాం అనుకోవాలి''

"ఎప్పుడు చూసినా శతృవుల్లా వాదోపవాదాలేంటీ? నేను వంట సంగతి చూస్తాగానీ, నువ్వు బట్టలు మార్చుకుని ఇల్లు ఊడ్చి, మొక్కలకి నీళ్ళుపొయ్యి'' అంటూ లోపలికెళ్ళింది గిరిజ.

"అమ్మా కూతుళ్ళిద్దరూ అలగ్‌సలగ్ ఎక్కడికెళ్ళారు?" అన్నాడు హర్ష.

"నువ్వు తిరిగే బలాదూర్ల వివరాలు మేమడిగామా?" అంది వర్ష.

"మేమంటే మగ మహారాజులం, ఎక్కడయినా తిరుగుతాం, ఎప్పుడయినా వస్తాం. మీరూ మేమూ ఒకటా?"

"కాలం మారింది బ్రదర్! ఇహనుండీ ఆ

ప్రశ్న మేం అడగ్గలం జాగ్రత్త'

"పిచ్చక్కా! అలాగే పగటికలలు కంటుండు''

"నీలాంటి పనీపాటా లేనివాళ్ళు చేయాల్సిన పని అది. నాకవతల చాలా పనులున్నాయిగానీ ఇదిగో ఈ షర్ట్ పీస్ నీకే. నచ్చితే కుట్టించుకో..."

"నచ్చకపోతే ఎక్స్‌ఛేంజ్ చేస్తావా?" కవర్ లోంచి ఇంకా తీయకుండానే అన్నాడు.

"ఉహూఁ... నీకు నచ్చకపోతే ఒక పిల్లోకవర్‌కి పనికొస్తుంది'' అని నవ్వుతూ బాత్రూమ్‌లో కెళ్ళింది వర్ష.

భోజనాలు చేస్తుండగా, "ఏంటక్కా! షర్టొక్కటి ఇస్తే సరిపోతుందా? మరి పాంటో?" అన్నాడు హర్ష.

"నాకు ప్రమోషన్ వస్తే పాంట్ తీసుకుంటాన్లే'

"అప్పటికి నేను పాంట్లు వేసుకునే ఏజ్ దాటిపోయి పంచెలు కడతానేమో'' పెదవి విరుస్తూ అన్నాడు హర్ష.

ఆ మాటకి గిరిజకి నవ్వొచ్చింది. నోట్లో ముద్దవుండగా నవ్వడాన పొలమారింది. తన కితనే నెత్తిమీద చిన్నగా కొట్టుకుంది.

"అయితే ఇంకో రెండు మూడేళ్ళలోనే పంచెలు కడతావన్న మాట. ఏం చేద్దాం అదంతా నీ ఖర్మ. పోనీ అప్పుడు పంచే కొనిపెడ్తాను, ఓకే?! కావాలంటే ప్రామిస్ చేస్తాను''

"చాల్లే బడాయి. నీకు మరీ ఓవర్ కాన్ఫిడెన్స్. రెండు మూడేళ్ళలోనే ఎడిటర్‌నైపోతాననుకుంటున్నావా?"

"పిచ్చి తండ్రీ! అదా నీ సందేహం?! నేనేం ఎడిటర్‌నైపోతానని చెప్పలేదు, కనీసం మనసులో కూడా అనుకోలా. ఎడిటర్‌కీ, సబెడిటర్‌కీ మధ్య ఇంకా చాలా మెట్లున్నాయి, అదికూడా

తెలీకపోతే ఎలా?"

"పెద్ద గొప్పేలే. అదేం నా ఫీల్డ్ కాదు, తెలియకపోతే నష్టమేం లేదు''

"మీరు మాటలు కట్టిపెట్టి, తిండి తినండి ముందు. మీ నాన్నగారు ఇంకా దయచేయలేదు. ఆయనకి అన్నం పెట్టి, పడుకునేసరికి అర్థరాత్రవుతుంది. రోజూ ఇదే వరస... మళ్ళీ ప్రొద్దున్నే లేవడం, ఉరుకులూ, పరుగులూ..." అంది గిరిజ.

"నాన్న రావడం లేటయినపుడు ఆయన్నే పెట్టుకు తినమంటే ఏమవుతుందమ్మా?! మళ్లీ నువ్వు పొద్దున్నే లేచి, పనులన్నీ చేసుకుని ఆఫీసుకి వెళ్ళాలి కదా..." అంది వర్ష.

"ఏమో నాకు అంత తెలివి లేకపోయింది, రేపు నువ్వు మీ ఆయనకలా చెబుదుగానిలే' అంది గిరిజ.

"నేను అదొక్కటే ఏం ఖర్మలే ఇంకా ఛాలా జాగ్రత్తలు చెప్తాను'' అంది వర్ష.

"పాపం దురదృష్టవంతుడు, ఎక్కడున్నాడో ఏమో'' జాలి పడ్తున్నట్లు అభినయించాడు హర్ష.

"ఒకళ్ళ గురించి జాలిపడి అలసిపోకు, నీ సంగతి నువ్వు చూసుకోముందు. నీ మెడలు వంచి, నీ చేత ఇంటిచాకిరీ అంతా చేయించగలిగే అమ్మాయిని నేనే సెలక్ట్‌చేసి తెస్తాను చూస్తుండు'' అంది వర్ష.

"ప్చ్... వర్షా! ఏంటే ఆ మాటలు? మీరిద్దరూ అసలు అక్కా- తమ్ముళ్ళేనా? నోర్మూసుకు త్వరగా తిని అవతలికి ఛొండి'' అంది గిరిజ.

"అబ్బబ్బా... అసాధ్యమైన పనులు ఎలా చేయగలం?" అన్నాడు హర్ష.

గిరిజ ఏమిటన్నట్లు చూసింది.

"నోర్మూసుకుంటే ఎలా తినగలం నువ్వే చెప్పమ్మా!" అన్నాడు హర్ష.

"సంతోషించానులే అతి తెలివికి'' గిరిజ చిరుకోపంగా అంది.

"థాంక్స్ ఎ లాట్ మమ్! అక్కముందే వున్నమాట చెప్పినందుకు ఏం విన్నావా? నువ్వేమో నాకు తెలివే లేదన్నట్లు మాట్లాడ్తావు. మరి అమ్మేమో ఎడ్జెక్టివ్ కూడా వేసింది చూడు'' అన్నాడు హర్ష.

"తెలుగులో 'వ్యంగ్యం' అని ఒక పద ముంది. ఏ డిక్షనరీనో చూసి ముందు దానికి అర్థం తెలుసుకో చిట్టితండ్రీ'' అంది వర్ష.

ఇంతలో కాలింగ్ బెల్ మోగింది. హర్ష వెళ్ళి తలుపు తీశాడు. దివాకర్ లోపలికొచ్చి షూస్ ఊడదీసి, కాళ్ళతో గోడకి పక్కగా జరిపి గదిలోకెళ్ళాడు.

షర్టు తీసి హాంగర్‌కి తగిలించి వచ్చి హాల్లో ఫానుకి దగ్గరగా కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు.

న్యూస్ పేపర్ మరోసారి తిరగేస్తూ, "గిరిజా! వేణ్ణీళ్లు పెట్టు స్నానానికి'' అన్నాడు.

గిరిజ అప్పటికే భోజనం ముగించి డిషెస న్నీ ఓ పక్కకి సర్దిపెడుతోంది. పిల్లలు కూడా తినేసి చేతులు కడుక్కుంటున్నారు.

గిరిజ గిన్నెతో స్టవ్‌మీద నీళ్ళు పెట్టి, నాప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చి, "ఆ గీజర్ పాడయి అప్పుడే ఇరవై రోజులవుతోంది. బాగుచేయించమంటే పట్టించుకోరు, ఇలా అయితే నెలకి రెండు సిలిండర్లయిపోతాయి మరి'' అంది.

దివాకర్ దానికేం బదులు చెప్పకుండానే "ఈరోజు లెటర్సేం రాలేదా? నాకోసం ఎవరైనా వచ్చెళ్ళారా?" అన్నాడు.

"ఎవరూ రాలేదుగానీ, గీజర్ సంగతి మాట్లాడరే'

"నాకేం చెవుడా? ఎన్నిసార్లు చెప్తావు ఒకే మాట?! రేపు మనిషిని తీసుకొచ్చి బాగుచేయిస్తాను'' కాస్త పరుషంగానే మాట్లాడాడు దివాకర్.

గిరిజ లేచి వెళ్ళి కడిగిన బీన్స్ తెచ్చుకుని ఈనెలు తీస్తూ, "వర్షా! నీళ్ళు కాగాయేమో చూసి, బకెట్‌లో పోసి నీళ్ళు పట్టు'' అంది.





వర్ష ముందు బాత్రూమ్‌లో బకెట్ కడిగి పంపు తిప్పి వచ్చి, వేడినీళ్ళు తీసికెళ్ళి పోసి, "వెళ్ళండి నాన్నా స్నానానికి'' అంది.

దివాకర్ టవల్ భుజాన వేసుకుని వెళ్ళాడు.

"వర్షా! కాస్త పళ్ళెం కడిగి అన్నం పెట్టవే నాన్నకి, నేనొచ్చి కూరలవీ వేస్తాను'' అంది గిరిజ.

"పెడ్తానుగానీ, ముందు స్నానం చేసి రానీ. ఇప్పుడే తింటారో ఇంకా ఆగుతానంటారో ముందే పెడితే మళ్లీ అరుస్తారు'' అంది వర్ష.

దివాకర్‌కి కోపం ముక్కు మీదే వుంటుంది. తనకి సంబంధించి ఏ పనిలోగానీ మాటలో గానీ వెంట్రుకవాసి భేదం కన్పించినా పోనీలెమ్మని సరిపెట్టుకోడు. పెద్ద పెట్టున నోరుపారేసుకుంటాడు.

వర్ష దుప్పట్లవీ సరిచేసి రేడియో పెట్టింది.

"అక్కా! రేడియో తీసెయ్! నేను కాసేపు చదువుకుని పడుకుంటాను'' అన్నాడు హర్ష.

"ష్... షటప్... నీకంటే పెద్దదాన్ని, నన్ను డిక్టేట్ చేయకు. కావాలంటే లోసౌండ్‌లో పెట్టుకుంటాను, గమ్మున చదువుకో'' అంది వర్ష.

"నాకు కాన్‌సన్‌ట్రేషన్ కుదరదు'' అన్నాడు హర్ష.

"డామిట్! నువ్వెక్కడి నక్షత్రకుడివిరా నా పాలిట? చదువుకో నాయినా చదువుకో. ఫోజులకేం లోటులేదు. అసలు నీకో సంగతి తెల్సా?! ఎప్పుడు చూసినా పుస్తకాలు తిరగేసేవాళ్లు కనీసం పాస్ కూడా కారు. రేపు పరీక్షనగా ఈవేళ పుస్తకాలు దుమ్ముదులిపే వాళ్లు కొండొకచో స్టేట్ రాంకులు కూడా కొట్టివేయుదురు'' అంటూవెళ్లి రేడియో ఆఫ్ చేసి హాల్లోకి వస్తుంటే,

"థాంక్ గాడ్, నువ్వు టీచర్ కాలేదు. అయితే పిల్లలందర్నీ సర్వనాశనం చేసేదానివి ఇలాగే హితబోధలు చేసి'' అంటూ హర్ష అన్న మాటలు విన్పించి తనలో తనే నవ్వుకుంది.

ఈలోపు స్నానం చేసి, లుంగీ కట్టుకు వచ్చిన తండ్రిని ఉద్దేశించి "అన్నం పెట్టనా నాన్నా?" అంది వర్ష.

"కాస్తాగి తింటాను, అమ్మ పెడ్తుందిలే. ఇంతకీ నీ జాబ్ ఎలా వుంది? ఆర్యూ శాటిస్‌ఫైడ్?!" అన్నాడు దివాకర్.

వర్ష అవునన్నట్లు తలూపింది.

గిరిజ కల్పించుకుని "మీ అమ్మాయి తన మొదటి జీతంతో మనకి బట్టలు తీసుకుంది'' అంది.

"చిన్నదానివి నువ్వు తీసుకోవడమేంటమ్మా'' నవ్వాడు దివాకర్.

వర్ష సమాధానంగా నవ్వి వూరుకుంది.

దివాకర్ టీవీ చూస్తూ కూర్చున్నాడు.

వర్ష చాకు, పీట తెచ్చి "బీన్స్ ముక్కలు కోయనా?" అంది.

"ఒద్దు, నీకు లేటవుతుంది, నువ్వు కాస్త బియ్యం ఏరి రెడీగా వుంచు రేపటికి అంది'' గిరిజ.

దాదాపు ప్రతి రోజూ ఇంతే. ఉదయం హడావిడిలో పని తెమలదని, కూరలు తరిగిపెట్టుకోవడం లాంటి పనులు గిరిజ ముందే చేసిపెట్టుకుంటుంది.

వర్ష కొన్ని బియ్యం చకచకా ఏరేసి, ఉదయం వేసుకోవాల్సిన బట్టలు రెడీగా పెట్టుకుని, వెళ్లి పడుకుంది. ఆమెకి చాలా సేపు నిద్రపట్టలేదు. తల్లిని గురించి ఆమెకి చాలా దిగులుగా వుంటుంది. తెల్లవారు ఝామున ఐదున్నరకి లేస్తే రాత్రి పడుకునే సరికి పదకొండు, పదకొండున్నర అవుతుంది. ఈమధ్యలో ఒక్క క్షణం కూడా ఆవిడకి తీరిక వుండదు, అవిశ్రాంతంగా ఏదో ఒక పని చేస్తూనే వుంటుంది.

స్త్రీలకి ముందే పని ఎక్కువనుకుంటే ఇక ఉద్యోగం చేసే స్త్రీల సంగతి మరీ ఘోరం.

ఇక అమ్మకి సుఖం లేదా? ఇలా అవిశ్రాంతంగా ఎన్నాళ్లు కష్టపడ్తుంది? ఉద్యోగం నేను చేస్తున్నాగా, ఇక తనని జాబ్ మానేయ

మంటే? ఒప్పుకుంటుందా? లేకపోతే రిటైర్ అయ్యేవరకూ అంటే ఇంకా పన్నెండేళ్లు ఇలా నిరంతరం కష్టపడ్తూ... బాప్రే.. వర్ష ఇలా ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రపోయింది.

వర్ష ఉదయం లేచేసరికి ఏడున్నరయింది. మొహం కడుక్కొని, కాఫీ తాగి, ఒక అయిదు నిమిషాల్లో పేపర్ పైపైన చదివేసి, ఇల్లు ఊడ్చింది.

వంటింట్లో తల్లి కూరకి పోపు పెడ్తుంటే వర్ష ఆమె పక్కకి వెళ్లి నిలబడి "అమ్మా! నీతో చాలా రోజులుగా ఒక విషయం చెప్పాలను కుంటున్నాను'' అంది, గొంతు సరిచేసుకుని.

"ఏంటి? ఎవడినయినా ప్రేమించావా?" నవ్వింది గిరిజ.

"మా అమ్మక్కూడా సెన్సాఫ్ హ్యూమర్ పెరిగిపోతోందే? కంగారు పడకమ్మా. అలాంటి విషయాలు మరీ వంటింట్లోనో, పెరట్లోనో చెప్తే ఎఫెక్టివ్‌గా వుండవు. ఒకవేళ అలాంటి పరిస్థితి వస్తే ఏ విశాఖ బీచ్‌కో తీసికెళ్లి, కెరటాలు చూస్తూ..."

"సర్లేగానీ నోర్మూసుకుని విషయమేంటో చెప్పు'' అంది గిరిజ.

"ఏం లేదు, నువ్వు నీ జాబ్ రిజైన్ చెయ్యొచ్చుగా?!"

"నేను ఉద్యోగం మానేస్తే నీకు మంచి మొగుడెలా వస్తాడే?"

"ఏంటమ్మా, నీ పిచ్చి మాటలు?"

"అవునుమరి, మగపిల్లల రేట్లెలా వున్నాయో చూస్తున్నాంగా. పిండి కొద్దీ రొట్టె అన్నట్లు దండిగా కట్నమిస్తేనే నీకు మంచి సంబంధం తేగలం" అంది కూరగిన్నె దించేసి, పాలగిన్నె పెడుతూ గిరిజ.

"ఆహాహా... అసలు విషయం ఇదన్న మాట. నా పెళ్లికోసం నువ్వింత కష్టపడడం నాకిష్టంలేదు. అమ్మా! నీకెన్నోసార్లు చెప్పాను, మళ్లీ చెప్తున్నాను, కట్నం తీసుకునే బాక్‌బోన్ లేని వెధవల్ని నేను ఎప్పటికీ పెళ్లి చేసుకోను'' అంది వర్ష.

"ఆc ఆc ఫోల్డ్ యువర్ టంగ్‌మై ఛైల్డ్. నన్ను చేసుకోడానికి మీ నాన్న కూడా కట్నం పుచ్చుకున్నారు'' స్వరం తగ్గించి అభి నయిస్తూ చెప్పింది గిరిజ.

"అవున్లే నాన్న మాత్రం మగమహారాజు కాదా ఏం? వున్నాడుగా నీ పుత్రరత్నం... వాడూ తీసుకుంటాడు. ఏమున్నా లేకపోయినా మగ అనే క్వాలిఫికేషన్ ఒక్కటుంటే చాలు. ఏదేమైనా నీకు అలాంటి పట్టింపు లేదేమో చేసుకున్నావు. కానీ నాకు మాత్రం అసహ్యం కట్నం తీసుకునే వాళ్లంటే'' అంది వర్ష.

"సర్లే తల్లీ! ముందు అందరూ ఇలాగే అంటారు. అయితే ఆ ముహూర్తం కలిసొచ్చేస రికి ఈ మాటలన్నీ నీటిమూటల్లా మాయమౌ తాయి. అయినా నీ పెళ్లికి ఇంకా చాలా టైముందిగానీ ముందు ఈ కాఫీ కప్పు తీసికెళ్లి మీ నాన్నకిచ్చి, నువ్వు త్వరగా స్నానం చెయ్యి, మళ్లీ బాత్రూం ఖాళీ వుండదు'' అంది గిరిజ.

వర్ష సుతారంగా తలపై కొట్టుకుంటూ కాఫీ కప్పు పట్టుకుని తండ్రి గదిలోకెళ్లింది.

వర్ష మరో గంటలో స్నానం చేసి, తయారై, భోజనం చేసి ఆఫీసుకి బయల్దేరింది.

ఆఫీసులో పదకొండున్నర అయింది. వర్ష టీ సిప్ చేస్తూ, సిగరెట్లకి సంబంధించిన ఆర్టికల్ చదువుతోంది, దాన్ని ఎలా మోల్డ్ చేసి రాస్తే బాగుంటుందా అని ఆలోచిస్తూ.

అప్పుడే ఆఫీస్ బాయ్ ఆమె దగ్గరికొచ్చి ఎడిటర్ పిలుస్తున్నట్లు చెప్పాడు.

వర్ష టీ కప్పు పక్కన పెట్టేసి ఎడిటర్ కాబిన్‌లోకి వెళ్లింది. ఆయన బిజీగా ఏదో రాసుకుంటున్నారు.

"ఎక్స్‌క్యూజ్‌మీ సర్!" అంది వర్ష.

ఎడిటర్ తలెత్తి "ప్లీజ్, కమ్'' అన్నారు.

ఆమె వెళ్లి ఆయన ఎదురుగా కూర్చుంది.

ఎడిటర్ రాస్తున్నది పక్కనపెట్టి "ఫీచర్




సంగతి బహుశా మీకీపాటికి తెలిసే వుంటుంది. మన సబెడిటర్స్‌లో ఒక్కొక్కళ్లు ఒక్కో వారం టేకప్ చేస్తున్నారు దాన్ని. ఒక రౌండ్ అందరూ అయ్యాక మళ్లీ మొదటివాళ్లకి వస్తుంది. ఈసారి మీకు ఇద్దామనుకుంటున్నాను'' అన్నాడు.

వర్ష సరేనన్నట్లు తల పంకించింది.

"ఫోర్స్‌డ్‌గా కాదు, చేయగలరో లేదో చెప్పండి. ఒకటి రెండుసార్లు ఇంకెవరితోనయినా వెళ్లి చూస్తానంటే ఆ ఏర్పాటు చేస్తాను''

"అఖ్ఖర్లేదండీ.. నేను చేయగలను. పాత ఫీచర్స్ చాలా చదివాను, ఆ ప్రొసీజర్ నాకు అర్థమైంది'' అంది వర్ష.

"అయితే ఫేమస్ రైటర్ ఈశ్వరీదేవిని ఇంటర్వ్యూ చేయాలి. అపాయింట్‌మెంట్ కూడా తీసుకున్నాం. రేపు సాయంత్రం నాల్గింటికి. మర్చిపోవద్దు. ఒక పది నిమిషాలు ముందే వెళ్లాలి తప్ప లేట్ మాత్రం కాకూడదు''

"అలాగే, థాంక్సండీ''

"ఆల్‌ది బెస్ట్. ఒకటి రెండుసార్లు కాస్త భయంగా వుంటుంది. తర్వాత ఇలాంటివే ఇంట్రస్టింగా వుంటాయి''

వర్ష నవ్వుతూ బయటికి వచ్చేసింది. ఆమె కొలీగ్సందరూ కంగ్రాట్స్ చెప్పారు.

"వచ్చిన నెల రోజులకే ఫీచర్ అప్పగించారంటే సామాన్యమైన విషయం కాదు, స్వీట్ తెప్పించండి'' అంటూ నవ్విందొకావిడ.

వర్షకి తెలుసు, వాళ్లంతా తననేదో మాటవరసకి ప్రశంసించాలని అలా మాట్లాడ్డమే తప్ప నిజానికి అందులో విశేషమేమీ లేదని. అన్ని పనుల్లో భాగమే ఫీచర్ కూడా. కాకపోతే అది కాస్త బాధ్యతతో కూడుకున్న పని. డెస్క్ వర్కయితే నింపాదిగా, ఆలోచించి చేయడం, కుదరకపోతే మరోసారి చేయడం ఇలా వారి చేతిలో పని. కానీ ఇంటర్వ్యూ అనేసరికి త్వరపడి తోచిన ప్రశ్నలు వేసి వారికి విసుగు తెప్పించి, తాము చికాకుకి లోనవకుండా, ఆలోచించి జాగ్రత్తగా అవసరమయిన ప్రశ్నలు మాత్రమే వేయడం, అవతలివాళ్లు చెప్పే సమాధానాలని సావధానంగా వినడం, విన్నవాటిని కుదించి, ఒక వరసక్రమంలో రాయడం ఇలా అప్రమత్తతలో కూడిన పని.

సాయంత్రం టీ బ్రేక్‌లో చిత్రకి ఫోను చేసి చెప్పింది ఈశ్వరీదేవి సంగతి.

"నేనూ రానా? ఆవిడ నాకు తెలుసు'' అంది చిత్ర.

"నీకెలా తెలుసు?" కాస్త ఆశ్చర్యపోయింది వర్ష.

"లాస్టియర్ మా స్కూల్ ఏనివర్సరీడేకి ఆవిడ చీఫ్‌గెస్ట్‌గా వచ్చారు. పరిచయం చేసుకున్నాను. ఒకసారి వెళ్లాను కూడా. అయినా ఈ సంగతి నీకెపుడూ చెప్పలేదా, మర్చిపోయానేమో'' అంది చిత్ర.

"నువ్వేం రావద్దు. ఇది నేను ఛాలెంజింగ్‌గా తీసుకుంటున్నాను. నేను కేవలం పత్రిక తరపునే వెళ్తాను. అడ్రెస్ ఇచ్చారుగానీ నువ్వు కాస్త లొకేషనదీ చెప్పు, ఆ ఏరియా నాకసలు తెలీదు'' అంది చిత్ర.

చిత్ర వివరాలన్నీ చెప్పి, ఆవిడ కలుపుగోలుగా వుంటారనీ, నర్వస్‌గా ఫీలవద్దనీ చెప్పి, ఫోను పెట్టేసింది.

వారి ముగ్గురిలో చిత్రకి మాత్రమే ఇంట్లో ఫోనుంది. ఆమెకి స్కూల్లో కూడా ఫోనుంది కానీ, సామాన్యంగా క్లాసెస్ డిస్టర్బ్ అవుతాయని పిలవరు, అవసరమయితే మెసేజ్ చెప్పమంటారు.

చిత్ర స్కూలు మూడున్నరకల్లా అయిపోతుంది. ఇల్లు చాలా దగ్గరే కాబట్టి పది నిమిషాల్లో ఇంట్లో వుంటుంది.

వర్ష కొన్ని ప్రశ్నలు తయారు చేసి, అనుభవజ్ఞులయిన కొలీగ్స్‌కి చూపింది. వాళ్లు అవసరమయిన సలహాలూ, సూచనలూ ఇచ్చారు. అప్పటికి కాస్త స్థిమితంగా అన్పించింది.

★ ★ ★

వర్ష దారిలో అంతా రకరకాల ఊహలు చేసింది. ఇల్లు మహా పోష్‌గా వుండివుంటుంది. గేటు దాటగానే కావల్సినంత ఖాళీ ప్రదేశం, ఓ పక్కగా లాన్, దాని మధ్యలో స్టాండుకి వుంచిన ఊయల... రకరకాల పూలమొక్కలు, క్రోటన్లు అవి దాటి వెళ్తే అత్యాధునికమయిన బంగళా.. గేటు బయట గూర్ఖా చాలదన్నట్లు అక్కడ సింహాల్లాంటి మరో రెండు ఆల్సేషియన్ డాగ్స్, కట్టేసివున్నా విజృంభించి మొరుగుతున్న వాటిని చూసి తాను బెదిరిపోయి నిలబడితే అపుడు ఒక పనివాడొచ్చి తన వివరాలు అడిగి, లోనికి వెళ్లి చెప్తాడు. అతడు తిరిగి వచ్చి లోనికి రమ్మంటున్నారని చెప్తే అపుడు తను వెళ్తుంది. తను వెళ్లి ఓ పావుగంట వెయిట్ చేస్తే అపుడు ఈశ్వరీదేవి మహారాణిలా తల పంకిస్తూ వచ్చి ఎదురుగా కూర్చుంటుంది.

ఆమె ఇలాంటి ఆలోచనల్లో వుండగానే ఆటో డ్రైవర్ "మారేడ్‌పల్లి వచ్చింది, ఇల్లెక్కడో చెప్పండి'' అన్నాడు. ఆమె గుర్తులు చెప్తే అతనే మధ్యలో కనుక్కుంటూ మొత్తానికి గమ్యం చేర్చాడు.

ఆటో ఫేర్ చెల్లించి అనుమానంగా పదేపదే ఇంటినంబర్ చెక్ చేసింది వర్ష. నిస్సందేహంగా అదే ఇల్లు.

ఒక్క నిమిషం ఆమె ఆశ్చర్యంలో మునిగిపోయింది. తన ఊహలకిపూర్తి భిన్నంగా ఇల్లు సాదాసీదాగా వుంది. చూడగానే మామూలు మధ్య తరగతివారు నివాసముండే ఇల్లుగా తెలిసిపోతుందది.

వర్షకి కాలింగ్‌బెల్ కొట్టాల్సిన అవసరమే లేకపోయింది. తలుపులు బార్లా తెరిచి వున్నాయి.

తలుపు మీద చిన్నగా శబ్దం చేసి "ఎక్స్‌క్యూజ్‌మీ'' అంది.

"ఎవరు కావాలి?" సుమారు నలభయ్యేళ్ల వయస్సున్న స్త్రీ చిరునవ్వుతో వరండాలోకి ప్రవేశించి అంది.

వర్ష ఆవిణ్ణి స్వయంగా చూట్టం అదే మొదటిసారయినా ఇంతకుముందు ఆవిడ ఫొటోలు పత్రికలో చూసి వుండడాన ఆవిడే ఈశ్వరీదేవి అని గుర్తు పట్టింది.

"మేడమ్! మై నేమీజ్ వర్ష, ఐయామ్ కమింగ్ ఫ్రమ్ ప్రమోదావీక్లీ'' నవ్వుతూ చెప్పింది వర్ష.

"నైస్ టు మీట్‌యూ. కం అండ్ టేక్ యువర్ సీట్' అంది ఈశ్వరీదేవి కుర్చీ చూపుతూ.

నీళ్లు కావాలా అని ప్రశ్నించి, తానే స్వయంగా నీళ్లు తెచ్చిచ్చింది. ముందు కొంతసేపు రిలాక్సవమని చెప్పింది. ఏం చదివావు, ఉద్యోగంలో ఎప్పుడు చేరావు, నీ మాతృభాషేంటి లాంటి మామూలు ప్రశ్నలడిగింది. తన మాతృభాషేంటో తెలుసా అని ప్రశ్నించింది. ఇంతవరకూ ఆవిడ ఇంగ్లీషులోనే మాట్లాడింది.

ఇక అప్పుడు మాత్రం ఈశ్వరీదేవిలో ఆవేశం కట్టలు తెంచుకు బయటికొచ్చింది. "చూడమ్మా! నీ పేరేంటి, వర్షేనా?! ఏ దేశంలోనూ ఏ రాష్ట్రంలోనూ లేని జబ్బొకటి మన వాళ్లకి కేవలం మన వాళ్లకి సోకింది. ఇద్దరు తమిళులు కలిస్తే తమిళంలో మాట్లాడుకుంటారు, ఇద్దరు బెంగాలీలు కలిస్తే బెంగాలీలో మాట్లాడుకుంటారు. అలాగే ఇంగ్లీషువాళ్లు ఫ్రెంచ్‌వాళ్లు తమతమ భాషల్లో మాట్లాడుకుంటారు. కానీ మనవాళ్లుమాత్రం మన భాష తప్పించి ఇంకేదైనా మాట్లాడ్తారు'' అంది.

వర్ష ఊహించని సంఘటన ఇది, ఆమె కళ్లప్పగించి చూస్తోంది.

"ఏమ్మా! నువ్వు పుట్టింది ఆంధ్రదేశంలో, పెరిగిందీ పెరుగుతోందీ కూడా ఇక్కడే. మరి నీకు తెలుగు కంటే ఇంగ్లీషు బాగా వచ్చునని నమ్ముతున్నావా? చూడమ్మా! భాషల విషయంలో నాకెలాంటి అపోహలూ లేవు. ఒకటి గొప్పదీ, ఇంకోటి పనికిమాలిందీ అని నేననుకోను. ఇంగ్లీషు నేర్చుకో. దాని వల్ల చాలా




లాభాలున్నాయి. కావల్సినంత సాహిత్యం చదువుకోవచ్చు. ఇంగ్లీష్ కామన్ లాంగ్వేజ్ అయ్యింది కాబట్టి ఇతర భాషల వాళ్లతో దీని సహాయంతో సత్సంబంధాలు నెలకొల్పుకోవచ్చు''

"కానీ మేడమ్! చాలామంది ఇంగ్లీష్‌లో మాట్లాడ్తేనే మనని గుర్తించేవాళ్లున్నారు మన చుట్టూ'' ననిగింది వర్ష.

"అది వాళ్ల ఖర్మ. ఒకరి కోసం మన పద్ధతులూ, అలవాట్లూ మార్చుకోవడం పొరపాటు. నువ్వు తెలుగులో మాట్లాడినంత హాయిగా మరే భాషలోనూ మాట్లాడలేవు, కాదంటావా?"

"అవునండీ, ఒప్పుకుంటాను. చాలాసార్లు ఇంగ్లీష్‌లో పదాల కోసం తడుముకోవాల్సి వస్తుంది'' అంటూ నవ్వింది వర్ష.

"ఇప్పుడు నాకు నచ్చావు. మన నమ్మకాలూ, సిద్ధాంతాలూ ఒకరికోసం మార్చుకోవడం లేదా వదిలేయడంలో అర్థం లేదమ్మా''

వర్ష చిన్నగా నవ్వింది. ఆమె పైకి నవ్వుతున్నా, మామూలుగానే వున్నట్లు కన్పించినా లోపల మాత్రం బెదిరిపోయింది. 'ఈవిడకేమిటి మరీ ఇంత అహంకారం, ఇంత నిర్మొహమాటంగా మాట్లాడి ఇలా అవమానపరుస్తోందేమిటి' అనుకుంది.

ఇక నదిలో పడ్డాక ఈత తప్పదన్నట్లు, హేండ్‌బాగ్‌లోంచి నోట్‌బుక్ తీసింది ప్రశ్నల వర్షం కురిపించడానికి సిద్ధమై.

అయితే ఈశ్వరీదేవి వారించింది. ఆవిడ టీ తెమ్మని ఎవర్నో పురమాయించి, "కాస్త టీ తాగగానే మొదలెట్టు నీ కార్యక్రమం. అన్నట్లు నా మాటలకేవన్నా బాధపడ్డావా, నేను కాస్త నిర్మొహమాటపు మనిషినమ్మాయి'' అంది.

వర్ష లేదన్నట్లు అడ్డంగా తలూపింది.

టీ తాగడం ముగిశాక వర్ష తనకు కావలిసిన ప్రశ్నలు వేసి సమాధానాలు క్లుప్తంగా రాసుకుంది.

వర్షకి ఆమెతో మాట్లాడ్తున్నంతసేపూ గాబరాగానే వుంది. తనకు తెలియకుండానే ఇంగ్లీష్ పదాలు దొర్లిపోతాయేమో, మళ్లీ ఆవిడేదో మాట్లాడి మూడాఫ్ చేస్తుందేమోనని. తన సందేహాన్ని ఆవిడ ముందుంచగా, నవ్వుతూ "నేను ముందే చెప్పాను భాషలపట్ల నాకు ఎలాంటి అపోహలూ లేవని. ఏ భాషా అంటరానిది కాదు. మన భావాన్ని చెప్పడానికి ఏది ఎక్కువ అనువుగా వుంటే దాన్ని వాడాలి. తెచ్చిపెట్టుకునీ లేదా కష్టపడీ మాట్లాడ్డం అనవసరమన్నాను గానీ అనుకోకుండా దొర్లే పదాల సంగతి కాదమ్మా'' అందావిడ.

అప్పటికి వర్షకి ఆవిడపట్ల సదవగాహన కలిగింది.

"మేడమ్! ఫెమినిస్ట్ రైటర్లపై మీ అభిప్రాయం?"

"స్త్రీవాది, పురుషవాదీ అంటూ వేరువేరు కొమ్మలు పట్టుకు వేళ్లడం కంటే మానవతావాది కావడం ముఖ్యమని నేననుకుంటున్నాను. దీనిమీద ఇంతకంటే మాట్లాడ్డం కూడా నాకిష్టం లేదు''

ఫీచర్‌కి అవసరమయిన సామగ్రి సమకూరాక "మేడమ్! ఫొటోగ్రాఫర్‌కి ఈ రోజు వేరే ఎంగేజ్‌మెంట్ వుండడాన రాలేకపోయారు, అతను రేపొస్తారు. రేపు మీకు మళ్లీ ఇబ్బంది కలిగించక తప్పడంలేదు. ఒక్క పదినిమిషాలు మాత్రమే... ఏ టైంలో రమ్మంటారు?" అంది వర్ష.

"సాయంత్రం ఎప్పుడయినా ఫరవాలేదు. నువ్వింత బతిమిలాడాల్సిన అవసరం లేదమ్మాయి, పబ్లిసిటీ పెరిగేది నాకేగా'' నవ్విందావిడ.

వర్ష కూడా నవ్వి కృతజ్ఞతలు తెలియజేసి వచ్చేసింది.

దోమలగూడ చేరేసరికి పావు తక్కువ ఆరయ్యింది.

"చాలా లేటవుతుందన్నావు, త్వరగానే వచ్చావే. ఇంతకీ ఎలా చేశావు?" అడిగింది తల్లి.

**'మేరి'**
31 సంవత్సరాలకు పైగా
ప్రపంచమంతటా స్త్రీలు
అలంకరించుకుంటున్న
ఆకర్షణీయమైన, అందమైన,
అసాధారణ మన్నిక గల
గోల్డ్ కవరింగ్ ఆభరణాలు

మేరి ఇప్పుడు మిరుమిట్లు గొలిపే రంగులలో, మనోరంజకమైన డిజైన్లలో స్వచ్ఛమైన వెండితో తయారుచేసి, బంగారు పూతపూసి; అమెరికన్ డైమండ్లు(A.D.)అమర్చిన ఆభరణాలను పరిచయం చేస్తోంది.

వి.పి.పి. ద్వారా ఆభరణాలు తెప్పించుకోవచ్చు. ఎన్ని ఆభరణాలు కావాలో పేర్కొంటూ మాకు వ్రాయండి. భరతనాట్య కళాకారులకు, దేవాలయ విగ్రహాలకు ఆభరణాలు మా ప్రత్యేకత. ఉచిత రంగుల క్యాటలాగ్ కోసం వ్రాయండి. ఉత్తర ప్రత్యుత్తరాలు హిందీ లేదా ఇంగ్లీష్‌లో మాత్రమే వ్రాయవలెను.


No:187 **Rs. 300/50**


No:28 **Rs. 200/50**



No:133 **Rs. 150/50**


No:145 **Rs. 200/50**



No:876 **Rs. 400/50**
A.D.


No:114 **Rs. 200/50**


Np:40 **Rs. 175/50**


A. D.
No:831 **Rs. 500/50**


No:231 **Rs. 300/50**



No:3 **Rs. 200/50**



No:47 **Rs. 200/50**


No:171 **Rs. 200/50**


No:290 **Rs. 300/50**

No:197 **Rs. 400/50**

MGC/127/94


No:93 **Rs. 400/50**
No:50 **Rs. 400/50**


No:262 **Rs. 600/50**


No:123 **Rs. 200/50**


No:24 **Rs. 400/50**

No:966 **Rs. 400/50**
A. D.


A. D.
No:828
**Rs.**
**1550/50**


No:257 **Rs. 350/50**


A. D.
No:916 **Rs. 300/50**


No:8 **Rs. 200/50**

# MERI GOLD COVERING WORKS
P.O. Box 1405, 18, Ranganathan Street, T. Nagar,
Madras 600 017, Phone: 444671, 442513

వర్ష జరిగిందంతా క్లుప్తంగా చెప్పింది.

"చూడమ్మా! చెంపమీద కొట్టి, దెబ్బ తగిలిందా అని అడిగినట్లు అంతా అనేసి బాధపడ్డావా, నేను నిర్మొహమాటపు మనిషిని అంటుందావిడ" మూతి ముడిచి చెప్పింది వర్ష.

గిరిజ నవ్వుతూ "ఆవిడన్నదాంట్లో తప్పేముంది? నాకూ నచ్చదు అనవసరంగా ఇంగ్లీష్ మాట్లాడ్డం" అంది.

"ఆం పెద్ద గొప్పేలే, అలాంటప్పుడు మమ్మల్ని ఏ గురుకుల పాఠశాలల్లోనో చేర్పించకపోయావా?"

"నేనలాగే అనుకునేదాన్ని, కానీ మీ నాన్నకలా ఇష్టం లేదు"

'ఆఖరికి పిల్లల పెంపకం, భవిష్యత్తులపై కూడా తల్లులకంటే తండ్రుల పెత్తనమే వుందన్నమాట', అనుకుంది వర్ష మనసులో.

రెండు నిమిషాలు మౌనంగా వుండి "ముందు కోపమొచ్చినా ఆవిణ్ణి నేనర్థం చేసుకున్నాన్లే అమ్మా! ఇకమీదట అత్యవసరమయితే తప్ప ఇంగ్లీషు మాట్లాడకూడదని కూడా నిర్ణయించుకున్నాను" అంది వర్ష.

"అబ్బో, గొప్ప ఘనకార్యం చేశావే"

"అది సరే అమ్మా! ఆవిడ నన్నెందుకు నువ్వు అనాలి? నాకేం నచ్చలేదు"

"మరి, అక్కడే చెప్పకపోయావా?"

"మొహమాటం ఒకటి ఏడ్చిందిగా, బాగోదని చెప్పలేదు"

"చిన్నపిల్లే కదా అనుకొని వుండచ్చు"

"ఏం చిన్నపిల్లా? ఉద్యోగం చేస్తున్నానా లేదా?"

"ఏమో తల్లీ, ఈ కాలప్పిల్లలు తెలివి మీరిపోయారు"

"పోన్లేగానీ నువ్వు మాత్రం నా ఫ్రెండ్సెవరు వచ్చినా సరే మీరు అనే మాట్లాడమ్మా! లేకపోతే వాళ్లూ నాలాగే తిట్టుకోగలరు మనసులో" అంది వర్ష.

"నీ ఫ్రెండ్సేం ఖర్మ తల్లీ! రేపు నీకు పుట్టే పిల్లల్ని, ఆఖరికి నీ మనవరాళ్లని కూడా గౌరవిస్తాను సరేనా?"

"చెప్పలేం ఆ కాలం కూడా రావచ్చు" అని స్నానానికి వెళ్లింది వర్ష.

స్నానం చేసి, బయటికెళ్లి చిత్రకి ఫోన్ చేసి మళ్లీ జరిగినవన్నీ ఏకరువు పెట్టింది.

చిత్ర ఫోన్లోనే తరంగాలుగా నవ్వింది.

చిత్ర ఈశ్వరీదేవి గురించి ఇంకా అనేక విషయాలు చెప్పింది. వెంటనే ఆవిడపై ఎంత కోపమొచ్చిందో, ఆలోచించిన కొద్దీ ఆవిడపై అభిమానం పెరగసాగింది.

ఇంటికొచ్చి, భోజనం త్వరగా ముగించి కాగితాలు ముందేసుకొని టేబుల్ ముందు కూర్చుంది. రఫ్ మెటీరియల్ ఆధారంతో ఆర్టికల్ పూర్తి చేసింది.

తల్లి పాలు కాచే ప్రయత్నంలో వుండగా 'అమ్మా! పాలు కాచి తోడేస్తానుకానీ, నువ్విది చదువు ముందు' అంటూ రాసిన ఆర్టికల్ అందించింది.

"ఏమోనే, వాటి గురించి నాకేం తెలుసు? నాకయితే బాగానే వుంది మరి" అందావిడ.

"నీకు నచ్చితే చాల్లేమ్మా" అంది వర్ష.



బిందు బద్ధకంగా లేచింది. ఆమె నిద్రప్రియ. దేశకాలమాన పరిస్థితులలో నిమిత్తం లేకుండా నిమిషంలో నిద్రపోగలదు. ఎంత

సేపు పడుకున్నా తనివితీరదు. లేచేపుడు మాత్రం బలవంతంగానే లేస్తుంది. కానీ ఒకసారి లేచాక మాత్రం మళ్ళీ పక్కపై పడుకునేవరకూ చలాకీగా వుంటుంది.

పక్కబట్టలు మడుస్తూ టైం చూసింది. ఆరున్నర అవుతోంది.

బ్రష్‌మీద పేస్టు వేసుకుని బాత్రూంవైపు నడుస్తుంటే పాలబ్బాయి కేక విన్పించింది. తల్లో, చెల్లెలో పోయించుకుంటారని ఆమె పట్టించుకోలేదు.

అదో సాధారణమయిన ఇల్లు. ఇద్దర్ని మించి ఇముడ్చుకోలేని అతి చిన్న కిచెను, మంచాలు వాల్చాక సన్నటి దారిలా మిగిలే జాగా గల రెండు పడకగదులు, ఈ మూడింటినీ తనలోకి ఆహ్వానిస్తూ మధ్యగా వున్న హాలు. వారి స్తోమతుకది పెద్దింటికిందే లెక్క.

ఆ ఇంట్లో ఎవరు ఎక్కడ ఏం మాట్లాడినా రెండో వ్యక్తికి దాదాపు విన్పిస్తూనే వుంటుంది.

తల్లి పాల గిన్నె తీసుకువెళ్ళడం, పాలు పోయించుకోవడం, పాలతను డబ్బులడగడం, తల్లి తర్వాత రమ్మనడం, అతడు కాదు అప్పుడే కావాలనడం... అంతా వింటోంది బిందు.

తల్లి అతడిని అక్కడే నిల్చోబెట్టి ఇంకా నిద్రలేవని తండ్రి గదిలోకెళ్ళింది.

"ఏవండీ! మిమ్మల్నే... కాస్త లేస్తారా?! అవతల పాలవాడు నిలబడి వున్నాడు'' నెమ్మదిగా లేపుతోంది తల్లి.

"నన్ను లేపకు, మళ్ళీ రమ్మను'' తండ్రి గొంతులో. విసుగు.

"చెప్పాను కానీ అవసరంగా కావాలట"

"ఆ జేబులో తగలడ్డయి, తీసుకుని ఫో అవతలికి''

బిందు వింటూనే వుంది. సహించరానిదిగా వున్నా సహించక తప్పని పరిస్థితి.

తల్లి తత్త్వం ఆమెకి తెలుసు. భర్త జేబుల్లో చేయి పెట్టడానికి పాముని పట్టుకోవడంలా వణుకుతుంది. ఆమెకి దీనవదనంతో బిక్కుబిక్కుమంటూ డబ్బులు తీస్తున్న తల్లిని తల్చుకుంటే జాలేసింది.

ముఖం కడుక్కుని వంటింట్లోకొచ్చింది. ఒక్కక్షణం తల్లి మొహంలోకి చూసింది. ఏ భావమూ కన్పించలేదు. తన మానాన తను పనులు చేసుకుంటోంది.

"అమ్మా! నా జీతం డబ్బులు నీకే ఇచ్చాను కదా! పాలవాడికి అందులోంచి ఇవ్వకూడదూ?" అంది, తండ్రిమీద కోపాన్నేమీ వ్యక్తం చేయకుండా.

"తెలీనట్లు మాట్లాడ్తావే? అవి ఇంట్లో ఖర్చులకి వాడితే చిట్‌ఫండ్సులో ఎక్కణ్ణించి తెచ్చికడదాం?"

"పోనీ నాన్న పాలకిచ్చే డబ్బులే అందులో కలపచ్చుగా ఉదయానే ఆయన్ని లేపి..." వాక్యం పూర్తిచేయలేదు బిందు.

"సర్లే, ప్రొద్దున్నే లేపడం కాదు అసలు సమస్య. డబ్బులడిగితే ఎప్పుడయినా వుండే విసుగే అది'' నిర్లిప్తంగా అంది తల్లి.

బిందు ఇంకేం మాట్లాడలేకపోయింది.

"వాకిట్లో ముగ్గేస్తున్నట్లుంది, నాయనమ్మకి కాఫీ ఇయ్యి, లోపలికి రాగానే' అంది తల్లి.

అప్పుడే మధుమతి లోనికొస్తోంది. బిందు ఆమెకి కప్పు అందించి, తన కాఫీ కప్పు తీసుకుని మేడమీదికి వెళ్ళింది.

అప్పటికే సింధు తన బట్టలు ఉతికి తెచ్చుకుని పైన ఆరేస్తోంది.

బిందు చెల్లెల్నేం మాట్లాడించలేదు. తల్లి గురించే ఆలోచిస్తోంది. తల్లి సహనానికి ఒక్కోసారి జోహార్లర్పించే ఆమె కొన్నిసార్లు చిరాకుపడ్తుంది. ఏదైనా మనసులోనే. ఎప్పుడయినా బయటికి చెప్పినా తల్లి బాధపడ్తుందేమోనని నవ్వుల్లో పెట్టి అంటుంది.

కాఫీ తాగి, కొంతసేపు అక్కడే పిట్టగోడ మీద కూర్చుని నెమ్మదిగా కిందికొచ్చింది.

తమ పనులు తాము చేసుకోవడం మినహాయించి పిల్లలు పెద్దల పని చేయాల్సిన అవ





సరం లేదా ఇంట్లో. దాదాపు పనులన్నీ మధుమతి, జయలక్ష్మి చేసుకుంటారు. చిన్నచిన్న పనులు అత్తగారు చేస్తుంటే వంటావార్పూ మొదలయినవి కోడలు చూసుకుంటుంది.

బిందు స్నానం చేసొచ్చి తయారవుతోంది. "ఇంతసేపూ ఎక్కడున్నావురా తిలక్?" మధుమతి మనవడి దగ్గరిగా వచ్చి అడుగుతోంది.

ఇక్కడే బయట నిలబడ్డా నాయనమ్మా! నా క్లాస్‌మేట్ వస్తే మాట్లాడుతున్నాను. ఏదీ నాన్నింకా లేవలేదా?" అన్నాడు తిలక్.

జగన్నాథం ముఖం కడుక్కుని వచ్చి హాల్లో కూర్చున్నాడు. సింధు తండ్రి గదిలో మంచం ఎత్తేసి, గది ఉడ్చే ప్రయత్నంలో వుంది.

"నాన్నా! ఇప్పుడే వివేక్ చెప్పాడు, టర్మ్ ఫీజు కట్టడానికి రేపే లాస్ట్ డేటట" అన్నాడు తిలక్.

"ఇస్తాన్నాయినా, ఇస్తాను. ఏ బాంకులోనో కన్నం వేసయినా సరే సాయంత్రానికి తెచ్చి ఇస్తాను ఏం, సరేనా?"

తండ్రి అలా అంటుంటే తిలక్ తల దించుకున్నాడు.

మళ్ళీ జగన్నాథమే కల్పించుకుని "మీ అమ్మ తెచ్చిన కట్నకానుకలు రాసులు పోసుకుని కూర్చున్నాననుకున్నావా? లాస్ట్ డేట్‌వచ్చే వరకూ కళ్ళు మూసుకోకపోతే ముందు చెప్పడం తెలీదూ?" అన్నాడు.

"నేను కట్నం తేలేదన్న విషయం ఈ చుట్టుపక్కల వాళ్ళందరికీ ఎప్పుడో తెలిసిపోయుంటుంది. పోనీ దండోరా వేయించరాదూ, ఊరంతా వింటారు'' స్వరం తగ్గించి అంది జయలక్ష్మి.

"మాటల్లో పౌరుషం చేతల్లో చూపితే ఇవాళ మనకీ పరిస్థితి వుండేది కాదు''

"అంటే మీ ఉద్దేశమేమిటండీ? మా నాన్న తను దాచుకుని నాకు ఇవ్వకపోతే అనుకోవచ్చు. ఆయనకి కాస్త తిండి పెట్టడానికే ఏడుస్తున్నారు కొడుకులూ, కోడళ్లూ''

"పోనీ నువ్వు తెచ్చి పోషించరాదూ?" వ్యంగ్యంగా అన్నాడు జగన్నాథం.

"మీరు గుర్తొచ్చినపుడల్లా సాధించకుండా వుంటే పెట్టి పోషించినంత పుణ్యం" అంది జయలక్ష్మి.

"మొగుడికలా ఎదురు చెప్పడమేంటమ్మాయి? మా కాలంలో ఇట్టా కాదమ్మా, ఏంటో రోజులు మారిపోయాయి'' చేతులు తిప్పుతూ అంది మధుమతి.

"ఏమీ ఇవ్వని తండ్రినే నెత్తిన పెట్టుకు పూజిస్తుంది. ఆయనగానీ ఏమయినా ఇచ్చి వుంటే ఇంకేం చేసేదో?" వ్యంగ్యంగా అన్నాడు జగన్నాథం.

పౌరుషం పెల్లుబికినా అత్తగారి నోటికి మరింత భయపడే జయలక్ష్మి గొంతులో కాఠిన్యం ధ్వనించకుండా "పోన్లెండి మా నాన్న ఇవ్వలేదు మీకూ వున్నారుగా ఇద్దరు కూతుళ్ళు మీరెంత ఇచ్చి పంపుతారో చూస్తాలే'' అంది.

"అందుకే నా కూతుళ్ళని కష్టపడి చదివించేది. వాళ్ళు ఉద్యోగాలు చేసి సంపాదించరూ?! నీలా పైసా సంపాదన లేని బేవార్స్ కేసయితే కదా ఎవరయినా అనడానికి, నేను పడడానికి?"

"అవున్లెండి సంపాదించక పోబట్టే మీకింత అలుసయిపోయాను. మా అమ్మా నాన్నలకింత ముందుచూపు లేకపోయింది. నేను చదువుకుంటానని ఏడ్చినా పట్టించుకోకపోయారు. అయినా ఈ ఇంటికి నేను చేస్తున్న వెట్టిచాకిరీకేం విలువ లేదా? ఉదయం లేస్తే రాత్రి పడుకునే వరకూ ఏదో పని సరిపోతూనే వుంటుంది''

"ఇది మరీ చోద్యంగా వుందే?! లోకంలో నువ్వొక్కదానివే చేస్తున్నావా ఏం? ఇంటి పని చేసుకోవడం వెట్టిచాకిరీనా?" అంది మధుమతి.

"మీ కొడుకు గదా, మీరు ఆయన్ని గాక నన్ను సమర్థిస్తారా? లేకపోతే ఏంటత్తయ్యా,

పిల్లలు కూడా పెళ్ళీడుకొచ్చారు. ఇంకా మా నాన్న కట్నమివ్వలేదని దెప్పుతారు?" అంది జయలక్ష్మి.

"మొగుడో మాటంటే పడకూడదా, ప్రతిదానికీ ఎదురు సమాధానాలు చెప్పాలా 'మాటకి మాట తెగులు నీటికి నాచు తెగులు' అని సామెత" అంది మధుమతి.

ఆ సంభాషణ అప్పటికలా ముగిసింది. ఆ ఇంట్లో దాదాపు పరిస్థితి ఎప్పుడూ అలా అస్థిమితంగానే వుంటుంది. అందువల్ల ఆరోజు ప్రత్యేకించి ఎవరూ విస్తుపోలేదు. విచారించలేదు.

బిందు తొమ్మిదిన్నరకల్లా ఆఫీసులో వుండాలి. ప్రయాణం సుమారు అరగంట పడ్తుంది. సింధు, తిలక్‌లు ఆమె తర్వాతే వెళ్తారు.

బిందు ఒక ప్రైవేట్ ఫర్మ్‌లో రిసెప్షనిస్టుగా పనిచేస్తోంది. ప్రైవేట్‌గా ఎం.ఏ. చేస్తూ గవర్నమెంట్ ఉద్యోగం కోసం ప్రయత్నిస్తోంది. అది పెద్ద ఫర్మ్ కావడాన అందులో ఎంప్లాయీస్ కూడా చాలమందే వున్నారు. ముఖపరిచయమే తప్ప చాలామందిని చూసి కనీసం నవ్వను కూడా నవ్వదు. అనేకమంది బిందుతో పరిచయం చేసుకోవాలని మనసులో అనుకుని కూడా ఆ రిజర్వ్‌డ్‌నెస్ చూసి జంకుతుంటారు. అయితే తనకు నచ్చితే మాత్రం బిందు వాళ్ళతో మంచి స్నేహం చేస్తుంది. స్త్రీ సహజమయిన సిగ్గు ఆమెలో దాదాపు కన్పించదు.

బిందు వ్యక్తులతోకంటే పుస్తకాలతోనే ఎక్కువగా కాలక్షేపం చేస్తుంది. ఉదయం కాఫీ తాగుతూ డైలీ పేపర్ తిరగేస్తుంది. ఆఫీసులో ఏమాత్రం తీరిక చిక్కినా ఏదో ఒక పుస్తకం చదువుతుంది. వీలయితే బస్‌లో చదువుతుంది. ఆఫీసు నుండి వచ్చి కాస్త రిఫ్రెషయి మళ్ళీ పుస్తకం పట్టుకుంటుంది. భోజనం చేసి మళ్ళీ చదువుతుంది. నిద్రలో కూడా ఆమె చేతిలోనో, పక్కమీదో ఏదో ఒక పుస్తకం తప్పక వుంటుంది.

మరీ వూరుకోలేకపోతే "పుస్తకాలుంటే చాలు మరో ప్రపంచమే లేదు. ఆ కళ్ళని మరీ ఎందుకలా కాల్చుకుతింటావు?" అంటుంది ఆమె తల్లి.

బిందు అందుకేం బదులు చెప్పదు. తన అలవాటూ మార్చుకోదు.

సామాన్యంగా ప్రైవేట్ కంపెనీలలో ఉద్యోగస్తులపై నిఘా ఎక్కువగా వుంటుంది. వీలయినంత తక్కువ జీతాలిచ్చి సాధ్యమైనంత ఎక్కువ పని చేయించుకోడానికి చూస్తారు. కానీ అదృష్టవశాత్తూ బిందూకి అలాంటి బాధ లేదు. మేనేజ్‌మెంట్‌కి ఉద్యోగస్తులపట్ల సానుభూతి వుంది. లీవులు, పర్మిషన్లు అవసరపడినపుడు సాటి ఉద్యోగులు కూడా పరస్పరం సహకరించుకోవడంవలన ఒకరిపై ఒకరికి కక్షలూ, వైరాలూ లేవు.

ఫోను రింగవుతుంటే రిసీవర్ ఎత్తి "హలో" అంది బిందు.

అవతలినుండి "హలో మెహతా వున్నారా?" అందో స్త్రీ కంఠం.

"నాట్ జస్ట్ మెహతా, సే మిస్టర్ మెహతా" అంది నవ్వాపుకుంటూ బిందు. అట్నుండి మాట్లాడ్తోంది వర్ష అని గుర్తుపట్టింది బిందు.

"సంతోషించాంలేగానీ, నేనటు వద్దామనుకుంటున్నాను. కాస్త అఫీషియల్ వర్కుందిలే. నువ్వు బిజీ కాకపోతే..."

"తప్పుతుందా తల్లీ, వస్తానంటే శతృవనయినా వద్దనలేంగా"

"ఏడ్చావులేగానీ ఈలోపు ఎవరి గడ్డమో పట్టుకుని పర్మిషన్ తీసుకో, నా పని చూసుకుని ఓ గంటలో నీ దగ్గరుంటా" అని ఫోను పెట్టేసింది వర్ష.

అన్నట్టుగానే నాలుగున్నరకల్లా వర్ష బిందు ఆఫీసుకొచ్చింది. బిందు అప్పటికే సిద్ధంగా వున్నందున ఇద్దరూ బయటికొచ్చారు.

"నువ్వు మళ్ళీ ఆఫీసుకెళ్ళాలా?" అడిగింది బిందు.




"వెళ్ళనవసరం లేదు. అబ్బా! ప్రొద్దుట్నుండీ తిరగడమే. నర్సెస్ అండ్ నర్సింగ్ స్కూల్స్‌పై ఒక ఆర్టికల్ రాస్తున్నాను. ఈరోజు లంచ్ తీసుకోడానిక్కూడా తీరిక లేకపోయింది'' అంది వర్ష.

"ఏదో నాలుగు ముక్కలు సేకరించి నలభై వాక్యాలు కల్పించి రాయడానికి కొండలు పిండి చేసినట్లు ఫోజులు'' అంది బిందు.

"అవునవును కాలిమీద కాలేసుకుని, పుస్తకాలు చదవడంలో లీనమయిపోయి అరగంట మోగాక గానీ ఫోనెత్తని నీకేం తెలుస్తుంది ఒక్క ఆర్టికల్ రాయి చూద్దాం. అక్షరానికి అరగంట ఆలోచిస్తావు'' అంది వర్ష.

'నేనంటూ రాయాలేగానీ రస్సెల్, షా, షేక్స్‌ఫియర్ ముగ్గురి ఇంటిలిజెన్స్, ఈస్తటిక్ సెన్స్, ఇంకుగా చేసి నా బ్రెయిన్ పెన్‌లో పోసి రాస్తుంటే ఆ ఫ్లోకి మీరంతా కొట్టుకుపోయి...'' నవ్వింది బిందు.

"మూసీ నదిలో మాత్రం పడకపోతే చాలు'' అంటూ వర్ష కూడా నవ్వింది.

బిందు ఆ మాటలు తమాషా కోసమే అన్నప్పటికీ ఆమె సమర్థత వర్షకి తెలుసు. ఎవరో మహానుభావుడు చెప్పినట్లు ఈ లోకంలో అనేకమంది కలం పట్టని మహాకవులున్నారు. అసలా మాటకొస్తే ప్రతిభ వుండీ కృషి చేయని కళాకారులెందరో.

"సర్లే... ఏమిటి కబుర్లు?" అంది బిందు.

"ఏం లేదు అర్థాంతరంగా నీమీద ప్రేమ పుట్టుకొచ్చింది అందుకే ఇలా వాలేను నీముందు'' అంది వర్ష.

"నాకోసం ప్రత్యేకించి వచ్చినట్లు మహా''

"ఛఛ... నీకు బొత్తిగా కృతజ్ఞత లేదు. ఈ చుట్టుపక్కల మా బంధువులెందరో వున్నారు. మా నాన్న ఫ్రండొకాయన, మా అమ్మ కొలీగ్ ఒకావిడ, వాళ్లెవరిదగ్గరికీ వెళ్లకుండా ఇక్కడికొచ్చానంటే దానర్థం?"

"అంతేనా ఈ ఏరియా పాపులేషన్ ఎంతో... అన్ని వేలమంది నొదిలి నా దగ్గరి కొచ్చావంటే బాప్రే...''

"హమ్మయ్య ఇప్పటికయినా గుర్తించావు''

"సరేగానీ కాస్త రోడ్డు పక్కకి నడవడం నేర్చుకోవా ఈ జన్మకి? నా కనుమానం నువ్వెప్పుడో ఏ లారీనో బస్సునో గుద్దుతావు. ప్చ్... ఎల్.ఐ.సీ. పాలసీ అయినా తీసుకోలేదు'' అంటూ ఆమె చేయి పట్టుకు పక్కకి లాగింది. కాస్తలో ప్రమాదం తప్పింది.

"నా ప్రాణాన్ని కాపాడినందుకు నీకు ప్రమోషన్ ఇస్తున్నాను. ఈ క్షణం నుండి నువ్వు నా ప్రాణస్నేహితురాలివి'' అంది వర్ష.

"ఏడ్చినట్లుంది జీతం పెరగని ప్రమోషన్లా'' అంది బిందు.

"పోనీ కాఫీ తాగించనా?" రెస్టారెంట్‌వైపు దారితీసింది వర్ష.

"ఇంటా బయటా కూడా లైఫ్ మరీ రొటీన్‌గా వుంది. కొన్నాళ్ళు ఏ కాశ్మీరో వెళ్తే బాగుండ న్పిస్తోంది'' అంది బిందు.

"నువ్వేనా ఇలా మాట్లాడ్తోంది? నీకు స్థల మార్పిడి ఎందుకు? నీకు పరిసరాలతోగానీ, చుట్టుపక్కల జనాలతోగానీ సంబంధమే వుండదు. పుస్తకం పట్టుకుంటే పగలో రాత్రో కూడా తెలీనంతగా మునిగిపోతావు'' అంది వర్ష.

"ఏ, నేను మాత్రం మనిషినికానా? కాకపోతే కాస్త ఎక్కువ చదువుతానేమో. నిజం వర్షా! ప్రతిరోజూ చూసిందే చూస్తూ చేసిందే చేస్తూ ఏ మార్పూ లేకుండా, ఏ కొత్తదనం లేకుండా చాలా విసుగ్గా వుంటోంది''

"నువ్వు చదివిన పుస్తకాల్లో పదోవంతు కూడా నేను చదివానో లేదో. నిన్ను తమాషాగా అప్పుడప్పుడూ వెక్కిరించినా. మనసులో ఎంతో మెచ్చుకుంటాను. ఎంచక్కా దేని గురించీ సీరియస్‌గా ఆలోచించకుండా ప్రతిదాన్నీ తేలిగ్గా తీసుకుంటావు. ఒక మనిషినిగానీ విషయాన్ని గానీచక్కగా ఎనలైజ్ చేయగలవు. ఇవన్నీ బాగా చదివినందువల్లే కదా. నువ్వే ఇలా అంటే...''

"నిజమే వర్షా, నేనెక్కువగా పుస్తకాలతో కాలక్షేపం చేస్తాను. ఎందుకో తెల్సా? టెన్షన్లు, తల్నొప్పులూ నా మనస్తత్వానికి సరిపోవు. లైఫీజ్‌టు ఎంజాయ్, ఐ బిలీవిట్. కానీ మా ఇంట్లో పరిస్థితులు అలా వుండవు. అందుకే నా ఆనందాన్ని పుస్తకాల్లో వెతుక్కుంటున్నాను'' బిందు ముఖం చాలా విచారంగా కన్పించింది.

హొటల్లో ఓ మూలగా కూర్చుంటూ "టిఫినేమయినా తింటావా బిందూ?" అంది వర్ష.

"ఏమొద్దు కాఫీ చాలు'' అంది బిందు.

సర్వర్‌కి కాఫీ తెమ్మని చెప్పి'' ఏమైంది బిందూ, ఈరోజు ఇంత డల్‌గా వున్నావు?" అంది వర్ష.

బిందు నిర్లిప్తంగా నవ్వింది.

"చెప్పకూడదా, సీక్రెటా?"

"ప్రత్యేకించి ఈరోజేమీ లేదు, రోజూ వుండే గొడవే''

"అదే కాస్త డిటేయిల్డ్‌గా చెప్పొచ్చుగా. నాకు జ్యోతిష్యం వచ్చినా బావుండేది నిన్నింత బ్రతిమాలకుండా'' అంది వర్ష.

"ఇందులో బ్రతిమాలించుకోడానికేం లేదు వర్షా. ఇంట్లో ఏవో గొడవలు. ఎవరికి వాళ్ళే గోరంతలు కొండంతలు చేస్తారు. దాంతో అన్‌ప్లెజెంట్ సిట్యుయేషన్... అందుకే దూరంగా ఎక్కడికో వెళ్ళిపోవాలన్పిస్తుంది''

"పిచ్చి బిందూ! ఎక్కడికని పారిపోగలం ఎన్నాళ్ళని వెళ్ళగలం?! వెళ్ళినచోట మాత్రం ఇంతకంటే బెటర్‌గా వుంటుందని నమ్మకమేమిటి? అయినా ఈ చిన్నచిన్న గొడవలు అన్ని ఇళ్లలోనూ వుండేవేగా''

"అన్నిటినీ జనరలైజ్ చేయకు. అందరి పరిస్థితులూ ఒకలా వుండవు. అందరి మనస్తత్వాలూ ఒకలా వుండవు. మా ఇంట్లో మరీ ఘోరంగా రియాక్టవుతూ వుంటారు'' అంటూ ఉదయం జరిగింది క్లుప్తంగా చెప్పింది.

"నువ్వెందుకు అందరిమీదా ఇరిటేట్ అవుతున్నావు? నాకయితే తప్పంతా అంకుల్‌దే అన్పిస్తోంది''

"నిజమే కాదనను. ఇవాల్టి సంఘటనలో నాన్నదే తప్పు. సామాన్యంగా ఆయనే ఏదో ఒకటి క్రియేట్ చేస్తుంటారు. కానీ వర్షా! ఈపైపైన కనిపించే లక్షణాలనిబట్టి ఎవరినయినా సరే అంచనా వేయడం సరయిన పద్ధతి కాదు. దేనికయినా ఒక సైకలాజికల్ ఎనాలిసిస్ వుంటుంది''

వర్ష మౌనంగా వింటోంది. ఈలోపు సర్వర్ కాఫీ తెచ్చాడు.

కాఫీ సిప్ చేస్తూ ఇద్దరూ ఎవరి ఆలోచనలో వాళ్ళున్నారు.

"పద రోడ్డుమీద నడుస్తూ మాట్లాడుకుందాం" అంది వర్ష.

"నాకు నాన్నపట్ల కూడా సింపథీ వుంది'' అంది బిందు.

ఆ స్టేట్‌మెంట్ వర్షకి రుచించలేదు. అయినా ఏం చెప్పబోతోందో పూర్తిగా విందామని మౌనంగా వుండిపోయింది.

"నాన్న ఒక సగటు మనిషి. ఆయనకేం పెద్ద ఆశయాలూ, ఆకాంక్షలూ లేవు. భార్యాపిల్లల్ని సుఖపెట్టి, తను సుఖంగా వుండాలనుకుంటారు. అయితే ఆ చిన్న కోరిక కూడా తీరకపోయేసరికి తనకి తెలియకుండానే ప్రతి చిన్న విషయానికీ ఆవేశపడిపోతుంటారు. అది సహజమే కదా''

"ఏం సహజం కాస్త పార్షియాలిటీ లేకుండా మాట్లాడు''

"నువ్వే వున్నావు వర్షా. బిర్యానీలూ, పరమాన్నాలూ కోరుకోలేదు. కనీసం ఆకలి తీరితే చాలనుకున్నావు. కానీ అది కూడా దుర్లభమైందనుకో ఎలా వుంటుంది చెప్పు?!"

"మామూలు గుమస్తాలు ఆఖరికి కూలీనాలీ చేసుకునేవాళ్ళు కూడా వేల లక్షలమంది బతుకుతున్నారు. అంకుల్ ఇంకా ఆఫీసర్ కేడర్‌లో వున్నారు. తిండీ బట్టలకేం లోటు? వున్నంతలో సుఖంగానే వుండచ్చు''




"వర్షా! నీకు అమ్మానాన్నా ఇద్దరూ సంపాదిస్తున్నారు కాబట్టి ఇవన్నీ ఆలోచించాల్సిన అవసరం వచ్చుండదు. జీతంలో అయిదోవంతు ఇంటి అద్దెకిపోతుంది. ఆపైన తిండీ, బట్టాకి సరిపోతుంది. ముగ్గురు పిల్లల్ని పోషించడమంటే సామాన్యమనుకున్నావా? తిండి పెడితే సరిపోదు, చదివించాలి. ఒక్కరి జీతంలో ఇంతమంది జీవించాలంటే ఈ కాలంలో కష్టమే. పైగా ఆయన ఖర్చు ఆయనకి వుండనే వుంది''

"అంకుల్ తాగుతారా?"

"ఈ రోజుల్లో తాగందెవరు? కాఫీ, టీలంత కామనైపోయింది.తాగడాన్ని తప్పుపట్టడం లేదు. కానీ కనీస అవసరాలు తీరకుండా దాని కోసం డబ్బు తగలేయడం నచ్చదు నాకు''

"అవునూ ఇప్పుడు నీ శాలరీ కూడా వుంటుందిగా అంత కష్టమేముంటుంది బిందు?"

"అది ఇంట్లో వాడడం లేదు''

"ఓహో నీ పెళ్ళికోసం దాస్తున్నారా?" నవ్వింది వర్ష.

"ఎంత చదువుకున్నా మన సమాజంలో వున్న మూర్ఖత్వం మాత్రం పోదేమో అన్పిస్తుంది. రేపు ఒకవేళ ఆ చంద్రమండలంలో కూడా ఇళ్ళు కట్టి అక్కడికి వలస పోయినా ఈ మూర్ఖత్వాన్నీ చచ్చు ఆచారాల్ని మాత్రం వదలకుండా వెంటే తీసుకెళ్తారు. జంతువుల కంటే మనిషి ఉన్నతుడు అంటారు కానీ నాకు మాత్రం చాలాసార్లు అవే ఉన్నతంగా అన్పిస్తాయి. స్త్రీ పురుషులిద్దరు కలసి జీవించడానికి కట్నాలూ, కానుకలూ బాజాలు భజంత్రీలూ ఎంత హంగామా చేస్తారు? ఎవడో డబ్బున్నవాడు ఇలాంటి ఆర్భాటాలు మొదలెడ్తారు. పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లు మిగిలినవాళ్ళంతా లోపల ఏడుస్తూనే పైకి నవ్వుకుంటూ వీలయినంత ఘనంగా చేయడానికి పాటుపడ్తారు''

"ఇది ఒకరకంగా స్త్రీలని ఉద్ధరించడానికే పెట్టుంటారు. గుట్టుచప్పుడు కాకుండా పెళ్ళి జరిగితే అదే పద్ధతిలో విసుగు రాగానే వదిలేసి ఇంకో పెళ్ళాం కోసం పరిగెత్తుతారేమో, నికరం లేని మగమహారాజులు అనే భయంతో అలా పబ్లిసిటీ ఇస్తారు''

"అలా ఇతర్ల భయంతో బలవంతంగా వుండే మొగుళ్ళు వుంటే ఎంత లేకపోతే ఎంత?"

"సమాజం నీ అంత ఎదగలేదు. కనీసం మనకిష్టం లేనివాటిని మనం పాటించకుండా వుండగల్గితే సరి''

"నిజమే కనీసం లైఫ్ పార్ట్‌నర్ విషయంలో నయినా మన ఇష్టప్రకారం మనకి నచ్చినవాళ్ళని సెలక్ట్ చేసుకుంటే బాగుంటుంది. కానీ మనమేం పబ్లిక్ ఫిగర్స్ కాదు, మనకున్న సర్కిల్ చాలా తక్కువ, వాళ్ళలో మనకి సూటబుల్ అనుకున్నవాళ్ళు కన్పించాలి, వాళ్ళకి మనం నచ్చాలి, ఇన్నుంటాయి''

"పోనీ మా పత్రికలో ఓ యాడ్ ఇవ్వమంటావా విత్ ఫొటో" కళ్ళెగరేస్తూ అంది వర్ష.

బిందు అందుకేం సమాధానం చెప్పకుండా "అమ్మని చూస్తే జాలీ వేస్తుంది, కోపమూ వస్తుంది. నిజంగా ఆవిడ సహనానికి జోహార్లు. అమ్మ ప్లేస్‌లో నేనుంటే మూడోరోజే డైవోర్సిచ్చి వుండేదాన్ని. అయినా అమ్మొక్కటే ఏంటిలే. మనదేశంలో స్త్రీ మూర్తులందరూ అంతే కదా! భర్తగారి దయాదాక్షిణ్యాలపై భార్యల జీవితాలు ఆధారపడి వుంటాయి. చిన్నప్పటినుండే అలాంటి వాతావరణంలో పెంచుతారు. పిచ్చి భావాలన్నీ ఇంజెక్ట్ చేస్తారు. నాలాంటి వాళ్ళెవరయినా ఎందుకు, ఏమిటి అని ప్రశ్నిస్తే బొత్తిగా పెద్దలపట్ల గౌరవం లేదని తిట్టడం మొదలెడతారు. భార్యాభర్తలంటే స్నేహితుల్లా వుండాలని పుస్తకాల్లో చదవడమే తప్ప నిజజీవితాల్లో ఎక్కడా కన్పించదు. నేనేదో కొందర్ని చూసి ఈ నిర్ణయానికి రాలేదు..."

"నిజమే బిందూ! నిజంగా స్నేహితుల్లా

వుండే భార్యాభర్తలు రేర్. చాలావరకు లోపల తిట్టుకుంటూ తన్నుకుంటూనే బయట మాత్రం ఆదర్శదంపతుల్లా నటిస్తుంటారు'' అంది వర్ష.

"అమ్మ ఇన్నేళ్ళొచ్చి నాన్నకెంత భయపడ్తుందో తెలుసా? ఒకరిమీద ఒకరికి ప్రేమాభిమానాలుండాలి తప్ప భయభక్తులు కాదు. సామాన్యంగా నాన్న ఏం చెప్పినా ఆవిడ కాదనదు. ఎక్కడికయినా వెళ్ళమంటే వెళాళ్ళలి, ఒద్దంటే మానాలి. ఆమెకంటూ కొన్ని ఇష్టాయిష్టాలుంటాయని ఎందుకు ఆలోచించరా నాన్న అన్పిస్తుంది. పొరపాటున అమ్మ ఎదురు చెప్తే ఇక ఆరోజు రామరావణ యుద్ధమే. దానికితోడు నాన్న కంటే ముందు నాన్నమ్మ బయల్దేరుతుంది. భర్త ఏమన్నా సరే ఎదురు చెప్పకూడదు అనేది ఆవిడ సిద్ధాంతం. ఆవిడో రాక్షసనుకుంటే పొరపాటు. ఇలా మాట్లాడే వాళ్ళెవరయినా సరే అజ్ఞానం, అమాయకత్వంతోనే. వినడం తప్పించి ప్రశ్నించడం తెలీదు వాళ్ళకి''

"కావ్యాలూ, పురాణాలూ అలాగే ఘోషించాయి కదా! దేన్నయినా ప్రశ్నించకపోవడం, అన్నిటిన్నీ సహించడం ఉత్తమ స్త్రీ లక్షణాలని. ఆ బూర్జువా భావాలనుండి మనవాళ్ళు బయటపడలేకపోతున్నారు'' అంది వర్ష.

"అందుకే ఎప్పుడో తప్ప నాన్నమ్మ మీదా నాకు కోపం రాదు. అసలు వీటన్నిటికీ మూల కారణం ఫైనాన్షియల్ ప్రాబ్లం" అంది బిందు.

అలా మాట్లాడుకుంటూ కోటీ వరకూ వచ్చారిద్దరూ.

"సర్లే ఇవన్నీ రోజూ వుండే తల్నొప్పులే. టాపిక్ మారుద్దామా? మీ కొలీగ్స్ ఎలా వుంటున్నారు?" అంది బిందు.

"బాగానే వున్నారు. ఇప్పటికయితే హలో అంటే హలో అంతవరకే. ఒక సర్టెన్ ఏజ్ వచ్చాక స్నేహం చేయడం కష్టం. హార్ట్‌టు హార్ట్ అంటే అస్సలు దొరకరు. ఒకరిపై ఒకరికి ఒక పట్టాన నమ్మకం కుదరదు''

అవునన్నట్లు తల పంకించింది బిందు.

"అరే మా కాలనీ బస్ రెడీగా వుంది, నే వెళ్ళనా?" అంది బిందు.

"ఓ పక్క పరిగెత్తుతూనే పర్మిషన్ అడగడమెందుకు?" అంది వర్ష నవ్వుతూ.

బస్సు కదిలే వరకూ నిలబడి, తన రూట్ బస్‌కోసం వెనుదిరిగింది వర్ష.

ఆత్మీయులతో ఆనందమే కాదు ఆవేదన పంచుకున్నా బావుంటుంది. బిందూ, చిత్రల దగ్గర ఏ మంత్రశక్తి వుందోగానీ మొత్తానికి తనను సమ్మోహనం చేస్తాయని అనుకుంది వర్ష మనసులో.

వర్ష ఇల్లు చేరేసరికి ఆరవుతోంది.

స్నానం చేసి, లిరిల్ పరిమళాలు వెదజల్లుతూ ఓ కుర్చీతీసికెళ్ళి చంద్రకాంతల దగ్గర వేసుకుని కూర్చుంది.

"ఏంటే వర్షా?! పని చెప్తానని భయమేసిందా వంటింటి ఛాయలకైనా రాకుండా ఇక్కడొచ్చి కూర్చున్నావు?" అంటూ టీ కప్పు అందించింది గిరిజ.

"అమ్మంటే ఇలా వుండాలి. అడక్కుండానే అవసరాలు గుర్తించేట్లు''

"మేం మీ గురించి పట్టించుకోవడమే తప్ప మీకు మాత్రం మా సంగతి పట్టదు'' అంది గిరిజ.

"నేనే ఆంజనేయుడయ్యుంటే నా మనసులో అంతా నువ్వే వుంటావని రుజువు చేసేదాన్నమ్మా'' అంది కుర్చీ మీద నుండి వెనక్కివాలి వారగా చూసి నవ్వుతూ.

"ఇప్పుడు కాదు రేపు ముసలిదాన్నయ్యాక సంగతి'' అనేసి జవాబు కోసం ఆగకుండా లోనికెళ్ళిపోయింది గిరిజ.

గిరిజ ఇప్పుడే కాదు అనేకసార్లు వృద్ధాప్యం గురించి మాట్లాడ్తుంది.

టీ సిప్ చేస్తూ ఆలోచించసాగింది వర్ష. 'ఒక పక్క గవర్నమెంట్ ఉద్యోగం చేస్తూ కూడా అమ్మకి తన పెద్దతనం గూర్చి ఇంత




బెంగ వుందా? ప్రావిడెంట్ ఫండ్, పెన్షను వుంటాయి కాబట్టి ఆర్థిక ఇబ్బంది వుండదు.

డబ్బొక్కటి చాలదు. వృద్ధాప్యంలో తమని కనిపెట్టుకుని వుండే తోడూనీడా కావా లని ప్రతివాళ్లూ కోరుకుంటారు. తన తల్లి తండ్రులను చూడ్డానికి తనకి వచ్చేవాడు ఒప్పుకోడా? అలాంటివాడు దొరికేవరకూ తను పెళ్ళి చేసుకోదు. అతని తల్లిదండ్రులు అతని కెంత ముఖ్యమో తన తల్లిదండ్రులు తనకీ అంతే ముఖ్యం. నిజం చెప్పాలంటే ఎవరిని ఎవరు నిర్లక్ష్యం చేసినా తప్పే. ఇవన్నీ ముందే మాట్లాడుకోవాలి. అమ్మకి ఎప్పుడయినా మా ర్పుకావాలంటే హర్ష దగ్గరికి వెళ్ళి వుంటుంది. కానీ నాన్నకి హర్ష అంటేనే ఎక్కువ ఇష్టం.

'అయినా అమ్మకి తనపై నమ్మకం లేదా? మనసులో వుండే దిగుళ్లు, భయాలు ఏదో సందర్భంలో ఇలా బయటపడుతుంటాయి. అమ్మలో ఆ భయం పోగొట్టాలి' అనుకుంది.

★ ★ ★

బిందు ఏదో కామిక్ చూస్తోంది. అందులో గాబ్రియల్ అనేవాడు ఇంట్లో బట్టలు ఇస్త్రీ చేస్తుండగా అతని బాస్ వస్తాడు. బాస్‌తో తోటికొలీగ్స్ అందరి గురించీ కంప్లెయింట్స్ చేస్తూ ఇస్త్రీ సంగతి మర్చిపోతాడు. షర్టు పూర్తిగా కాలిపోవడాన ఆ కమురుకంపుకి బాస్ ముక్కు మూసుకుంటాడు. అప్పటికీ ఆ సంగతి గుర్తురాక తన నైబర్స్‌కి అస్సలు పరిశుభ్రత లేదని ఇంకేవో చెప్తుంటాడు. ఆ సున్నితమయిన హాస్యాన్ని ఆస్వాదిస్తుండగా అకస్మాత్తుగా ఆమెకి తన బట్టల గురించి గుర్తొచ్చింది.

ఒక్క ఉదుటన లేచివెళ్లి మరుసటిరోజు వేసుకోవాల్సిన బట్టలు ఇస్త్రీ చేయసాగింది, కూనిరాగం తీస్తూ.

సింధు వచ్చి "అక్కా అక్కా, రేపు నీ బట్టలు ఉతికిపెట్టాను గానీ కాస్త నావి కూడా ఐరన్‌చేసి పెట్టవా?" అంది.

"పెద్దవాళ్లకి పనిచెప్పకూడదే కళ్లు పోతాయి''

సింధు ఒక డ్రెస్ తెచ్చి అక్కడ పెట్టి వెళ్లిపోయింది.

"దేవుడా, దేవుడా! నా డ్రెస్ చేసుకోగానే పవర్ పోవాలి'' అంది బిందు తనలో అను కుంటున్నట్లు పైకి. బిందు అసలు దేవుణ్ణి నమ్మదు. దేవుడి ప్రసక్తి ఎప్పుడు తెచ్చినా తమాషా కోసమే.

"టీవీలో 'ఉడతలు పట్టే పిడతమొహాల' నాటకమేదో వస్తోంది. కాబట్టి ఇప్పుడు పవర్ పోయే ప్రసక్తే లేదక్కా'' అని సింధు వెళ్లిపో యింది.

బిందు ఢిల్లీ ప్రోగ్రామ్స్ తప్ప తెలుగువేవీ చూడదు. ఆమెకేం తెలుగుపట్ల చిన్నచూపు లేదు. కాకపోతే మన దూరదర్శన్ కేంద్రంవారి కి రచన, నాటకం, సంగీతం మొదలయిన ఏ రంగంలోనయినా సరే సరుకున్నవారంటే ఎల ర్జీ, అసహ్యం. వారి నీడ కూడా పడనీయరు. మొత్తానికి వారి సమర్థత ఎంతటిదంటే అక్షరా లు కూడా రానివాళ్లచేత ధారావాహికనాటకాలు రాయించగలరు. నిలబట్టం కూడా చాతకానివా ళ్లచేత నటింపజేయగలరు. నత్తివాళ్లచేత డబ్బింగ్ చెప్పించగలరు. కురూపులచేత అప్సర వేషాలు వేయించగలరు. బాప్రే వారి ఘనకార్యములు ఎన్నని చెప్పగలం?

నవ్వు ఆరోగ్యానికి మంచిదని ఎందరో మేధావులు చెప్పారు. అంతా సవ్యంగా వుంటే ఎవరికయినా నవ్వెందుకొస్తుంది. సరళరేఖలు చూసి ఏం ఆనందించగలం? నవ్వాలంటే ఏదో అపసవ్యత, ఏదో వక్రత వుండాలి. నిజంగా ప్రజల ఆరోగ్యం, ఆనందం కోసం దూరదర్శన్ కేంద్రంవారు చేస్తున్న సేవ అపారం' అనుకుంది బిందు.

ఇస్త్రీ చేయడం ముగించి మళ్లీ పుస్తకం పట్టుకొంది. తొమ్మిదిన్నర అవుతుండగా తల్లి భోజనానికి రమ్మని కేకేసింది. డైనింగ్‌టేబుల్ దగ్గరకెళ్లేసరికి లిక్కర్ ఘుమాయింపులు.

తండ్రి బాగా తాగి వచ్చాడని గ్రహించింది

బిందు. ఎవరితో ఏమీ మాట్లాడకుండా మౌనంగా వెళ్లి ఓ పక్కన కూర్చుంది.

"నాయినా పుత్ర రత్నమా! ఫీజులు కావల్సినప్పుడు ఠంచనుగా అడగడం మాత్రం తెలుసు'' జగన్నాథం మాట ఇంకా పూర్తవ్వలేదు.

మధ్యలోనే అందుకుని "నేను అడుగుతోంది ఫీజులు మాత్రమే. జలసాలకోసం, పిక్నిక్‌లకోసం అడగడంలేదు. ఫీజులు కట్టలేకపోతే కాలేజ్ మాన్పించండి, అంతేగానీ ప్రతిసారీ ఇలా..." అన్నాడు తిలక్.

"పౌరుషానికేం లోటులేదు. డబ్బులివ్వడానికే తప్ప ఓ మాట మాత్రం అనకూడదు'' కోపంగా అన్నాడు జగన్నాథం.

"తప్పుచేస్తే అనండి. అనవసరంగా ఎందుకనాలి?"

"అవసరాలూ, అనవసరాలు నాకే నేర్పేంత పెద్దవాడివయ్యావా? ఏ గవర్నమెంట్ కాలేజీలోనో చేర్పించక ప్రైవేట్ కాలేజీలో చేర్పించిందెందుకు? బాగా చదువుకోవాలనేగా. నువ్వు చదివి మమ్మల్నేం ఉద్ధరించనక్కర్లేదు''

"ఆс మీరే మమ్మల్ని ఉద్ధరిస్తున్నారు. పిల్లలకి తిండి పెట్టడం, చదివించడం కూడా గొప్పే'' అన్నాడు తిలక్ స్వరం తగ్గించి.

అప్పటివరకూ అవాక్కయి చూస్తున్న జయలక్ష్మి ఇక సహించలేక ఆవేశంగా వచ్చి తిలక్ వీపుమీద రెండు దెబ్బలేసింది.

"ఛీఛీ ఈ ఇంట్లో ఎందుకు పుట్టానో ఏమో'' ఏడ్చుకుంటూ అన్నం ముందునుండి వెళ్లిపోయాడు తిలక్.

"మేమిద్దరం మాట్లాడుకుంటుంటే మధ్యలో నిన్నెవరు జోక్యం చేసుకోమన్నారు?" అన్నాడు జగన్నాథం భార్యనుద్దేశించి.

మధుమతి అప్పటికే భోజనం చేసి పడుకున్నందున ఆవిడకి ఇదేం తెలీదు.

"నేనేం చేసినా నన్ను తప్పుబట్టడం మాత్రం మీకు తెలుసు. కన్నపిల్లలచేత కూడా వేలెత్తి చూపించుకోవాలా? పిల్లలు ఎదుగుతున్నారు. వాళ్లముందు జాగ్రత్తగా వుండాలనే ధ్యాసే లేదు. మీ తాగుడు మాత్రం మీరు మానరు'' అంది జయలక్ష్మి.

ఆడపిల్లలిద్దరూ తండ్రి ప్రవర్తన నచ్చకపోయినాసరే ఎప్పుడూ ఎదురుచెప్పరు. బిందూకి కొన్నిసార్లు తాత్కాలికంగా కోపమొచ్చినా ఆయన అలా ప్రవర్తించడానికి పరోక్షంగా వున్న కారణాలని ఆలోచించి తనకితనే సమాధానం చెప్పుకుంటుంది. సింధు తనకి ఏమనిపించినా అన్నీ అక్కతోనే గుసగుసలు చెప్తుంది. బిందు ఎనాలిసిస్ విన్నాక ఆమె కూడా స్థిమితపడ్తుంది.

జగన్నాథం కూడా డైనింగ్ టేబుల్‌ముందు నుండి లేచి తిలక్ వెళ్లిన గదిలోకెళ్లాడు. ఆయన నడుస్తుంటే కాళ్లు తడబడుతున్నాయి. నెమ్మదిగా ఏదో ఊతగా పట్టుకుంటూ వెళ్లాడాయన.

సింధు పళ్లు నూరింది. మౌనంగా వుండిపోయింది. ఒకపక్క ఫీజు కోసమే అప్పుచేశానని చెప్పాడు. అంత డబ్బులు లేనప్పుడు కూడా అలా అతిగా తాగడమెందుకని అందరికీ అన్పించింది. అయినా ఎవరికీ ఆ మాట పైకి అనే ధైర్యంలేదు. ఆ ఇంట్లో ఆయనకి ఏమాత్రం భయపడనివాడు తిలక్ ఒక్కడే. ఆఖరికి తల్లే అయినా మధుమతి కూడా కొన్ని సందర్భాల్లో కొడుకుతో ఏం మాట్లాడ్తే ఏమంటాడోనని జంకుతుంది.

జగన్నాథం అలిగి పడుకున్న తిలక్‌ని సమీపించి "అది కాదురా తిలక్! ఇప్పుడు నేనేమన్నానని? వందలు వందలు ఫీజు కడుతున్నప్పుడు అందుకు తగ్గట్లు చదువుకోవాలనేగా'' అంటూ బుజ్జగించసాగాడు.

తిలక్ జవాబు చెప్పలేదు, కనీసం లేవలేదు.

జగన్నాథం రెండు మూడుసార్లు బ్రతిమిలాడి ఇక విసిగిపోయి వచ్చి హాల్లోకొచ్చి కూర్చున్నాడు. ఆయన కళ్లు మరింత ఎర్రబడ్డాయి.




సింధు అందరికంటే బిక్కచచ్చిపోయి చూస్తోంది. ఇంకెంత పెద్ద రాద్ధాంతమవుతుందోనని.

"నా ప్రాణానికి సుఖం శాంతి లేకుండాపోయాయి. అసలీ శనిగ్రహం ఎందుకు పుట్టాడో. అయ్యో ఆడపిల్లలని బాధపడ్డాను. కానీ వాళ్లే నయమనిపిస్తున్నారు. వంశోద్ధారకుడు కావాలని ఎదురుచూసినందుకు చెంపలేసుకునేట్లు బుద్ధి చెప్తున్నాడు వెధవ" తారాస్థాయిలో అరుస్తున్నాడు జగన్నాథం.

సింధు వెళ్లి ఇరుగూ పొరుగూ వింటారని కిటికీల తలుపులన్నీ చేరవేసి బోల్టులు పెట్టొచ్చింది.

ఆ అరుపులకి మధుమతి గాబరాగా లేచొచ్చింది.

బిందు వెళ్లి తమ్ముడికి నచ్చజెప్పబోయింది.

"నువ్వు రామ్మా బిందూ! ఆ గాడిదని బ్రతిమిలాడేదేంటి? అలాగే పడుకోనీ. ఒక పూట కడుపు మాడితే అప్పుడు వాడే దిగొస్తాడు'' అంటూ పిల్చాడు జగన్నాథం.

తండ్రి మాట లెక్కచేయనట్లనిపిస్తే ఆయనకి మరింత కోపమొస్తుంది. అందుకే బిందు వెనక్కి వచ్చేసింది.

"ఏం వాడికోసం మీరు అన్నం మానేస్తారా తినండి తినండి'' అంటూ అప్పటికే ప్లేట్లో వడ్డించి వున్న అన్నం కలుపుకుని తినసాగాడాయన.

మధుమతి "ఏమిటి, ఏమయ్యింది? అర్ధరాత్రి మద్దెలగొడవ?" అంది.

"ఏం లేదులే నువ్వెళ్లి పడుకో'' విసురుగా అన్నాడు జగన్నాథం.

ఆవిడ నెమ్మదిగా సింధూకి సైగచేసింది. ఇద్దరు తిలక్‌వున్న గదిలోకెళ్లారు. అప్పటివరకూ మధుమతి కూడా మరో మంచంమీద ఆ గదిలోనే పడుకునివుంది.

సింధు సైగతోనే చెప్పింది. ఆవిడకి సగం సగం అర్థమయింది.

కొద్దిసేపు తిలక్‌ని లేపే ప్రయత్నం చేసి, వాడు లేవకపోయేసరికి ఆవిడా వూరుకుంది.

జగన్నాథం రెండు ముద్దలు తిని చెయ్యి కడిగేసుకుని వెళ్లి పడుకున్నాడు. కొంతసేపు గొణిగాడు. కానీ మత్తు ఎక్కువగా వుండడంవల్ల కొద్దిసేపట్లోనే నిద్రలోకి జారిపోయాడు.

ఆ తర్వాత తిలక్‌ని తిట్టి, నచ్చజెప్పి, బుజ్జగించి మొత్తానికి భోజనానికి లేవదీసింది జయలక్ష్మి. ఆ పూటకి అందరూ అలాగే మొక్కుబడిగా భోజనాలు చేశారు.

"వీడి దుంపతెగ, ఈ జన్మకి తాగుడు మానడేమో! తాగీ తాగీ ఎప్పుడో ఊపిరితిత్తులు పాడయిపోతాయి. ఆరోగ్యమే మహాభాగ్యమని వీడికి ఎప్పుడు తెలిసొస్తుందో ఏమో'' జనాంతికంగా అంది మధుమతి. ఆవిడ కొడుకు క్షేమాన్ని కాంక్షిస్తూ అలా అంది.

అప్పటికి రాత్రి పదకొండున్నర అయింది.

కాసేపట్లోనే మధుమతి, తిలక్ కూడా నిద్రపోయారు. తక్కువ ఆలోచించేవాళ్లు ఆదమరిచి నిద్రపోగలుగుతారు.

సింధు, బిందూలకి మాత్రం ఒకపట్టాన నిద్రపట్టలేదు. ఇద్దరూ సీలింగ్‌కేసి చూస్తూ ఎవరి ఆలోచనలో వాళ్లున్నారు.

చాలాసేపటి తర్వాత "అక్కా! వీడికి నిర్లక్ష్యం ఎక్కువవుతోంది?" అంది సింధు తిలక్ నుద్దేశించి.

"బాగా గారాబం చేశారుగా అనుభవించనీ'' అంది బిందు.

పైకి అలా అందేగానీ బిందుకి లోపల తమ్ముడిపట్ల సానుభూతి వుంది. వాడు అలా తయారవడానికి కారణం ఒకరకంగా తమ ఇంటి పరిస్థితులూ, పెద్దల తొందరపాటు చర్యలే అనుకుంది.

ఆడపిల్లలు మొదట్నుండీ అరిటాకుల్లా ట్రీట్ చేయడాన కావచ్చు అణకువ, నెమ్మదితనాలని అలవరచుకుంటారు. ఎప్పుడో మరీ ఆవేశం అధికమయితే తప్ప తమ కోపతాపాలు ప్రదర్శించరు.

కానీ మగపిల్లల మనస్తత్వం ఇందుకు భిన్నంగా వుంటుంది.

ఆలోచనతో అలసిపోయిన బిందూకి చికాగ్గా అన్పించింది. నిద్రపట్టే సూచనలు కన్పించలేదు. లేచి లైట్‌వేసింది. సింధు కూడా నిద్రపోయింది.

కొంచెం మంచినీళ్లు తాగింది. నాలుగుసార్లు అటూ ఇటూ పచార్లు చేసింది. లాభంలేదని బుక్‌రేక్‌లోంచి పుస్తకంతీసి చదవడంలో నిమగ్నమయింది.

★ ★ ★

"చిత్రమ్మా" అప్పటికి నాలుగోసారి సీత పిలవడం.

"... ... ..."

"గదిలో ఏం చేస్తున్నావు, ఓ చిత్రమ్మా"

"నీకెన్నిసార్లు చెప్పాను సీతా?! పూజ చేసుకుంటున్నప్పుడు పిలవొద్దని" విసుక్కుంటూ వచ్చింది చిత్ర.

"చూడలేదమ్మా" అంది నాలుక కొరికి నవ్వుతూ.

"ఇంతకీ ఎందుకు పిల్చావు?"

"వాకిట్లో నేనేసిన ముగ్గు చూడు ఎంత బాగుందో" అంది.

"ఖర్మ దానికేనా... ఏదో కొంపలు మునిగిపోయినట్లు. స్కూలుకి పోయేటప్పుడు చెప్తాలే. బయల్దేరింది పెద్ద ఆర్టిస్టు" అంది చిత్ర.

"ఊహూ అలా కుదరదు. ఎంతసేపు, ఒక్క నిమిషమేగా" అని చిత్ర చేయిపట్టుకు తీసికెళ్లింది సీత వాకిట్లోకి.

"ఏంటీ ఏబ్‌స్ట్రాక్ట్?" అంది కళ్లెగరేసి చిత్ర.

సీతకి అర్థం కాలేదు. "అంటే?" అంది.

"రీఫిల్ రాస్తోందో లేదో చూట్టానికి గీసే పిచ్చిగీతలు కూడా ఇంతకంటే బావుంటాయి"



అంది చిత్ర.

"నీకస్సలు ముగ్గులేయడం రాదుగా. అందుకే నేను బాగా వేసినా బాగుందనవు" అంది సీత బిక్కముఖం పెట్టి.

చిత్ర నవ్వుకుంటూ లోనికొచ్చేసింది.

హాల్లో పేపర్ చదువుతున్న నవీన్ "ఏయ్ చిత్రా! ఓ కప్పు కాఫీ తీసుకురా" అన్నాడు. అతని స్వరంలో వెదికి చూసినా మార్దవం వుండదు. అడగడం కూడా డిమాండ్ చేస్తున్నట్లే వుంటుంది.

ఆ చెప్పే పద్ధతి చిత్రకి నచ్చదు. ఆ విషయంమీద అనేకసార్లు చర్చ జరిగింది. "చెల్లెలుగారూ! దయచేసి, కాస్త ఓ కప్పుడు కాఫీ తెచ్చిపెట్టండి అని చెప్పాలా? నీకు నువ్వు ప్రిన్సెస్‌లా ఫీలయిపోకు" అన్నాడో సారి నవీన్ వ్యంగ్యంగా.

రాను రాను రాజీకొచ్చేసింది చిత్ర. 'చెప్పేవాళ్లకయినా వుండాలి వినేవాళ్లకయినా వుండాలి. కుక్కతోక వంకరని సరిచేయాలనుకోవడం నాదే పొరపాటు' అనుకుంది మనసులో.

మౌనంగా వంటింట్లోకి దారితీసింది. తల్లి గ్రైండర్‌లో పచ్చడి చేస్తోంది.

ఫ్లాస్కులో చూస్తే కాఫీ లేదు. ఫిల్టర్‌లోంచి డికాక్షన్ తీసి కాఫీ కలుపుకుని వెళ్లి అన్నకి అందించింది.

టిఫిన్ తిని రెడీ అయింది చిత్ర. ఇక చెప్పులేసుకోవడమే ఆలస్యం. లోపల్నుంచి నవీన్ కేకేశాడు.

"ఏయ్ చిత్రా! నా పింక్‌కలర్ టీ షర్ట్ కన్పించడంలేదు, కాస్త వెతికిపెట్టు" అన్నాడు.

"నా స్కూలుకి టైమైపోయింది. సీతనడుగు" అంది చేతిగడియారానికి కీ ఇస్తూ.

"దాని మొహం దానికేం తెలుసు? నువ్వీటురా. స్కూలుకి కాస్త లేటుగా వెళ్తే నష్టమేం

లేదు''

చిత్రకి ఒళ్లు మండింది. "అన్ని షర్టులు న్నాయి, ఇవాళ్టికి ఆ పింకుది వేసుకోకపోతే నేం?" అంది గదిలోకెళ్లి.

"మాటకి మాట ఎదురుచెప్పకు. త్వరగా వెతుకు. ఆ సీతకి లక్షసార్లు చెప్పాను. నా బట్టలు జాగ్రత్తగా సర్ది పెట్టమని. చెప్పినప్పుడు గంగిరెద్దులా బుర్రూపుతుంది'' అంటూ టవల్ భుజాన వేసుకుని బాత్‌రూమ్‌వైపు వెళ్తుంటే సీత పూలు ఓణీ చెంగులో వేసుకుని లోనికొస్తోంది.

"ఏయ్ సీతా! నా పింక్ టీ షర్ట్ ఎక్కడ పెట్టావు?" అన్నాడు.

"టీ షర్ట్ అంటే ఏంటయ్యా?" అంది సీత.

"కాఫీ షర్ట్ కానిది... ఇదో అరవిందం" గొణుక్కుంటూ వెళ్లాడు.

నవీన్ బట్టలు విపరీతంగా కొంటాడు. కొద్దిపాటి షేడ్ డిఫరెన్స్‌లో అనేక షర్టులు, ఫాంట్లు వున్నాయి. బీర్వానిండా అకేషనల్‌గా వాడే బట్టలుంటాయి. దాని పక్కనే ఒక పెద్ద స్టాండుకి వున్న రాక్స్‌లో మడిచిపెట్టి వున్నాయి, రోజువారీవి పదినిమిషాలు వెతికితే గానీ అతడికి కావల్సిన షర్టు కన్పించలేదు.

ఇంతలో నవీన్ స్నానం చేసి గదిలో కొచ్చాడు.

చిత్ర ఉక్రోషంగా "ఇంకేమైనా చేయాలా?" అంది.

"సాయంత్రం చెప్తాలే' అన్నాడు.

స్కూలుకి వెళ్లబోతూ ఆగి తనపని చే సినందుకయినా కనీసం కృతజ్ఞత చెప్పలేదు నవీన్.

చిత్ర స్కూలు ఇంటికి చాలా దగ్గర. పది నిమిషాల నడక. ఆమె స్కూల్లో అడుగుపెట్టే సరికి అప్పుడే ప్రేయర్ అయిపోయి పిల్లలు క్లాసుకి వెళ్తున్నారు.

చిత్ర రిజిష్టర్‌లో సైన్ చేస్తుంటే ప్రిన్సిపాల్ ఆమెవంక చూసింది. ఆ చూపుకి అర్థం ఇంతపక్కనే ఇల్లుంచుకుని ప్రేయర్ మొదలవ కముందు రాలేదేమని.

మాటకయితే సమాధానం చెప్పొచ్చు, చూపుకి ఎవరు మాత్రం ఏం బదులు చెప్పగలరు.

చిత్ర అటెండెన్స్ రిజిష్టరు తీసుకుని క్లాసుకి బయల్దేరింది.

'ప్రిన్సిపాల్ తననెప్పుడూ ఏమీ అనదు. ఎన్నిసార్లు ఆలస్యంగా వచ్చినా, ముందువెళ్తానని, పర్మిషన్ అడిగినా ఎందుకని కూడా ప్రశ్నించదు. ఆవిడకి తెలుసు తను ఉద్యోగం చేస్తోంది కేవలం కాలక్షేపం కోసమేనని. ఏదయినా చిన్నమాట అంటే ఉద్యోగం మానేస్తానేమోనని అనుమానం. పాపం అమాయకురాలు. అసలు అన్నయ్యాననుకోవాలి. చివరిక్షణంలో ఏదో ఒకపని చెప్తాడు, కాస్తయినా అర్థం చేసుకోడు' మనసులోనే విసుక్కుంది.

అదో చిన్న తెలుగుమీడియం స్కూలు. ఆరోతరగతివరకూ మాత్రమే వుంది. స్ట్రెంత్ కూడా తక్కువే.

క్లాసులోకి వెళ్లగానే పిల్లలంతా లేచి నిలబడి విష్ చేశారు.

అటెండెన్స్ తీసుకుంటూ "గీత" అని పిలిచేసరికి కొందరు పిల్లలు కిసుక్కున నవ్వారు.

చిత్ర కోపంగా చూసి "ఎందుకు నవ్వుతున్నారు?" అంది.

ఒక నిమిషం ఎవరూ మాట్లాడలేదు. కిరణ్ అనేవాడు లేచి నిలబడి "గీత రాలేదు టీచర్! వాళ్లనాన్న మళ్లీ పెళ్లి చేసుకుంటున్నారట" అన్నాడు.

చిత్రకి ఒక్కక్షణం విడ్డూరంగా అన్పించింది. గీత తల్లి ఆమెకి తెలుసు. స్కూలుకి వచ్చి తన కూతురు ఎలా చదువుతోందని కనుక్కుంటూ వుంటుంది. భార్యాపిల్లలుండగా ఇంకో పెళ్లాం కావాల్సొచ్చిందా అనుకుంది. కానీ పిల్లలముందు బయటపడడం పద్ధతి కాదని వూరుకుంది.

రవి మినహా మిగతా పిల్లలంతా నవ్వడం





గమనించింది.

అటెండెన్స్ ముగించి లేచి నిలబడి "ఆం ఏం చెప్తున్నాను?" అంది.

ఆ మాటకోసమే ఎదురుచూస్తున్న ముందు బెంచీల్లోని పిల్లలు "టీచర్! కాంపోజిషన్ రాసుకు రమ్మన్నారు'' అంటూ నోట్ పుస్తకాలు తీసుకుని పరిగెత్తుకుంటూ వచ్చారు.

ఇద్దరు ముగ్గురి పుస్తకాలు చూసింది. అవి వాళ్ల స్థాయిని మించి వున్నాయి. బహుశా క్రితం సంవత్సరం రాసిన వాళ్లదగ్గర కాపీ కొట్టినవయినా వుండాలి లేదా ఇంటి దగ్గర పెద్దలచేత చెప్పించుకునయినా వుండాలి.

అదేమాట అంటే దొరికిపోయిన దొంగల్లా ముఖాలు పెట్టారు.

"శరత్! ఏంట్రా ఇది? ఇన్నిన్ని కొట్టివేత లేంటి?" అంది మరో పుస్తకం తిరగేస్తూ.

"మరి మీరు రెండు పేజీలు రాయమన్నారుగా టీచర్' నసిగాడు వాడు. అక్షరాలు కూడా తాటికాయలంత సైజులో వున్నాయి.

"రెండు పేజీలు నింపడంకోసం ఇదో ట్రిక్కట్రా'' అంటూ చిన్నగా మొట్టికాయ వేసింది.

పిల్లలంతా ఆత్రంగా వచ్చి శరత్ పుస్తకంలోకి తొంగిచూసి నవ్వుతున్నారు. రవి మాత్రం సీరియస్‌గా కూర్చునివున్నాడు.

చిత్రకి ఆ పిల్లడ్ని చూస్తే చిత్రంగా వుంటుంది. వాడు నవ్వడం తానింతవరకూ చూడలేదు. సందర్భవశాత్తూ ఏదయినా జోక్ చెప్పినాసరే వాడు మాత్రం ఛస్తే నవ్వడు. "నవ్వకపోతేపోనీ కాస్త ఆ ముఖారవిందాన్ని ఆహ్లాదంగానయినా పెట్టు నాయనా'' అని ఎన్నోసార్లు చెప్పిచూసింది. కానీ లాభంలేదు. అటు సూర్యుడు ఇటు ఉదయిస్తాడేమోగానీ వాడు మాత్రం ఈ జన్మలో నవ్వడు అని నిర్ధారించుకుంది.

రవిని చూస్తూ 'కనీసం వాడికి కితకితలు (చక్కలిగింతలు) పెడితేనయినా నవ్వుతాడో లేదో అనుకుంది మనసులో. అసలు వాడి సైకాలజీ ఏంటి? అనుకుంది.

"మీకు బాగా బద్ధకం ఎక్కువైంది. అతితెలివి ప్రదర్శిస్తున్నారు. మీకు సొంత బుర్రల్లేవా? మీకై మీరు ఆలోచించి రాయలేరా?" అంది.

"నేనెక్కడా కాపీ కొట్టలేదు టీచర్!!" అన్నాడు శరత్.

"ఘనకార్యం చేశావుగానీ నోర్మూసుకో. అంతా వినండి. మీకో కొత్త టాపిక్ ఇస్తాను. దానిమీద మీకై మీరు ఆలోచించి రాసుకుని రండి. ఇప్పుడు టెక్స్ట్‌బుక్స్ తీయండి పాఠం చెప్తాను'' అంది.

బెల్లుమోగి ఆమె క్లాసునుండి వెళ్లబోతుంటే.

"టీచర్! టాపిక్ చెప్పలేదు'' అన్నాడు రవి.

"నవ్వు'' అనేసి నవ్వుకుంటూ వెళ్లిపోయింది చిత్ర.



సాయంత్రమయ్యేసరికి సీత సన్నజాజిపూలు కోసి వుంచుతుంది. చిత్ర స్నానం చేసి, ఫ్రెష్‌గా పౌడర్ కోటింగ్ కూడా కొట్టుకుని టెర్రస్‌మీద కూర్చుని తెలుగు, హిందీ అనే తారతమ్యం లేకుండా నోటికొచ్చిన పాటలని కూనిరాగం తీస్తూ ఆ పూలని మాలకడ్తోంది.

సరస్వతి తన స్థూలకాయాన్ని తగ్గించే ప్రయత్నంగా రోజూలాగే పచార్లు చేస్తోంది. అది ఆవిడకి ఈవినింగ్ వాక్. ఆవిడ కూడా తనలోతనే ఏదో భక్తిగీతం వల్లిస్తోంది.

ఇంతలో "చిత్రమ్మా, చిత్రమ్మా'' అంటూ

కంగారుగా వచ్చింది సీత.

"ఏంటే, ఏమయ్యింది?" అంది సరస్వతి.

"చిత్రమ్మ కోసం ఎవరో వచ్చారమ్మా'' అంది సీత రొప్పుతూ.

"అక్కడికి నన్ను అరెస్ట్ చేయడానికి పోలీసులొచ్చినట్లు అంత కంగారెందుకు?" విసుక్కుంది చిత్ర.

"దీనివల్ల నా గుండెప్పుడో ఆగిపోతుంది'' అంది సరస్వతి నడుస్తూనే.

చిత్ర నిలబడి పిట్టగోడమీదినుండి కిందికి తొంగిచూసింది.

"నాన్నమ్మా! నా స్టూడెంట్ వచ్చిందిగానీ, కాస్త ఈ మిగిలినపూలు మాలకట్టిపెట్టవా'' అని జవాబుకోసం చూడకుండా మెట్లుదిగి కిందికెళ్లింది.

ఆ స్కూల్లో చదివే పిల్లలందరూ ఆ చుట్టుపక్కల ప్రాంతాలవాళ్లే. టీచర్ల ఇళ్లకి వెళ్లడమంటే వాళ్లకి గొప్పగా వుంటుంది. ఏదో మిషమీద చిత్ర ఇంటిక్కూడా పిల్లలు వస్తూనే వుంటారు.

గంటపైగా కూర్చుని ఆ స్టూడెంట్ వెళ్లాక డాబామీదికొచ్చింది చిత్ర.

అప్పటికి సరస్వతి మాలకట్టేసి కొన్ని తను పెట్టుకుంది.

"థాంక్యూ నాన్నమ్మా'' అని బుగ్గమీద ముద్దుపెట్టింది చిత్ర.

"ఒట్టి పిచ్చి సన్నాసివే నువ్వు'' అంది సరస్వతి మెటికలు విరుస్తూ.

"నాన్నమ్మా! తాతయ్య నిన్నెప్పుడయినా ఇంత ప్రేమగా ముద్దుపెట్టుకున్నారా?" అంది చిలిపిగా నవ్వుతూ.

"పోవే కొంటెకోణంగి. మీ తాతయ్యనే అడుగామాట" అంటూ సైగ చేసింది. అప్పటి వరకూ చిత్ర అటు చూడనేలేదు.

పడకకుర్చీలో రిలాక్సింగ్‌గా కూర్చుని సిగరెట్ తాగుతున్నారాయన.

ఆయన ఆ మాటలు విన్న సూచనగా నవ్వుతున్నాడు.

"చెప్పండి తాతయ్యా'' అంది దగ్గరికెళ్లి.

"మీ నాన్నమ్మేమయినా కన్నాంబలా వుండేదా ముద్దుపెట్టుకోడానికి? ఏదో నువ్వు పుట్టావుకదా, చిట్టి మనవరాలివి అని చేసుకున్నాను'' అన్నాడు.

"తాటిచెట్టు ఎందుకెక్కావంటే దూడమేత కోసం అన్నట్లుంది'' అని నవ్వింది సరస్వతి మళ్లీ.

"నాన్నమ్మా! మరి నువ్వెందుకు చేసుకున్నావు తాతయ్యని?"

"నేను కాదంటే పాపం పెళ్లికాకుండా మిగిలిపోతారేమోనని జాలేసింది, అందుకే చేసుకున్నాను'' అంది వారివైపు తిరక్కుండానే.

"ఓసినీ అసాధ్యం కూలా'' అంటూ పెద్దగా నవ్వాడు నారాయణ.

చాలాసేపు తాతయ్యతో ముచ్చట్లు చెప్పి తర్వాత కిందికి దిగివచ్చింది.

హాల్లో జానకి 'మాయాబజార్' కేస్సెట్ పెట్టుకుని చూస్తోంది.

చిత్ర కూడా తల్లిపక్కన కూర్చుని చూడసాగింది.

సూర్యకాంతం "సుపుత్రా సుపుత్రా'' అని పిలుస్తుంటే ఆ ధోరణికి చిత్రకి ఆపుకోలేనంత నవ్వొచింది. పెద్దగా నవ్వేసింది.

పక్కకి తిరిగి తల్లిని గమనించింది. ఆవిడ కళ్లు టీవీమీద కేంద్రీకరించి వున్నప్పటికీ మనసు మాత్రం ఎక్కడో వుంది.

"అమ్మా'' అంటూ చేతితో తట్టి పిలిచేసరికి వులిక్కిపడింది జానకి.

"ఏంటమ్మా ఆలోచిస్తున్నావు?"

'ఏముంది, ఏంలేదు... ఈ సినిమా ఎన్నిసార్లు చూసినా విసుగురాదు. అసలప్పటి సినిమాలన్నీ నీట్‌గా వుండేవి. ఇప్పట్లా వల్గారిటీ వుండేది కాదు'' అంది.

తనేం ఆలోచించడంలేదని రుజువు చేయడానికి ఆవిడలా మాట్లాడిందని స్పష్టంగా తెలి





సిపోతోంది.

చిత్ర రెండు నిమిషాలు చూసి లోపలికెళ్ళిపోయింది. టేప్‌రికార్డర్ ఆన్ చేసింది. "జరా సామ్‌నేతో ఆవో ఛలియే, చుప్‌చుప్‌కే నిగాహే రాహ్ మే..." పాట ఎంతో మెలోడియస్‌గా వస్తోంది. తన గొంతు కూడా జత కలిపి పాడుతూ మంచంమీద వాలిన చిత్రకి అనుకోకుండా వర్ష గుర్తొచ్చింది. వర్ష ఇంట్లో ఫోను లేనందున ఫోను చేసే సౌకర్యం లేదు. కనీసం ఆమె రాసిన ఉత్తరమేదయినా చదువుదామని కబోర్డ్ తలుపు తెరిచింది.

తలుపు తీయగానే నిలువుగా అమర్చిన పుస్తకాలపై అడ్డంగా పెట్టిన పుస్తకంపై ఆమె దృష్టి పడింది. ఆ పుస్తకాన్ని చూసిన ప్రతిసారీ ఆప్యాయంగా చెక్కిలికానించుకుంటుంది. ఇప్పుడూ అలాగే చేసింది.

చిత్ర అక్క భర్త హసన్ స్టేట్స్ వెళ్ళొచ్చాడు. అతను అక్కణ్ణుంచి తెచ్చిన పుస్తకమది. దానిమీది అట్ట మహా డాబుగా వుంది. అతి చక్కటి సీనరీ. లోని కాగితాలు కూడా దళసరిగా వుండి అనేక రంగులతో డిజైన్లతో ఆహ్లాదంగొలిపేట్లు వుంది.

"చిత్రా! లెసన్ ప్లాన్స్ రాసుకోరాదూ దీని మీద" అంటూ ఆ పుస్తకమిచ్చాడు హసన్.

ఆ పుస్తకాన్ని అలా ఉపయోగించడానికి మనసొప్పలేదు. చాలా ఆలోచించి తన హృదయ స్పందనలు రాయడానికి నిర్ణయించుకుంది. చిత్రకి డైరీ రాసే అలవాటు లేదు. కానీ అప్పుడప్పుడూ తన ఆలోచనలు దానితో పంచుకుంటుంది.

ఉత్తరం సంగతి మర్చిపోయి ఆ పుస్తకం, పెన్ను తీసుకుని వచ్చి మంచం మీద కూర్చుని రాయసాగింది.

ఆవేళ్టి తేదీ, సమయం వేసింది.

అన్నయ్యకన్నీ నాన్న బుద్ధులే వచ్చాయి. నాన్న అమ్మని రిజైన్ చేయమని నిర్మొహమాటంగా చెప్పి ఉద్యోగం మాన్పించారు. కూతుర్ని కావడాన నాకు అంత ఖండితంగా చెప్పలేదు. కానీ అన్నయ్య మాత్రం ఏదో సందర్భంలో ఆ మాట అంటూనే వుంటాడు. ఈవేళ తన షర్ట్ వెతకడం కోసం నన్ను వెళ్ళేదాన్ని ఆపాడు. ఇది నిజానికి చాలా చిన్న విషయమే. కానీ అతి చిన్న విషయాలే ఒక వ్యక్తి ప్రవర్తనని, మనస్తత్వాన్ని పట్టిస్తాయి కదా!

సాయంత్రం ఆరో తరగతి చదివే రజని ఇంటికి వచ్చింది. ఏమీ మాట్లాడదు. నేనేమయినా అడిగితే ఒక్కమాటలో జవాబు చెప్తుంది. ఎన్నని అడగను? దాదాపు ఈ స్కూలు పిల్లలు అందరూ అంతేననుకుంటా. తెలిసీ తెలీని వయసు. వాళ్ళతో మాట్లాడ్డానికి ఏం విషయాలుంటాయి. వచ్చినవాళ్ళకి వెళ్ళమని చెప్పలేం. పైగా లోపల చికాగ్గా వున్నా వెధవ నవ్వొకటి పెదాలకి అతికించుకోవాలి.

చాలాసార్లు గమనిస్తున్నాను. అమ్మ ఏదో ఆలోచనలో, విచారంలో వుంటోంది. మరీ మెకానికల్‌గా బతికేస్తోందా అన్పిస్తుంది. తనని చూస్తే దిగులుగా వుంటుంది. కానీ నా చేతిలో ఏముందని, నేనేం చేయగలను? మొత్తానికి ఏదో చేసేసి అమ్మని ఆ విచార సాగరంలోంచి బయటకి లాక్కురావాలన్పిస్తుంది. అలా చేసి తన కళ్ళల్లో కనిపించే సంతృప్తిని ఒక్క క్షణమయినా సరే చూడాలన్పిస్తుంది. ఊహలెంత మధురంగా వుంటాయి. కానీ నిజానికి అది నా చేతిలో లేదని తల్చుకున్నప్పుడు భయంకరమయిన బాధగా వుంటుంది.

మేడిపండు సామెత గుర్తొస్తోంది. చూసేవాళ్ళకి అమ్మ చాలా సుఖప్రదంగా వున్నట్లు కన్పిస్తుంది. "లంకంత ఇల్లు, ఇంట్లో నౌకర్లు, ఇంజనీర్ మొగుడు నీకేం తక్కువమ్మా జానకమ్మా" అంటుంటారు బంధువులు- ఆస్తి అంతస్తు హోదా ఇవేనా జీవితానికి కావల్సింది? నాన్న ఇప్పటివరకూ అమ్మకేమీ లోటు చేయలేదు. బెంగుళూరు వెళ్ళినప్పుడల్లా అమ్మకి ఒక చీర తెస్తుంటారు. నేనో, నాన్నమ్మో బలవంతం చేస్తే తప్ప అమ్మ

కనీసం మడతలు విప్పి కూడా చూడదు, ఆ చీరలని.

నాన్నకి ఇంకో స్త్రీతో సంబంధముంది అంటే నాకు ఇప్పటికీ ఆశ్చర్యంగానే వుంది. కానీ మింగుడు పడని చేదు నిజంలా బాధిస్తోంది. ఏదో అద్భుతం జరిగి బెంగుళూరులో అసలు ఆ కృష్ణవేణి అనబడే స్త్రీ ఎవరూ లేకుండా నాన్న అక్కడికి తరచు వెళ్ళడం నిజమే అయినా కేవలం ఆఫీసు పనిమీదే వెళ్తున్నారనే వార్త వినే రోజు రాకూడదూ? 'ఇన్నాళ్ళూ నేను అపోహలో వున్నానా?' అని అమ్మ హాయిగా నవ్వేరోజు రాకూడదూ? ఇదెలా సాధ్యం?

అసలు మొదటిసారి ఈ సంగతి విన్నప్పుడు అదో పెద్ద షాక్‌లా అన్పించింది. రెండు మూడు రోజులు అన్నం కూడా తినాలన్పించలేదు. ఎవ్వరితో మాట్లాడకుండా, ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లోనే వుండిపోయాను. ఆ తెలిసీ తెలీని వయసులోనే ఇదేదో ఘోరమయిన విషయమనే భావన కలిగింది. చిన్నప్పుడు మన ఆలోచనలేవీ నిజానికి మనవి కావు. కుటుంబ సభ్యుల ప్రభావం చాలా ఎక్కువగా వుంటుంది. రానురాను లోకాన్ని తన కళ్ళతో చూసి తనకంటూ కొన్ని ఇష్టాలూ అయిష్టాలూ ఏర్పరచుకుంటారు.

నేను చిన్నప్పటి చిత్రను కాను. ఎంతో కొంత ఎదిగానని నాకు నాకే తెలుస్తోంది. అమ్మ చెప్పిందనో, నాన్నమ్మ చెప్పిందనో చేయడం ఇష్టమన్పించదు.

ఇప్పుడు దేన్నయినా చాలావరకు ఆబ్జెక్టివ్‌గా చూడగలుగుతున్నాను. అమ్మ పట్ల విపరీతమయిన సానుభూతి వుంది. కానీ నాన్న కూడా విలనేం కాదు. ఆయన కూడా మనసున్న మనిషే.

తాతయ్య దగ్గరకంటే నాన్నమ్మ దగ్గర నాకు చనువెక్కువ. అందుకే తాతయ్య లేకుండా చూసి నాన్నమ్మ నడిగి చాలా విషయాలు తెలుసుకున్నాను. ఆవిడ చెప్పిందంతా విన్నాక ఒకరకంగా నాన్న మీద కూడా జాలేసింది.

కానీ నాకు మాత్రం ఒక్కటే అన్పిస్తుంది. ఎవరికయినా సరే పెళ్ళికి ముందు ఏ ప్రేమకథలయినా వుండనీ పెళ్ళంటూ చేసుకున్నాక మాత్రం ఒకర్నొకరు మోసం చేసుకోకుండా సిన్సియర్‌గా వుండాలి అని.

ఇంత మెచ్యూర్‌డ్‌గా ఆలోచించే నన్ను పట్టుకుని వర్ష మూర్ఖురాలు, ఛాందసురాలు అని తిడ్తుంది. అది నన్నెపుడు అర్థం చేసుకుంటుందో ఏమో!

అంతవరకూ రాసి పుస్తకం మూసేసింది. ఒక్క నిమిషం ఆమెకి గుండె వేగంగా కొట్టుకుంది. చుట్టూ పరికించి చూసింది. ఆ దరిదాపుల్లో ఎవరూ లేరు 'ఈ రాతల్లో నా మనసు ప్రతిబింబిస్తోంది. ఇంకెవరయినా ఇది చదివితే? బాప్రే... అయినా తన ఇంట్లో అలాంటి కల్చర్ లేదు నిజమే. కానీ ఎంత మంచివాళ్ళయినా సరే కొన్ని సందర్భాల్లో చేయకూడని పనులు చేస్తూనే వుంటారు. ఎవరికయినా సరే ఇతర్లు తమ గురించి ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలని కుతూహలంగా వుంటుంది. అందుకే కాబోలు డైరీ రాయడం మంచి అలవాటని తెలిసి కూడా రాయడానికి భయపడ్తారు. కొందరు ప్రబుద్ధులు రాసినా హిపోక్రటిగ్గా రాస్తారని విన్నాను. మనని మనం మోసం చేసుకోవడం కంటే అర్థంలేని విషయం ఇంకోటుంటుందా?

అందరి సంగతీ తెలీదుగానీ తనకు మాత్రం ఏ దాపరికాలూ లేకుండా హాయిగా మనసు విప్పి మాట్లాడుకున్నట్లు వుంటుంది ఇలా రాసినప్పుడు. అనుకుంది చిత్ర. దాన్ని షెల్ఫ్‌లో నిలబెట్టిన బుక్స్‌కి వెనకవైపు పెట్టింది.

★ ★ ★

ఉదయం ఇంకా ఆరు కూడా కాలేదు.

"చిత్రా! చిత్రా!!" అంటూ తట్టి లేపాడు మహేంద్ర.




చిత్ర తుళ్ళిపడి లేచింది. అసలంత పెందలాడే తండ్రి లేవడం పెద్ద విచిత్రమే. ఆయన కాంప్ వెళ్ళాల్సిన పని వుంటే తప్ప ఏడున్నర తర్వాతే లేస్తారు.

"ఏంటి నాన్నా అప్పుడే లేచారు?" అంది ఎడం చేత్తో కళ్ళు నలుపుకుంటూ, కుడిచేత్తో చెదిరిన బట్టలు సరిచేసుకుంటూ.

"మీ అమ్మకి జ్వరమొచ్చినట్లుంది చూడు. ఇందాక వోమ్‌టింగ్ కూడా అయింది. ముందు కాస్త కాఫీ పెట్టు తాగి టాబ్లెట్ వేసుకుంటుంది''

చిత్ర పక్క బట్టలు అలాగే వదిలేసి తల్లి గదిలోకి వేగంగా వెళ్ళింది. ఆవిడ కణతలు రుద్దుకుంటూ మూలుగుతోంది.

"ఏమ్మా! తల్నొప్పిగా కూడా వుందా?" అంటూ మెడ కింద చేయిపెట్టి చూసింది చిత్ర.

ఒళ్ళు మసిలిపోతోంది. హాల్లోకొచ్చి "నాన్నా హైటెంపరేచర్ వచ్చింది. ఎవరయినా డాక్టర్..."

"ఇంత ప్రొద్దున్నే డాక్టర్లెవరుంటారమ్మా? చూద్దాం. టాబ్లెట్‌కి తగ్గకపోతే... ముందు కాఫీ సంగతి చూడు''

చిత్ర స్టవ్ మీద వేణ్ణీళ్ళు పెట్టి "సీతా! పాల పాకెట్లు కాస్త కడిగి తీసుకురా'' అని కేకపెట్టింది.

వేడివేడి కాఫీ తాగించి, టేబ్లెట్ ఇచ్చి, తల్లికి దుప్పటి కప్పి అప్పుడు దినచర్యలో పడింది.

పనిమనిషొచ్చి అంట్లు తోమి, బట్టలు ఉతికి వెళ్తుంది. ఇల్లు ఊడవడం, తుడవడం, సర్దడం మొదలయిన చిన్నచిన్న పనులన్నీ సీత చేస్తుంది. వంట మాత్రం జానకి చూసుకుంటుంది.

ఆరోజు తల్లికి బాగోకపోవడంతో వంట చేయడానికి నడుం బిగించింది చిత్ర. ముందు కుకర్ రెడీ చేసి కడిగి తుడిచిన బెండకాయలు తరగసాగింది.

"చిత్రా! నాన్నమ్మకీ, తాతయ్యకీ కాఫీ ఇచ్చావా? ఇప్పుడు వంటకేం తొందరమ్మా? అమ్మకి బాగా లేదు కదా, స్కూలుకి వెళ్ళకు. అలాగే నాక్కూడా ఇంకో కప్పు కాఫీ ఇవ్వు'' అన్నాడు మహేంద్ర వంటింట్లోకొచ్చి. అలా చెప్పి వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

'నాన్నకి అమ్మంటే అభిమానమే. కానీ ఆ కృష్ణవేణి... ప్చ్' అని తనకి తనే తలమీద కొట్టుకుని ఆ విషయం గురించి ఆలోచించడం వృధా ప్రయాస అన్నట్లుగా తల పంకించి, బెండకాయల్ని పక్కన పెట్టి ఫ్లాస్కు దగ్గరికెళ్ళింది.

మహేంద్ర కాలుకాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు. మధ్యలో భార్య పడుకున్న గదిలో క్కూడా వెళ్ళి చూస్తున్నాడు. పదేపదే టైం చూసుకుంటున్నాడు. ఫామిలీ డాక్టర్ రంగనాథం ఊళ్ళో లేనందువల్ల ఈ టెన్షన్. అతనయితే ఫోను చేయగానే రెక్కలు కట్టుకు వాలతాడు.

కాఫీ కప్పు అందుకుంటూ చిత్రతో, "థర్మామీటర్ ఎక్కడుందో ఒకసారి టెంపరేచర్ చూడమ్మా'' అన్నాడు.

ఆమె అలాగేనని తలూపి వెళ్ళింది.

మహేంద్ర పైపైన పేపర్ తిరగేసి, ఆఫీసు ఫైల్స్ కాసేపు సరిచూసుకుని, షేవ్ చేసుకుని, స్నానం చేసి డ్రెసపయి కూర్చున్నాడు.

"చిత్రా! అమ్మని త్వరగా చీర మార్చుకోమను, నువ్వు కూడా రెడీ అవ్వు డాక్టర్ దగ్గరికెళ్దాం" అన్నాడు మహేంద్ర.

"నాకేమయిందని, ఈ మాత్రానికే చచ్చిపోతానా? నేనెక్కడికి రాను అదే తగ్గిపోతుంది'' అంది జానకి.

చిత్రకి ఒక్క క్షణంపాటు తల్లిపై కోపమొచ్చింది, ఆవిడ గురించి అంత శ్రద్ధ తీసుకుంటున్న తండ్రి ఎక్కడ హర్టవుతాడోనని.

'కానీ అంతకు వేయిరెట్లు బాధపడిన తల్లి ఆమాత్రం నిష్ఠూరంగా మాట్లాడడంలో ఆశ్చర్యమేముంది? ఇంకా తన తల్లి కాబట్టే రోజుకో రణరంగం సృష్టించకుండా తనలో తనే మథ

నపడుతూ ప్రశాంతత కాపాడుకొస్తోంది' అనుకుంది.

తన భావాలేవీ ప్రదర్శించకుండా తల్లిని బ్రతిమాలసాగింది.

అటుగా వచ్చిన నారాయణ కల్పించుకుని "ఏంటమ్మా జానకీ?! హాస్పిటల్‌కెళ్ళడానికి ఇంత హంగామా ఏమిటి? ఎంత దూరమని, దగ్గరేగా, అరగంటలో మళ్ళీ ఇంట్లో వుంటారు, వెళ్లిరండి'' అన్నాడు.

"లేదు మావయ్యా. జ్వరం తగ్గింది. ఇందాక టేబ్లెట్ వేసుకున్నాను. ఒకవేళ మళ్లీ వస్తే సాయంత్రం వెళ్తాను'' అంది లేచి కూర్చోబోతూ.

"అలా అయితే సరే... లేవకు లేవకు, పడుకో నే వెళ్తున్నా'' అంటూ నారాయణ వెళ్ళిపోయాడు.

ఇంక అడిగి ప్రయోజనం లేదని గ్రహించిన చిత్ర "సరే అయితే దుప్పటి సరిచేస్తాను, ఒకసారి లేమ్మా'' అంది.

ఈలోపు జానకి తన చీరని సరిగ్గా కట్టుకుని పైపైన దువ్వుకుని జడ అల్లుకుంది.

"బ్రెడ్ నాలుగు స్లైసెస్ వేయించనా?" అడిగింది చిత్ర.

"నా సంగతి తర్వాతగానీ, ఆఫీసుకి టైమౌతోంది ముందు మీనాన్న సంగతి చూడు'' అని పడుకుంది జానకి.

ఆ గది హాలు పక్కనే వుండడాన ఆ మాటలన్నీ మహేంద్రకి విన్పిస్తూనే వున్నాయి. చేతిలో పేపరుందన్న మాటేగానీ ఆయన ధ్యాస దానిమీద లేదు.

"నాన్నా! టిఫిన్ చేస్తారా అన్నమే పెట్టనా?" అంది చిత్ర.

"ఇప్పుడేమొద్దు. తల్నొప్పిగా వుంది, ఈవేళ ఆఫీసుక్కూడా వెళ్లను'' అని చెప్పి డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాడు మహేంద్ర.

ఆయన మనసంతా అస్థిమితంగా వుంది. కూర్చోవాలన్పించదు, పడుకోవాలన్పించదు. ఏదో దిగులు, ఏదో వెలితి, అసహనం, ఎవరికి చెప్పుకోవాలో, ఏమని చెప్పుకోవాలో తెలీదు. తనమీద తనకే జాలి, కోపం, ఆవేశం, ఆందోళన.

ఈ పరిస్థితి పూర్వం కూడా ఎన్నోసార్లు ఎదుర్కొన్నాడు. ఈవేళ మళ్ళీ. దీనికి అంతమెక్కడ? రానురాను తగ్గకపోగా అధికమవుతోంది.

ఇలాంటి సందర్భాల్లో మనుషులు సామాన్యంగా మూడు రకాలుగా వుంటారు. మొదటి వాళ్ళు తాత్కాలిక ఆవేశాలకు లొంగకుండా ముమ్ముందు ఏర్పడే పరిస్థితులు గురించి క్షుణ్ణంగా ఆలోచించి అందుకు తగ్గట్లుగా అప్పుడు పశ్చాత్తాప్పడకుండా వుండేట్లు నిర్ణయాలు తీసుకుంటారు.

రెండోరకం వాళ్ళు త్వరపడి నిర్ణయాలు తీసుకుని తర్వాత ఏమాత్రం తేడా వచ్చినా బాధపడుతుంటారు.

ఇక మూడో తెగవాళ్ళు దేన్నయినా ఎదుర్కోవడానికి సిద్ధంగా వుంటారు. వాళ్ళెవరినీ లెక్కచేయరు.

దీనికి ప్రధాన కారణం ఒకటే. మొదటివాళ్ళు సమాజానికి పూర్తి విలువ ఇస్తారు కాబట్టే లోకం తనని చూసి నవ్వకూడదనే ముందు జాగ్రత్తలో వుంటారు. చివరి వాళ్ళు సమాజాన్ని ఏమాత్రం ఖాతరు చేయరు కాబట్టే వాళ్ళకా బెంగేలేదు. కానీ అటూ ఇటూ కానీ మహేంద్రలాంటి మధ్యస్థుల పని మాత్రం కుడితిలో పడ్డ ఎలకలా కొట్టుమిట్టాడుతుంది.

తనకీ పరిస్థితి ఏర్పడడానికి కారణమయిన గతంలోకి పరిగెత్తాయి మహేంద్ర ఆలోచనలు.

★ ★ ★

స్వగ్రామంలో సొంతిల్లూ, పొలమూ వున్నప్పటికీ హైదరాబాదులో సొంతిల్లు కాదు కదా ఒక ఫ్లాట్ కూడా లేదు తమకి. గగన్‌మహల్ సమీపంలో వున్న ఇంట్లో అద్దెకి వుండేవాళ్ళు.

మహేంద్ర బి.ఇ. చదువుతున్నాడు. చదు




వుని అశ్రద్ధ చేయనప్పటికీ మరీ పుస్తకాల పురుగు మాత్రం కాదు. మొత్తానికి సరదాగా వుండేవాడు. వయసు ప్రభావంవల్ల ఆడపిల్లల మీద జోక్స్ కట్ చేసినప్పటికీ అవి వింటే వాళ్ళు కూడా హాయిగా నవ్వుకునేట్లు వుండేవి తప్ప చీప్‌గా వల్గర్‌గా వుండేవి కావు.

వన్ ఫైన్ మార్నింగో, వర్స్ట్ మార్నింగో తెలీదు గానీ అతని దృష్టి కృష్ణవేణిపై పడింది. ఆ రోజు మొదలు ప్రతి నిమిషం అతని కళ్ళు ఆమె కోసం వెతికేవి. ఇతర ఏ ఆడపిల్లని చూసినా కలగని స్పందనేదో కేవలం కృష్ణవేణిని చూస్తే కలిగేది.

అతనికి తెలియకుండానే ఆమెని చూసినపుడు అతని కళ్ళలో కోటి దీపాల కాంతి కనిపించేది. అలాగే ఆమెని చూడనపుడు అంతకు పదింతల నిరాశ కూడా ప్రతిఫలించేది.

తన ప్రతిభావమూ ఆమెతో పంచుకోవాలనీ, ఆమె ఇష్టాలూ అయిష్టాలూ అన్నీ తాను తెలుసుకోవాలనీ వుండేది. ఆఖరికి ఇంట్లో రేడియోలో పాట వింటున్నా, పత్రికలో ఏదయినా విషయం చదువుతున్నా ఆ సమయంలో కృష్ణవేణి దాన్ని వినీ లేదా చదివి ఎలా ఫీలవుతుందో అని ఆలోచించేవాడు.

తన అందం గురించి తాను శ్రద్ధ తీసుకోవడం మొదలుపెట్టాడు. తన హెయిర్ స్టయిలు రకరకాలుగా మార్చి చూశాడు. ఏ స్టయిలుని ఆమె అభినందనపూర్వకంగా చూస్తే దాన్నే స్థిరంగా వుంచుకోవాలనుకున్నాడు.

తను ఆమెనెలా ఆరాధిస్తున్నాడో ఆమె కూడా అలాగే తనని ఆరాధనాపూర్వకంగా చూడడం గ్రహించాడు. చాలా కథల్లో సినిమాల్లో "ఐ లవ్ యూ'' అని బాహాటంగా చెప్పుకునేవరకూ ఒకరిపై ఒకరికి ప్రేమ లేదన్న లెవల్లో దిగజార్చి చూపిస్తుంటారు. నిజానికి అలా చెప్పుకోవడం ఎంత దారుణంగా, అసహ్యంగా వుంటుందో, మనసులోని ఏ భావాన్నయినా ముందుగా కళ్ళు, ఆ తర్వాత చేతలు వ్యక్తపరుస్తాయి.

వారిద్దరిలో ఏ ఒక్కరూ మాటల రూపంలో తమ ఇష్టాన్ని లేదా అభిప్రాయాన్ని తెలియజేయనప్పటికీ వారికి రూఢిగా తెలుసు ఒకరంటే ఒకరికి ఇష్టమని.

కృష్ణవేణి మహేంద్రకి ఒక సంవత్సరం జూనియర్. ఆమె కూడా ఎవరితో ఏం మాట్లాడ్తున్నా ధ్యాసంతా అతనిమీదే వుండేది. లిప్‌స్టిక్‌లూ గట్రా పూసుకోకపోయినా వున్నంతలో నీట్‌గా తయారయ్యేది. తాను ఏ డ్రెస్ వేసుకున్నపుడు అతని కళ్ళు ఎంత ప్రశంసాపూర్వకంగా వున్నాయో అంచనా వేసేది ఆమె మనసు.

ఆ పరస్పర చూపుల ఆరాధన మాటల్లోకి దిగి, లేఖల వరకూ సాగింది. ఒకరి లేఖ చూసి ఒకరు విస్తుపోయేవారు, ఆనందించేవారు. ఒకర్నొకరు అభినందించుకునేవాళ్ళు, తమ ఉజ్జ్వల భవిష్యత్తు గురించి కలలు కనేవాళ్ళు.

అలా ప్రేమ పరిమళాలు పీలుస్తూనే చదువు పూర్తిచేశారు. కృష్ణవేణిని ఎంత ప్రాణాధికంగా ప్రేమించినప్పటికీ కలల్లో తప్ప ప్రాక్టికల్‌గా ఆమెను స్పర్శించి ఎరగడు. ఆమె వారించాల్సిన అవసరం రాలేదు, అతడే అలాంటి ప్రయత్నాలేవీ చేయలేదు. అవన్నీ పెళ్ళి తర్వాత కోసం ముడుపుకట్టాడు.

చదువు పూర్తయిన ఆరేడు నెలల్లోనే మహేంద్రకి ఉద్యోగం వచ్చింది. అప్పుడు ఇంట్లో చెప్పాడు కృష్ణవేణి సంగతి. ఊహించని సంఘటన విన్నందుకు తల్లిదండ్రులు మొదట ఆశ్చర్యపోయినా అభ్యంతరం మాత్రం చెప్పలేదు. "నీ యిష్టం" అన్నారు ఇద్దరూ.

తల్లిదండ్రులంత ముక్తసరిగా ఒక్కమాటలో తేల్చిచెప్పడంతో అది వారి అయిష్టంగా భావించి బాధపడ్డాడు మహేంద్ర.

తల్లిని బ్రతిమిలాడాడు, తనని అర్థంచేసుకోమనీ తండ్రికి కోపం వచ్చిందేమో కాస్త నచ్చజెప్పమనీను. ఆ మాటకి తల్లి ఆహ్లాదంగా నవ్వింది.

తల్లి ఏం చెప్పిందో తెలీదుగానీ మొత్తానికి ఆరోజు రాత్రి భోజనాల దగ్గర తండ్రి "నువ్వా పెద్దవాడివయ్యావు. నీ స్వవిషయంలో నీకు నువ్వు నిర్ణయాలు తీసుకోవడం మంచిదే. ఇందులో నాకుగానీ మీ అమ్మకు గానీ కోపం రావడానికేముంది? కాకపోతే పెళ్ళాన్ని తెచ్చుకోవడమంటే త్వరపడి ఒక షర్టు కొనుక్కోవడం లాంటిది కాదు. అందుకే కాస్త బాగా ఆలోచించి చెయ్యి ఏం చేసినా'' అన్నారు.

అందుకు సమాధానం ఏం చెప్పాలో తోచలేదు కానీ లోపల మాత్రం చాలా సంతోషించాడు మహేంద్ర.

ఈ సంగతి విని కృష్ణవేణి మరీ సంతోషించింది. ఇక తన వాళ్ళతో చెప్పడమే ఆలశ్యమనీ అందుకు తనకు ధైర్యం చాలడం లేదనీ మహేంద్రనే వచ్చి తన తండ్రితో మాట్లాడమనీ చెప్పింది.

కృష్ణవేణి మాటమీద వెళ్ళిన మహేంద్ర ఆమె తండ్రి శర్మ చేసిన అవమానంతో ముఖం కందగడ్డలా చేసుకుని వెనుదిరిగి వచ్చాడు.

ప్రేమ మైకంలో వున్న మహేంద్ర కృష్ణవేణి తండ్రి ఎత్తిచూపేవరకూ ఆస్తుల గురించీ, కులాల గురించి అసలు కలలో కూడా ఆలోచించలేదు. తనని తక్కువ కులస్తుడనీ, ఆస్థి కోసం ఆయన కూతుర్ని వలలో వేసుకున్నాడనీ నానా మాటలూ అన్నాడు. ఊహించని పరిణామానికి ఖిన్నుడయినా, ఆవేశంగా సమాధానం చెప్పి వచ్చేశాడు మహేంద్ర.

'తనని అవమానిస్తుంటే అడ్డొచ్చి తనని సమర్థించి, ఇందులో ఆమె భాగం కూడా వుందని చెప్పని కృష్ణవేణిపై విపరీతమయిన ఆగ్రహం వచ్చింది మహేంద్రకి. తండ్రిపట్ల అంత భక్తి శ్రద్ధలున్నపుడు, ఆయనకి ఒక మాట ఎదురు చెప్పలేనపుడు విషయాన్ని ఇంతవరకూ తీసుకురావడం ఎందుకు? మధ్య తనని ఫూల్‌ని చేయడానికా? అసలంత పిరికిదానికి ప్రేమలెందుకు, ఇతర్ల బుర్రలు పాడుచేయడానికి' ఇలాంటి ఆలోచనలు కొన్నాళ్ళు బాధించాయి.

కృష్ణవేణి ఊహలు ఎంత కలవరపెడుతున్నా ఆమెని ఆ తర్వాత కలవలేదు. ఆమె కలవాలని ప్రయత్నించినా కుదరనివ్వలేదు. ఫోను చేస్తే వెంటనే డిస్‌కనెక్ట్ చేసేవాడు. ఆమె ఆఫీసుకి వచ్చిందని విని ఒకసారి లేనని చెప్పించాడు. ఇంకోసారి అలా చెప్పించడానికి కుదరక ఎదురుపడడంతో చూడనట్లు చకచకా వెళ్ళి స్కూటర్ స్టార్ట్ చేశాడు. ఒక ఉత్తరం రాస్తే చదవకుండానే చింపేశాడు.

అప్పటికే మనసు వికలమయిన కృష్ణవేణి అంతకంటే తన వ్యక్తిత్వాన్ని చంపుకోవడం ఇష్టంలేక తానూ మహేంద్రకి దూరమయింది. అంటే దగ్గరయ్యే ప్రయత్నాలు చేయలేదు. ఈ లోపు ఆమెకి బెంగుళూరులో ఉద్యోగం వచ్చింది.

ఉద్యోగం కోసం బెంగుళూరు వెళ్ళనవసరం లేదన్న తండ్రిని "అన్నీ మీ ఇష్టాలేనా?" అంటూ మాటల్లో సున్నితంగా బెదిరించి, తిండీ తిప్పలు మాని చిన్నపాటి సత్యాగ్రహం చేసి మొత్తానికి ఆయన అంగీకారాన్ని సాధించింది. తనకి తోడుకోసం బామ్మని వెంటబెట్టుకువెళ్ళింది అక్కడికి.

ఆ తర్వాత కృష్ణవేణిని మర్చిపోకపోయినా తల్లిదండ్రులు కుదిర్చిన జానకితో మహేంద్ర పెళ్ళి జరిగింది. భార్యకి తన ప్రేమ కథ చెప్పడం అనవసరమన్పించింది. అందులో తను బాధపడడం మినహా జరగరానిదేదీ జరగలేదు, ఆ మాత్రానికి అనవసరంగా ఆమె మనసుని కలవరపెట్టడం మంచిది కాదనుకున్నాడు.

తన భార్య గుణవంతురాలు, అనుకూలవతి అని కొద్ది రోజుల్లోనే గ్రహించి ఆనందించాడు. తన తల్లిదండ్రులు తనకి అంత మంచి భార్యని తెచ్చినందుకు మురిసిపోయాడు. ఒక రకంగా మళ్ళీ కృష్ణవేణి అతని జీవితంలో ప్రవేశించేవరకూ జానకితో ఎంతో అన్యోన్యంగా వున్నాడు.




మహేంద్ర పెళ్ళయిన సుమారు పదిహేనేళ్ళకి అనుకోకుండా ఒకరోజు రోడ్డుమీద కృష్ణవేణి క్లోజ్ ఫ్రెండ్ కన్పించింది మహేంద్రకి. కుశల ప్రశ్నలూ సమాధానాలూ అయ్యాక కృష్ణవేణి వివరాలు చెప్పింది. ఆమె జీవచ్ఛవంలా బతుకుతోందని కూడా చెప్పింది.

ఆరోజు నుండీ ఈ రోజువరకూ అతని జీవితంలో సుఖం లేకుండా పోయింది. ఆ మాట విని యధాలాపంగా ఊరుకోలేకపోయాడు. ఏదో కారణం కల్పించుకుని బెంగుళూరు వెళ్ళి కృష్ణవేణిని కలిశాడు. ఆమె చెప్పిందంతా విన్నాడు.

చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లయింది అతని పరిస్థితి. జరిగిందానికి చింతించాడు.

ఆమె తనమీద ప్రేమతో పెళ్ళిచేసుకునే ప్రయత్నం కూడా చేయనందుకు చలించిపోయాడు. తానెంత నిర్దయుడినని తననితనే నిందించుకున్నాడు.

అప్పట్నుండీ వీలయినప్పుడల్లా ఆమెని కలుస్తున్నాడు. ఉత్తరాలు రాస్తున్నాడు, ఫోన్లు చేస్తున్నాడు. అయినా తామిద్దరి మధ్యా ఎలాంటి అక్రమ సంబంధమూ లేదు. కానీ సొంత అన్నా చెల్లెళ్లో, తండ్రీ కూతుళ్ళో అయితే తప్ప వేరే ఏ ఇతర స్త్రీ పురుషుల మధ్యా పవిత్రత వుండదని నమ్మే ఈ సమాజాన్ని నమ్మించడం కష్టమే కావచ్చు. అలా రుజువు చేయాల్సిన అవసరమూ లేదు. మనస్సాక్షిని మించిందింకేం వుంటుంది?

అలా అని పెళ్ళి కాగానే చెలిని చెల్లిగా వరసమార్చేంత కుసంస్కారి కాదు మహేంద్ర. అతడికి ఇప్పటికీ కృష్ణవేణిపట్ల ప్రేమ, ఆమె శరీరంపై కాంక్ష వున్నాయి. కానీ ఆమెని తాకాలంటే ఏదో బెరుకు గిల్టీనెస్ అడ్డొస్తాయి.

సహజంగా స్త్రీ కావడాన కావచ్చు కృష్ణవేణి కూడా అతనికి మనసుకే తప్ప మనిషికి చేరువయ్యే ప్రయత్నం చేయలేదు.

క్రమంగా తరుచు బెంగుళూర్ వెళ్ళడం జానకికి అనుమాన హేతువే అయ్యింది. కృష్ణవేణి విషయం భర్త ద్వారానే విని వుంటే అదో రకంగా వుండేది కానీ అలా జరగలేదు. ఇతర్లద్వారా వినడాన ఆ అనుమానం మరింత బలపడింది. రోజురోజుకీ అది వటవృక్షంలా పెరగసాగింది.

ఇద్దరి మధ్యా అవగాహన లోపించింది. మొదట్లో కీచులాటలు జరిగాయి. రానురాను మాటలే కరువయ్యాయి. ఎంతో తప్పనిసరి అయితే మధ్యలో పిల్లల్ని తడికల్లా వుంచి మాట్లాడుకుంటారు. వారి మధ్య ఇంకా ఇంకా అగాధాలు పెరుగుతున్నట్లుంది.

అలా అలా ఆలోచిస్తూ దీనికి పరిష్కారమేమిటని కణతలు నొక్కుకున్నాడు మహేంద్ర.

* * *

ఆదివారం సాయంత్రం టీవీలో ఏదో తెలుగు సినిమా వస్తుంటే చూస్తూ కూర్చుంది వర్ష.

ఆమె మొదట్లో మంచి అభిరుచి వున్నవాళ్లుగా తను విశ్వసించే వ్యక్తులు బాగుందని చెప్పిన సినిమాలు మాత్రమే చూసేది. అలాగే కథలూ నవలలూ కూడా పేరు ప్రఖ్యాతులున్న రచయితలు రాసినవి మాత్రమే చదివేది తప్ప మిగిలిన వాటి ముఖం కూడా చూసేది కాదు. అయితే క్రమక్రమంగా తన పద్ధతి సరయినది కాదని గ్రహించింది.

అనేక కారణాలవల్ల కొన్ని రచనలకి ఉన్నతస్థానం లభిస్తుంది. అంత మాత్రాన అవి మాత్రమే గొప్పవనుకోవడం పొరపాటు. ఇతర్లు మంచివనో, చెడ్డవనో ముద్ర వేయడాన ఆ ప్రకారం తాను అనుసరిస్తే అక్కడ తనకంటూ ఒక వ్యక్తిగత ఆలోచన లేనట్లే. ఒక వస్తువు, వ్యక్తి రచన దేన్నయినా సరే నీ దృష్టిలో నువ్వు చూసి మంచిదయితే ఎందుకు మంచిది, చెడ్డదయితే ఎందుకు చెడ్డది అని తర్కించి చూసినపుడు ఆ వ్యక్తి మానసికంగా ఎదగగలుగుతాడు. ఆమె చదివిన కొన్ని రచన

లే ఆమెకీ జ్ఞానాన్ని కలిగించాయి.

ఆ సినిమాలో రెండు ప్రధాన పాత్రలున్నాయి. వాళ్లిద్దరూ మంచి స్నేహితురాళ్లు. ఇద్దరికీ పెళ్లిళ్లవుతాయి. ఎవరి దారిన వారెళ్తారు. వారిలో ఒకామె పేరు సహనమూర్తి రెండో ఆమె పేరు ఆవేశమూర్తి.

సహనకి బోలెడంత ఆస్తి దేవతలాంటి అత్త ఇంట్లో నౌకర్లు, పోర్టికోలో కార్లు, ఎటు తిరిగీ భర్త విషయంలోనే చిన్న అసంతృప్తి. ఏం లేదు అతడు తాగుతాడు, జూదమాడతాడు, అమ్మాయిలతో కాలక్షేపం చేస్తాడు. అంతే.. అంతకు మించి అతనిలో ఇంకే లోపమూ లేదు. ఆ మాత్రానికి భర్తతో పేచీ పెట్టుకుంటారా తెలివిగల వాళ్లెవరయినా? అసలే సహన ఉత్తమ జాతి స్త్రీ, పతివ్రతా శిరోమణి. అందుకే ఆమె ఏం చేసిందంటే భర్తగారు కోపమొచ్చి చెంపమీద కొడితే "అయ్యో మర్చిపోయారా, రెండో చెంప కూడా వుందండీ, దీని మీద కూడా మీ చేయివేసి నన్ను ధన్యురాల్ని చేయండి ప్రభూ'' అని వేడ్కొంది. అతడు గ్లాసులో విస్కీ పోసుకు తాగుతుంటే, ఐస్ క్యూబ్స్ అందించి, అతడి పేకాటకి వలసిన సౌకర్యాలన్నీ సమకూర్చి, అవసరమయితే అతని కాళ్లు కడిగిన నీళ్లని తీర్థంలా సేవించడానికూడా వెనుదీయని నారీమణి సహన. అంతెందుకు అతడి కారణంగా అతడి తల్లి చనిపోతే కూడా కృష్ణుడి గీతోపదేశాన్ని గుర్తు తెచ్చుకుని చంపేదెవరు, చనిపోయేదెవరు? మానవులంతా కారణమాత్రులు. ఈ నాటక రంగాన్ని నడుపుతున్న సూత్రధారుడు పైన వున్నాడని అర్థం చేసుకుని ఆవేశం తెచ్చుకోని, ఆగ్రహం చెందని మేలిమి జాతి స్త్రీ ఆమె.

ఒకరకంగా చెప్పాలంటే అవన్నీ ఆమె సహనానికి చక్కటి పరీక్షలు. అందుకే వీటన్నింటిలో నెగ్గి తన సహనాన్ని నిరూపించుకుని సకల దుర్గుణోపేతుడయిన భర్తని కూడా పాద దాసుణ్ణి చేసుకోగల్గింది చివరికి.





ఇక ఆవేశ ఇందుకు పూర్తి భిన్నమన్న మాట. తన అనుమానాలతో, ఆవేశాలతో అనవసరంగా భర్తను వేధించినందువల్ల మనసు వికలమై దుర్వ్యసనాల పాలవుతాడు. చివరి నిమిషంలో సహన వెళ్లి ఆవేశకు హితబోధ చేసి పశ్చాత్తాపం చెందేట్లు చేయడంతో సినిమా ముగిసింది.

మొత్తానికి ఆ సినిమా రచయిత, దర్శక, నిర్మాతలు ఎంతో గొప్పవాళ్లనుకోవాలి? యావత్ భారత్ స్త్రీలకీ ఎంత మహత్తరమయిన సందేశమిచ్చారు?

పళ్ల బిగువున సినిమా అంతా చూసేసరికి వర్షకి ఎవరినీ ఏమీ చేయలేక టీవీ పగలగొట్టాలన్నంత ఆవేశమొచ్చింది. తల్లితో చర్చించడానికి ఆవిడ ఇలాంటి విషయాల పట్ల ఆసక్తి కనబరచదు. మనసు నిగ్రహించుకోలేక ఎప్పుడయినా మాట్లాడినా కొన్ని వినీ కొన్ని వినకా ఆс, ఊсలలో సరిపెట్టడమే తప్ప సంభాషణ పొడిగించదు. విసుగేసి తనే విరమించుకుంటుంది వర్ష.

యాంత్రికంగా భోజనం ముగించి, మంచం మీద వాలింది. ఏదో అలజడి. లోపల రక్తం కుతకుతా ఉడుకుతున్న భావన. ఆ సినిమా తీసినవాళ్ల మీద కలిగిన అసహ్యాని కంటే దాన్ని వంద రోజులకు పైగా ఆడించి హిట్ చేసిన జనాలమీద వందరెట్ల అసహ్యం. ఈ సమాజం మరీ ఇంత మురుక్కాలవల్లోనే పొర్లాడుతోందనే బాధ. ఆమె కళ్లు వర్షిస్తున్నాయి.

ఆ కన్నీటి కెరటాల వెనక జలజ కథ కదలాడింది.

★ ★ ★

జలజ వర్షకి పెద్దమ్మ కూతురు. ఇద్దరివీ వేరువేరు ఊర్లు కావడాన తరచు కలుసుకోలేకపోయినా, కలిసినపుడు మాత్రం ఆకలి, నిద్ర మర్చిపోయి కబుర్లు చెప్పుకునేవాళ్లు. జలజ వర్షకంటే మూడేళ్లు పెద్దదయినా ఆ పెద్దరికం కనిపించకపోగా ఆమెకంటే చిన్నపిల్లలా ప్రవర్తించేది. అల్లరితనం, అమాయకత్వం అణువణువునా కనిపిస్తుంటుంది.

ఆ అల్లరి జలజకి పెళ్లి కుదిరింది. అందరి ఆడపిల్లల్లాగే బుగ్గల్లో సిగ్గులు నింపుకుని కాబో యే భర్తగారి గురించి కలలుకన్నది. వర్ష మొదలయిన వాళ్లు ఆమెని ఆటలు పట్టించి నవ్వడమూ, జలజ మరింత సిగ్గుపడిపోవడ మూ పెళ్లయి అత్తగారింటికి వెళ్లడమూ వరకూ బాగానేవుంది.

అన్నం ఉడికిందో లేదో చెప్పడానికి ఒక మెతుకు చాలన్నట్లు జలజ భర్త గుణగణాలు తెలియడానికి వారం సరిపోయింది.

జలజ పెళ్లయిన ఆరు నెలలకి ఆమెనుండి వర్షకి ఒక ఉత్తరం వచ్చింది.

ఉత్తరం మీద ఫ్రమ్ అడ్రసు లేదు. రాత చూస్తే పూర్తి అపరిచితంగా వుంది. బిందు ఎప్పుడో సంవత్సరానికో ఆర్నెల్లకో రాస్తుంది. తరచు కలిసినా కూడా చిత్ర ఉత్తరాలు ఎక్కువ గానే రాస్తుంటుంది. అంత దగ్గరా దూరం కాని మిగిలిన స్నేహితులు హైదరాబాదులో వాన లా అప్పుడప్పుడూ రాస్తుంటారు. మొత్తానికి వాళ్లెవరి దస్తూరీ అలా వుండదు. స్టాంపు కోసం తిప్పి తిప్పి చూసింది. అందులో అసలే క్లారిటీ లేదు.

కవరు చింపేలోపే సస్పెన్సు భరించలేక ఇన్ని ఆలోచనలు చేసి ముందుగా చివరి సంతకం చూసి "ఓసినీ ఎయిత్ వండర్‌లా నువ్వు నాకు లెటర్ రాశావటే జలజా, ఏమిటి విశేషం?!" అనుకుంటూ చదవడం మొదలె ట్టింది.

"వర్షా!

నేనెప్పుడూ ఎవరికీ ఉత్తరం రాయలేదు. అసలలాంటి అవసరం రాలేదు. జీవితంలో మొదటిసారి నా బాధంతా ఇంకొకరికి చెప్పుకో వాలనిపించింది. ఆ ఇంకొకరు ఎవరో ఆలో చించడానికి పది రోజులు పట్టింది.

వర్షా! నాకు ఫ్రెండ్స్ లేరని కాదు. ఉన్నారు కానీ లోపం నాలోనే వుందో వాళ్లలో వుందో తెలీదుగానీ మేం వ్యక్తిగత విషయాలు ఎప్పు డూ మాట్లాడుకోము. ఏదో సరదాగా మాట్లాడు కుని కాలక్షేపం చేసినవాళ్లమే. అలాంటి వాళ్లకి ఇవన్నీ చెప్పి నవ్వులపాలవుతానేమోనని భయమేసింది.

పెళ్లికి ముందు నువ్వు మరీ ఆటలు పట్టించావు. 'ఇంక నీకు మేమేం గుర్తుంటాం. ఎప్పుడయినా కన్పించినా అరే వీళ్లనెక్కడో చూసినట్లుందే అనుకుంటావేమో' అంటూ ఏమేమో మాట్లాడావు. ఆ మాటలు నిజం కావని నీకూ తెలుసు, నాకూ తెలుసు. మిమ్మ ల్నంత మర్చిపోకపోయినా మొత్తానికి మరో ప్రపంచంలో వుండాల్సిన దాన్ని. కానీ ఇలా విచారంలో మునిగిపోతాననుకోలేదు.

కథల్లో, సినిమాల్లో చూపేట్లు నాకు రాబో యేవాడు ఇలా వుండాలి, అలా వుండాలి అని నేనెప్పుడూ ఊహించుకోలేదు. కాకపోతే పె ళ్లంటే ఒక ప్రమోషన్ అనుకున్నాను. దాంతో నాకంటూ ఒక ఇల్లు ఏర్పడుతుంది, నాకూ పెద్దరికం వస్తుంది, నేనూ ఓ ఇంటికి యజమా నురాలినవుతాను, అక్కడ నన్ను మరీ చిన్న పిల్లలా తీసిపడేయకుండా నా మాటలకీ, అభి ప్రాయాలకీ విలువ ఇస్తారు... ఇలా మాత్రం ఆలోచించాను పెళ్లి ఫిక్సయినాక.

కానీ వర్షా! పెళ్లయిన రెండోరోజే చిన్నపాటి షాక్... నేను నా కోసం కేటాయించిన గదిలో కూర్చుని సూట్‌కేస్‌లో చీరలేవో సర్దుకుంటు న్నాను. ఒక్కసారిగా నెత్తిన బాంబ్ పడినట్లు పెద్ద కేక.

"నా షర్టుకి రంగంటించింది దొంగ... అసలీ షర్టు దానికెందుకేశావు?"

నేను ఉలిక్కిపడ్డాను. ఒక్కక్షణం నా గుండె ఆగినంత పనయ్యింది. నాది మరీ వీక్ హార్టా? అందులో ఏముందని, ఎవరూ ఎవరినీ చంపమనలేదుగా అనుకోకు. కొత్తగా పెళ్లయిన దాన్ని ఎలాంటి మూడ్‌లో వుండుంటానో ఆలో చించు. ఆ మాటలన్నది కిరణ్ (నా భర్తగారు), చెప్పింది వాళ్ల వదినతో అంటే మా తోటికోడ లితో, అన్నది పనిమనిషి గురించి.

ఇతనేనా నా భర్త ఈయనకింత పెద్ద

గొంతా? కోపమొస్తే ఇలా తిట్టగలడా? వదినంటే తల్లితో సమానమంటారు. ఆవిడ మీద అంత పెద్దగా కేకలు పెట్టడమేంటి? పని మనిషి చేసింది తప్పే. కానీ ఆ చిన్న తప్పుకి ఇంతగా ఇరిటేట్ అవ్వాల్సిన అవసరంలేదే? అంటే ఇకపై ఏ చిన్న పొరపాటు జరిగినా నా మీద కూడా ఇలాగే అరుస్తాడా? అని తెగ బాధపడిపోయాను.

అలా మొదలయిన నా భయం అరచేతిలో ప్రాణాలు పెట్టుకు బతికేంతవరకూ వచ్చింది. కిరణ్‌కి విపరీతమయిన కోపం. ఎంత చిన్న విషయాలనీ కూడా రాద్ధాంతం చేసి రణరంగంగా మారుస్తుంటాడు. గోటితో పోయే వాటిని గొడ్డలి వరకూ తేవడమంటే ఇదేనేమో. చదువుకున్నాడన్న మాటేగానీ కొన్నిసార్లు ఎంత వల్గర్‌గా మాట్లాడతాడంటే... ఇది మామూలుగా వున్నప్పటి సంగతి. ఇక మందు పుచ్చుకున్నప్పటి పరిస్థితి మరీ దారుణంగా వుంటుంది. అమ్మానాన్నా పెంచి పెద్ద చేసి పెట్టి పోషించారు, కానీ వాళ్లెపుడూ నన్నో చిన్న దెబ్బ వేయలేదు. కానీ అందర్నీ వదులుకుని, కట్నకానుకలతో సహా వెళ్లి, గాడిదచాకిరీ చేసి పెట్టినందుకు గొప్ప ఫలితమే ఇస్తున్నాడు. తిట్లు, తన్నులు. ఈ పరిస్థితికి నా మీద నాకే అసహ్యమేస్తోంది. అతనో డిక్టేటర్ అన్న మాట. తనేం చెప్తే దాన్ని అక్షరాలా పాటించాలి. లేకపోతే తన్నులు. ఆ చేసేది మొహం ప్రసన్నంగా పెట్టుకుని చేయాలి. లేకపోతే మళ్లీ తన్నులు. నీకు ఎన్నని ఉదాహరణలు చెప్పను?

ఒకరోజు ఉదయం తనకి చూడాల్సినవన్నీ చూసి పూజ చేసుకుంటున్నాను. పిలిచాడు, విన్పించింది. ఆ పిలుపులో యజమాని కూలీని పిలుస్తున్న చందమే తప్ప ఒక భర్త భార్యని పిలిచినట్లు వుండదు. పూజలోంచి లేవడం ఇష్టంలేక పలకలేదు. రెండోసారి మరింత కఠినంగా విన్పించింది. ఇక తప్పలేదు. ఆ పూజేదో తర్వాత చేసుకోవచ్చని లేచి వెళ్లాను. తీరా చూస్తే ఆయనగారి ఫ్రెండ్స్ ఇద్దరు కూర్చునివున్నారు. వాళ్లకి త్వరగా టీ పెట్టి తేవాలి. నిజం చెప్తున్నాను. కోపమే వచ్చింది, కానీ ఏమనగలను? ఈ మాత్రానికి పూజలోంచి లేపాలా అన్పించింది. టీ పెట్టి తీసికెళ్లి ఇచ్చాను. వాళ్లు వెళ్లిపోయాక మళ్లీ తిరణాలు... నా ముఖం ప్రసన్నంగా లేదట. నేనేం వస్తువునా వర్షా? నాకు ఇష్టాలూ అయిష్టాలూ వుండవా? ఇక్కడ టీ పెట్టడం సమస్య కాదు. కానీ పూజ చేసుకుంటున్నానని చూసీ అందులోంచి లేపితే నాకు మాత్రం బాధ వుంటుందా? తన్ని నవ్వమంటే నవ్వొస్తుందా చెప్పు.

నాకు ఆకలేస్తే నేను తినకూడదు, అతను తినమని ఆజ్ఞాపిస్తే తినాలి. అలాని ఆకలేయకపోతే తినకుండానూ వుండకూడదు అతను చెప్తే చచ్చినట్లు తినాలి. ఇలాంటిదన్నమాట ప్రస్తుత నా పరిస్థితి.

ఇక్కడ నా ఆలోచనకి ఏమాత్రం విలువ లేదు. కూర్చోమంటే కూర్చోవాలి, నిలబడమంటే నిలబడాలి. ఆఖరికి నా శరీరం మీద కూడా నాకు హక్కులేదు. పగలంతా మాటలతోనో చేతలతోనో హింసించిన ఆ మనిషిని అంటుకోవడమంటే గొంగళిపురుగుని తాకినంత అసహ్యంగా వుంటుంది. అయినా దాన్ని వారించే శక్తి నాకు లేదు.

ఇదంతా అమ్మావాళ్లకి చెప్పాలని ఎంతో ప్రయత్నించాను. కానీ వాళ్ల ఆలోచనలు నాకు తెలియనివి కాదు. వాళ్లు నన్నేం సమర్థించరు. పైపెచ్చు ఆడపిల్లకి ఆ మాత్రం ఓర్పు లేకపోతే ఎలా అంటారు. అసలు ముందు చెప్పి, వాళ్లేమంటారో తెలుసుకోకుండానే ఊహాగానాలేంటనుకోకు. నేనేం చెప్పకుండానే నేను డల్‌గా వుండడం చూసి మొన్న వెళ్లినపుడు అమ్మావాళ్లంతా ఏవేవో కథలు చెప్పి, ఎన్నో ఉదాహరణలు చూపి ఆడపిల్ల గురించి అత్తవారింటి గురించి హితబోధలు చేశారు. వాళ్లకి నా బాధ అర్థమవుతుందనే నమ్మకం కలగలేదు, అందుకే చెప్పలేదు.




వర్షా! నాకిలాంటి దిక్కుమాలిన సంబంధం తెచ్చారని నాన్నని నిందించను. ఆయనకేం కన్నకూతుర్ని నట్టేట్లో ముంచాలని వుండదు. పాపం ఎంతో ఎంక్వయిరీ చేశారు. ఒక మనిషి బయటి ప్రపంచానికి కన్పించేదానికీ, ఇంట్లో ప్రవర్తించేదానికీ చాలా తేడా వుంటుందని ఇప్పుడన్పిస్తోంది.

ఈ ఇంటినుండి, ఈ మనిషి నుండి ఎక్కడికీ పారిపోలేనని తల్చుకుంటే చాలా దిగులుగా వుంది. నాకంటే జైల్లో ఖైదీలు నయమేమో. ఎందుకంటే వాళ్లు ఒంటరిగా వుండరు కాబట్టి కిరాతకుల్లా ప్రవర్తించే సెంట్రీల మీద వార్డెన్ల మీద వాళ్లల్లో వాళ్లుమాట్లాడుకుని లోపలున్న కసిని తగ్గించుకోగల్గుతారు. కానీ ప్రతి నిమిషం నేను పడే బాధని ఎవరితో పంచుకోవాలో కూడా తెలీని పరిస్థితిలో వున్నాను. నేనేం పాపం చేశానని నాకీ శిక్ష చెప్పు?!

ఉత్తరమంతా చదివి ఇంతకీ ఈ విషయమంతా నాకెందుకు రాసింది అనుకోవు కదా?! అనుకోవనే ఆశతోనే రాశాను. లావాలా పొంగి వస్తున్న బాధని నాలో నేను ఎన్నాళ్లని అణచుకోను? ఈ ఉత్తరం రాస్తుంటే ఏదో కాస్త రిలీఫ్‌గా ఉంది. వర్షా! నేనెంత ఆటకాయితనంగా సరదాగా నవ్వుతూ తుళ్లుతూ జీవితం గడిపానో ఇప్పుడందుకు పూర్తి వ్యతిరేకంగా గానుగెద్దులా బతుకుతున్నాను. పెళ్లయి ఆర్నెల్లే అయినా అరవయ్యేళ్లు దాటినట్లుంది. ఒక్కోసారి చచ్చిపోవాలన్పిస్తుంది. కానీ చావడానిక్కూడా చాలా ధైర్యం కావాలి. దానికోసం ఎదురు చూస్తున్నాను కానీ ఎదురు వెళ్లలేకపోతున్నాను.

కొందరు భార్యాభర్తలు జన్మజన్మలకీ వాళ్లే తమ జీవిత భాగస్వాములు కావాలని కోరుకుంటారట. కానీ నేను మాత్రం వేయి జన్మలెత్తినా ఇతనుకానీ ఇలాంటివాళ్లుగానీ వద్దని ప్రార్థిస్తున్నాను.

వర్షా! కనీసం నువ్వయినా పెళ్లి గురించి సరిగ్గా ఆలోచించు. దాన్ని మరీ తేలిగ్గా తీసుకోకు, ఎవరో ఒకరు వస్తారులే అనుకోకు. నువ్వు చేసుకోబోయే వాడి గురించి ఇతర్లు చెబితే వినడం కాదు నీకై నువ్వు పరిశీలించు. అతనితో కొన్నాళ్లయినా స్నేహం చేసి అతని మనస్తత్వాన్ని ప్రవర్తననీ అవగాహన చేసుకుని అన్నివిధాలా సరిపోయేట్లయితే అప్పుడు పెళ్లి చేసుకో. అంతే తప్ప త్వరపడి నిర్ణయాలు తీసుకోకు, నువ్వు సుఖంగా వుండాలని కోరుకుంటూ, నీ జవాబు కోసం చూస్తుంటాను.

...ప్రేమతో ...జలజ"

ఉత్తరం ముగించిన వర్షకి గుండె బరువుగా అన్పించింది. ఒక్క నిమిషం తటపటాయించి తల్లికి చూపింది ఆ ఉత్తరాన్ని. అది చదివిన గిరిజ నిర్లిప్తంగా వుండిపోయింది.

కొంతసేపు తల్లి మాట్లాడ్తుందేమోనని ఎదురు చూసిన వర్ష ఇక లాభం లేదనుకుని "ఏంటమ్మా అలా మౌనంగా వుండిపోయావు?" అంది.

"ఏం మాట్లాడను? పాపం దాని బతుకలా అన్యాయమైపోయిందేమిటాని బాధగా వుంది'' అంది గిరిజ.

"బాధపడి ఊరుకోవడమేనా, అంతకంటే మనమేం చేయలేమా?" కాస్త ఆవేశంగానే అడిగింది వర్ష.

"ఏం చేస్తాం? భర్తని వదిలేయమని చెప్తావా? ఆ తర్వాత పరిస్థితి గురించి ఆలోచించు, ఆవేశం కాదు ముఖ్యం. ఇంకేమయినా చేయగలిగితే అదే చేయాలి'' అంది గిరిజ.

"ఎవరూ జలజా, తనేం చేయగలదు?"

"ఏం చేయగలదేంటి? మంచి మాటలతో భర్తను మార్చుకోవాలి''

ఆ మాట విన్న వర్షకి కోపమొచ్చింది, బాధేసింది. అంతకంటే ప్రోగ్రెసివ్‌గా ఆలోచించలేని తల్లితో ఆ విషయమే ఇంక మాట్లాడడం ఇష్టం లేక అక్కణ్ణుంచి వెళ్లిపోయింది.

ఆ తర్వాత తల్లికి చెప్పకుండా జలజకి అలాంటి భర్తని వదిలేయడమే మంచిదని సలహా ఇస్తూ ఉత్తరం రాద్దామనుకుంది. కానీ

ఆవేశం తగ్గి నెమ్మదిగా ఆలోచిస్తే అలా రాయడం మంచిది కాదనిపించింది.

నువ్వే నా పెద్దమ్మ కూతురుగాక కేవలం ఒక స్నేహితురాలివి అయ్యుంటే బాగుండేది జలజా! నా మనసుకి తోచింది చెప్పేదాన్ని. ఇప్పుడలా కాదు. ముందూ వెనకా అన్నీ ఆలోచించాలి. నేను ఏం చెప్పినందువల్ల ఎవరెలా రియాక్టవుతారనే భయమూ, బెంగా వుంటాయి. అంతా హిపోక్రసీ. అనుకునేదొకటి అనేదొకటి అని చాలాసేపు బాధపడి ఎన్వొలప్ మీదున్న ఫ్రం అడ్రసు చూసి జలజకి వీలయినంత డిప్లొమాటిగ్గా ఉత్తరం రాసింది వర్ష. అందులో ఎక్కడా జలజ ఉత్తరం తనకు రాసినట్లు తేలలేదు. అందుక్కారణం ఒకవేళ ఉత్తరం ఇంకెవరి చేతుల్లోకన్నా వెళ్తే మళ్లీ జలజకి అందువల్ల ఏమాటా రాకపోవడం కోసం. తనంతట తానే రాస్తున్నట్లు రాసి జలజని కొన్నాళ్లు హైదరాబాదుకి వచ్చి వుండమని కూడా జోడించింది.

కానీ ఆ ఉత్తరానికి జలజ నుండి ఎలాంటి రెస్పాన్సూ లేదు. అయినా ఏదో సందర్భంలో గుర్తొచ్చి బాధపడ్తూనే వుంటుంది వర్ష.

★ ★ ★

మరుసటి ఆదివారం చిత్ర ఇంటికెళ్లింది వర్ష.

ఆరోజు మళ్లీ టీవీలో వచ్చిన సినిమాపై చర్చ జరిగింది. అప్పుడే జలజ ప్రసక్తి కూడా వచ్చింది.

"చిత్రా! సామాన్యంగా నాకో నమ్మకం వుంది. ఎవరయినా సరే ఇద్దరు మనుషులకి గానీ రెండు పక్షాలకిగానీ సరిపడనపుడు విడివిడిగా ఎవరి వెర్షన్ విన్నా కరక్టే అనిపిస్తుందని. కానీ ఇక్కడ జలజ రాసింది చదివి కేవలం తన ఏంగిల్లోంచి చూసి నేను మాట్లాడ్డం లేదు. జలజ నాకు పెద్దమ్మ కూతురనేదీ ఇక్కడ

ముఖ్యం కాదు. తన సైకాలజీ నాకు బాగా తెలుసు. చాలామంచిది. ఎవరి జోలికీ పోదు. వీలయినంత వరకూ అందరితో మంచిగా వుండాలనుకునే తత్వం. కాస్త సరదాగా చిన్నపిల్లలా మాట్లాడ్తుంది. ఇక పని విషయానికొస్తే వాళ్లింట్లో మొదట్నించీ పెళ్లికాని బాబాయిలు, పెళ్లయినప్పటికీ తరచు వచ్చే మేనత్తలూ, వాళ్ల సంతానం ఇలా జనం ఎక్కువే కాబట్టి అందుకు తగ్గట్లు ఇంట్లో పని కూడా ఎక్కువగా వుంటుంది. మొదట్నుంచీ కూడా పనికి భయపడేదికాదు. వంటావార్పూ కూడా బాగా చేస్తుంది. అమ్మ ఎన్నోసార్లు జలజతో పోల్చి నన్ను తిట్టేది. అందుకే ఇన్ని ప్లస్ పాయింట్స్ వున్నాయి కాబట్టే స్వయంగా నేను చూడకపోయినా జలజని నమ్మగలుగుతున్నాను'' అంత సుదీర్ఘంగా మాట్లాడ్డంలోనే తెలిసిపోతోంది వర్ష ఆవేశం.

"పిచ్చిదానా! నేనేమైనా జడ్జిననుకున్నావా? జలజ మంచిదని నన్ను నమ్మించడానికి నువ్వేం తంటాలు పడనవసరంలేదు'' నవ్వింది చిత్ర.

అందుకు వర్షేం నవ్వకుండా "అంత మంచిది, అమాయకురాలూ కాబట్టే ఇంత బాధపడ్తున్నాను. అసలు ఒక్కోసారి నేనింత మానవత్వం లేని మనుషుల మధ్య ఎందుకు పుట్టానా అన్పిస్తుంది. వేషభాషల్లో కనిపించే నాగరికత ఆలోచనల్లో వుండదెందుకో. తిన్నగా మాట్లాడ్డం రాని వాళ్ల దగ్గర్నుంచీ మేధావులుగా చెల్లిపోతున్న మట్టి బుర్రల వరకూ అందరికీ స్త్రీలంటే చిన్నచూపే. కాకపోతే తెలివిలేనివాళ్లు చాదస్తంగా చెప్తే తెలివయినవాళ్లు ఇంకోలా చెప్తారు''

"సమస్యని సమస్యగా చూడు, స్త్రీ పురుష భేదంతో వద్దు''

"నేనూ అలాగే అనుకుంటాను. కానీ సమ

స్య అందులోంచే పుడుతున్నపుడు ఆ ప్రసక్తి లేకుండా వుండడమెలా? స్త్రీ పురుష భేదం అణువణువునా జీర్ణించుకుపోయింది, లేద న్నంతలో లేకుండా ఎలా పోతుంది?"

"ఇది మరీ బావుంది. నేను జెండర్ మార్చే యమనడంలేదు. కాకపోతే కొన్నికొన్ని సమస్యలు పరిస్థితుల ప్రభావంవల్ల ఏర్పడతాయి తప్పించి కేవలం స్త్రీ పురుష వ్యత్యాసం వల్ల కాదు. ఉదాహరణకి ఆ కిరణ్ ఎవరోగానీ అంత దురుసుతనంగా వుండడానికి అతని ఇంటి పరిస్థితులు చుట్టుపక్కల జనాల ప్రభావం అన్నీ వుంటాయి. నా అనుమానం బహుశా ఆ ఇంట్లో ఆడపిల్లల సైకాలజీ కూడా అలానే వుండివుంటుంది''

"కావచ్చుకానీ అరిటాకు సామెత మర్చిపోయావా? ఏ పరిసరాల ప్రభావంతోనో ఆడపిల్లలు దురుసుతనం అలవర్చుకుంటే కూడా వాళ్లకే నష్టం, పెళ్లికాకముందు సంగతెలావున్నా అయ్యాక మాత్రం అవస్థలే. చదువుకుంటున్నారు, అభివృద్ధి సాధిస్తున్నారు, శూన్యంలో ప్రయోగాలు చేస్తున్నారు. ఏం లాభం ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీల మోత అన్నట్లుంది. గడప దాటితే గొప్పవాడే కానీ ఇంట్లో భార్య పాలిట మాత్రం యముడు''

"నీకు ఆవేశమొచ్చిందంటే అందర్నీ కలిపి కొట్టేస్తావు''

"నేనన్నంతలోఅయిపోరులే. మెజారిటీ అలాగే వున్నారు. గొప్పగొప్ప కవులు, కళాకారులుగా పేరు తెచ్చుకున్న పెద్ద మనుషులు కూడా ఇంట్లో భార్యని అసెయ్, ఒసేయ్ అనడమే కాదు తన్ని తగలేయడాలు కూడా తెలుసు''

"తన్నడం తప్పేగానీ అసెయ్ అంటూ పిలవడాన్ని మాత్రం తప్పుపట్టకు. చాలా కుటుంబాల్లో అలా పిలవడం అలవాటయిపోయింది. అందుకే వాళ్లకది తప్పుగా కన్పించకపోవచ్చు''

"అలవాటని అంత తేలిగ్గా తీసి పారేయకు. మనుషులు కంప్యూటర్లు కాదు ఎలా ఫీడ్ చేస్తే అలా నడుచుకోడానికి. ఎవరో గడ్డి తిన్నారని గుడ్డిగా మనమూ తింటామా? ప్రొద్దున్నే కాఫీ ఇవ్వడంతో మొదలు, రాత్రి కాళ్లు పట్టించుకోవడం వరకూ అవసరమయిన ఊడిగాలన్నీ చేసే భార్యని అలా నీచంగా ఎలా పిలవగలుగుతారో. అవి విని పౌరుషం లేని పెళ్లాలు ఎలా సహించగల్గుతారో నాకర్థం కాదు''

"చూడమ్మాయి! ప్రపంచంలో మనిషిగా పుట్టిన ప్రతి ఒక్కరూ ఇతర్లు తమని గౌరవంగా చూడాలనే కోరుకుంటారు. భర్త పనిమనిషిని పిలిచినట్లు పిలవడం బహుశా ఏ భార్యకీ ఇష్టంగా వుండదు. కాకపోతే పిలిచేవాళ్లకి బుద్ధి లేనపుడు ఏం చేస్తారు? పౌరుషమున్నా అలవికాని చోట అధికులమనరాదు అన్నట్లు అయిష్టాలని కూడా అలవాటు చేసేసుకుంటారు. రేపు నీకు పెళ్లయి ఆ వచ్చేవాడు అలా పిలిస్తే నువ్వు మాత్రం ఏం చేస్తావు చెప్పు?!"

"అలా పిలవొద్దని వార్నింగిస్తాను''

"అయినా వినలేదనుకో విడాకులిస్తావా?" నవ్వింది చిత్ర.

వర్ష కోపంగా చూసి "అసలలాంటి కల్చర్‌లెస్ బ్రూట్‌ని నేను చేసుకోవడంలేదు'' అంది.

"లైఫ్ ఈజ్ నాటె జోక్ బేబీ! సంవత్సరాల తరబడి స్నేహం చేస్తేనే ఒక మనిషి గురించి ఇంకో మనిషికి పూర్తిగా తెలీదు. అంతెందుకు పుట్టినప్పట్నుంచీ చూస్తున్నా అమ్మా నాన్నల సైకాలజీ పూర్తిగా అర్థం కాదు. అలాంటిది నువ్వు చేసుకునే వాడిని ఎన్నాళ్లని పరిక్షించగలవు? ఇంకో సంగతి తెలుసా, పెళ్లికాకముందు మర్యాదగా వున్నవాళ్లు కూడా పెళ్లికాగానే..."

"మారిపోతారంటావా? అప్పుడు మనమూ మారిపోవాలి, అసలు నన్నడిగితే వాళ్లలా తయారవడానికి కారణం స్త్రీలే. ఆ పిలుపులకి ఎప్పటికీ అలవాటు పడకూడదు. భార్యాభర్తా జీవిత భాగస్వాములన్నారు తప్ప యజమానీ నౌకరూ అని ఎవరూ చెప్పలేదు. కానీ మనదే




శంలో భార్యా భర్తలు మాత్రం సిసలైన రాజూ బంటుల్లా కన్పిస్తున్నారు. భర్త 'అది' అంటుంటే భార్య 'అండీ' అనడానికి. ఛఛ సెల్ఫ్ రెస్పెక్ట్ లేనిమనుషులంటే అసహ్యమేస్తుంది. భర్తలని అందలాలు ఎక్కించడం, భార్యలని అణిచేయడం ఊపిరి పీల్చుకున్నంత సహజంగా కన్పిస్తోంది మనవాళ్లకి''

"చూడు వర్షా! నీలాంటివాళ్లు ముందడుగు వేద్దామన్నా మన పెద్దవాళ్లు వేయనివ్వరు. మా అత్తకూతురు బృంద తెలుసుగా నీకు. తను లవ్‌మేరేజ్ చేసుకుంది. వాళ్లిద్దరూ క్లాస్‌మేట్స్ ఒకర్నొకరు నువ్వు అనుకుంటూ పేరు పెట్టి పిల్చుకునేవాళ్లు. పెళ్లయాక అలవాటుకొద్దీ అలాగే పిలుస్తుంటే వాళ్ల అత్తగారు మందలించి, అది పద్ధతి కాదనీ భర్తని గౌరవించని స్త్రీలు స్త్రీలే కారని లెక్చరిచ్చిందట"

"బుద్ధికి పెద్దరికం ఇవ్వాలిగానీ వయసుకి కాదు. మనం నిజమని నమ్మినదాన్ని ఒకరి కోసం ఎందుకు మార్చుకోవాలి? పలకడానికి పిలిచే పిలుపు కోసం ఇంత డిస్కషనెందుకు అనుకోవచ్చు. కానీ తరతరాల బానిసత్వమంతా ఆ పిలుపులోనే కన్పిస్తోంది. ఆ పిలుపు మనవాళ్లలో ఎంత జీర్ణించుకుపోయిందంటే మొన్న మా పత్రికకి ఒక ఫ్రెంచ్ కథ అనువాదం వచ్చింది. అంటే అది ఇంగ్లీష్ నుండి అనువదించి పంపారన్నమాట. అందులో భర్తని మీరు అనడం భార్యని నువ్వు అనడం చూస్తే చికాకేసింది. ఇంగ్లీషులో యు అని ఒక పదమే వుంటుంది. కానీ మన భారతీయ కళ్లకి అందులో కూడా సందర్భానుసారం అర్థం మార్చాలన్పించింది కాబోలు''

చిత్ర నవ్వి "క్రానిక్ డిసీజ్ ఒక్క రోజులో పొమ్మంటే పోతుందా? మన అమ్మమ్మలు భర్తని నిజంగానే దేవుడని భ్రమించి కాళ్లకి దణ్ణాలు కూడా పెట్టేరు. మన అమ్మలు మరీ దేవుడనకపోయినా దేవుడి తర్వాతివాడు, అందరికంటే ముఖ్యుడూ అని గౌరవించారు. మనం దాన్ని కూడా దాటి వస్తున్నాం"

"మనమట మనం. ఈ విషయంలో మాత్రం నిన్ను నాతో కలపకు ఇవాళేదో కాస్తవింతగా వుందిగానీ నీ ధోరణి. మామూలుగా నువ్వూ పతివ్రతా జాతి స్త్రీవే. మీ ఆయన నీ నెత్తినెక్కి చిందులేస్తున్నా తల్లో పూలు పెట్టుకున్నంత హాయిగా భరిస్తావు'' వెక్కిరించింది వర్ష.

"మాంసం తిన్నంతలో ఎముకలు మెళ్లో వేసుకోవాలా? మేల్ డామినేషన్ నాకూ నచ్చదు. అయినా అది వుండేది, వుంది, వుంటుంది. పూర్తి సమానత్వం అనేది మరో వేయి జన్మలెత్తినా రాదు. కాకపోతే అది వికృతరూపం దాల్చకుండా వుండాలి''

"నువ్వు చెప్పేది ఎలా వుందంటే దొంగతనం నాకు నచ్చదు, అయినా దొంగలుంటారు. ఆ దొంగగార్లు కొంతయినా కనికరించి పూర్తిగా దోచుకోక పోతే చాలు దేవుడా! అన్నట్లుంది'' ప్రతి అక్షరం వ్యంగ్యంగా పలికింది వర్ష.

వర్ష అభినయానికి రెండుమూడు నిమిషాలు ఆపకుండా నవ్వింది చిత్ర. తర్వాత "ఆ సృష్టించినవాడే ఆ తేడా కల్పించాడు, వీళ్లని అనుకుని ఏం లాభం?" అంది.

"ఫిజికల్ స్టామినా... అంతేగా... బలమున్నంతలో రాక్షసులు గొప్పవాళ్లవుతారా?"

"రాక్షసత్వాన్ని టాలరేట్ చేయలేం నిజమే. కానీ మగవాళ్లలో కొంత డామినేషన్ స్వతహాగా వస్తుంది. నాటోన్లీ ఫిజికల్ స్ట్రెంత్... టోన్, థాట్స్.. ఏదయినా చూడు ప్రతిదీ కాస్త హార్ష్‌గానే వుంటుంది. స్త్రీలలోవున్న డెలికసీ సామాన్యంగా వాళ్లలో వుండదు, వున్నా బాగోదు. ఒక అమ్మాయి సిగ్గుపడితే అందం రెట్టింపవుతుంది, అదే ఒక అబ్బాయి సిగ్గుపడితే ఘోరంగా వుంటుంది''

"ఆకలేస్తే అన్నం తింటే అరుగుతుంది, రాళ్లుతింటే కాదు అని కూడా చెప్పరాదు? కాన్వెంట్ పిల్లకి చెప్పినట్లు చెప్తున్నావు. నేనేం స్త్రీలు సిగ్గుపడకూడదు అనిగానీ స్త్రీల స్వరంలో వుండే కోమలత్వం పురుషపుంగవులకి రావాల

నిగానీ అనలేదు. స్త్రీలని బానిసల్లా మాత్రం చూడొద్దనే నేననేది'' అంది.

"డామినేషన్ వున్నమాట నిజమేగానీ పరిస్థితులని అర్థం చేసుకుని సర్దుకుపోయే తత్వం అలవాటు చేసుకుంటే స్త్రీ పురుషులిద్దరూ సుఖపడవచ్చు. ఎక్కడివరకో ఎందుకు? అమ్మ సంగతే చూడు. నాన్న కథంతా నీకు తెలుసుకదా! నాన్నేం చెడ్డమనిషి కాదు. చిన్న వీక్‌నెస్... కోరుకున్నామెని చేసుకోలేకపోయారు. తీరా ఆవిడింకా పెళ్లి చేసుకోలేదని తెలిసేసరికి... అప్పుడప్పుడు వెళ్లి చూసొస్తున్నారు నిజమే. అందుకు ఆయనే ఎంతో గిల్టీగా ఫీలవుతారు. ఏ విషయంలోనూ అమ్మని అశ్రద్ధ చేయరు. తను కాస్త అర్థం చేసుకుని సర్దుకుంటే తనకీ హాయిగా వుంటుంది కదా... కానీ''

"అవునవును సర్దుకోవాలి. నాకు చిన్నప్పటి విషయం గుర్తొస్తోంది. హర్షా, నేనూ ఏ బొమ్మకోసమో కుస్తీ పడుతుంటే మా అమ్మ వచ్చి, 'మంచివాళ్ళెప్పుడూ ఇతర్లతో పోటీపడరు, సర్దుకుంటారు' అని చెప్పేది. నేను మంచిదాన్ననిపించుకోవాలనే మెహర్బానీ కోసం సర్దుకోవడం అలవాటు చేసుకున్నాను. చిన్నప్పటినుంచీ కూడా అమ్మాయిలకే సర్దుబాటు లక్షణాలు నేర్పిస్తారు. స్త్రీకి భూదేవంటూ ఓ పనికిమాలిన సర్టిఫికెట్ ఒకటిచ్చారుగా దాన్ని నిలబెట్టుకోవద్దూ మరి''

"ప్చ్...నువ్వు పొరపాటు బడ్తున్నావు వర్షా. నేనా ఉద్దేశంతో అమ్మని సర్దుకోమనడం లేదు. ఒక రకంగా అమ్మ పట్ల నాకెంతో సింపథీ ఉంది. కానీ నాన్నని కూడా అర్థం చేసుకోవాలిగా. ఆయనేం తాగొచ్చి తన్నటం లేదు. అంత ప్రేమున్నా ఆవిణ్ణేం పెళ్ళిచేసుకుని మమ్మల్ని వదిలేయలేదు. నిర్దాక్షిణ్యంగా భార్యని గెంటేసినవాళ్ళు ఎందరు లేరు లోకంలో' అంది చిత్ర.

మెట్ల దగ్గర తలుపు గడియ పెట్టేసి టెర్రెస్ మీద కూర్చున్నారు వాళ్ళిద్దరూ. అక్కడికి ఇంకెవరూ వచ్చే అవకాశం లేదు. అందుకే ఆంతరంగిక విషయాలు అంత ధైర్యంగా మాట్లాడుకుంటున్నారు.

"నిజమే ఇంట్లోంచి గెంటేయలేదనీ, తను గాక ఒక్కావిడతోనే తప్ప ఇద్దరు ముగ్గురితో సంబంధంలేదు కదాని సంతోషించాల్సింది పోయి ఆంటీ బాధపడడంలో అర్థంలేదు''

"ఇదిగో! నువ్వింకోసారి వ్యంగ్యంగా మాట్లాడావంటే వంగదీసి నాలుగు తంతాను. అస్సలు నేను చెప్పేది అర్థం చేసుకోడానికి ప్రయత్నించవే?"

"ఏంటి నిన్నర్థం చేసుకునేది? అదే పని ఆంటీ చేస్తే నువ్వింత పాజిటివ్‌గా, ప్రోగ్రెసివ్‌గా ఆలోచించేదానివా?"

"అంటే?!"

"ఏముంది? ఆంటీక్కూడా పెళ్లికి ముందే వేరే లవ్‌స్టోరీ వుండి, అతను ఇప్పుడు మళ్లీ కలిస్తే, తరచు కలవాలనుకుంటే?"

అప్పటికే చిత్ర ముఖంలో రంగులు మారాయి. జవాబు చెప్పకుండా తలొంచుకుని చేతులు నలుపుకుంటూ వుండిపోయింది.

రెండు నిమిషాలు వర్షకూడా మౌనంగా వుండిపోయింది.

"సారీ చిత్రా! కోపమొచ్చిందా? నేను అతిగా చనువు తీసుకుని మాట్లాడినట్లున్నాను. కానీ నా బాధొక్కటే. ప్రతి విషయంలో స్త్రీనే ఎందుకు సర్దుకోమంటారని. మనం మనుషులం కామా? మనకి ఆలోచన్లూ, ఆవేశాలూ వుండవా? ఈ మగవాళ్లంతా తమ భార్యల్లో సిసలయిన సిన్సియారిటీ వుండాలనుకుంటారు, కానీ వాళ్లూ అలాగే వుండాలని భార్యలు ఆశిస్తే మాత్రం అది అత్యాశ లేకపోతే పొజెస్సివ్ నేచర్, కాకపోతే గయ్యాళి అంతేగా?! నన్నడిగితే ఆంటీలో క్వింటాల్స్ కొద్దీ పేషెన్స్ వుండబట్టి తనకి తను బాధపడుతూ వూరుకుంటున్నారు. కాదా చెప్పు?!" బాధగా అంది వర్ష.

"నాకూ చాలాసార్లు అలాగే అన్పిస్తుంది. కానీ నాన్న ఇప్పటికే గిల్టీగా ఫీలవుతున్నారు.




త్వరలోనే రియలైజ్ అవుతారనీ నమ్మకం నాకుంది వర్షా!" అంది చిత్ర.

"అవునమ్మా మగమహారాజులు. కాదని పోతే కుమిలిపోతూ ఎదురు చూడాలి, మళ్లీ బుద్ధిపుట్టి వస్తే ఎగిరి గంతేయాలి''

"అసలు నువ్వు మరీ స్త్రీ పక్షపాతిలా మాట్లాడకు. ఇదిలా జరగడానిక్కారణం ఒక స్త్రీనే. కృష్ణవేణి... చేసుకుంటే ధైర్యంగా పెద్దవాళ్లని ఎదిరించైనా పెళ్లి చేసుకుని వుండాల్సింది. అప్పుడేమో ధైర్యం చాలక ఇపుడు పెళ్లయి, పిల్లలు కూడా వున్నారని తెలిసీ నాన్న వెంట పడడం ఆవిడ తప్పు కాదా?" ఉక్రోషంగా అంది చిత్ర.

"తప్పే, నేనేం కాదనడం లేదు. స్త్రీలంతా ఉత్తమోత్తములు అని నేనేం స్టేట్‌మెంట్ ఇవ్వ లేదే. ఆవిడకి ఎంత వయసొగానీ ఇంకా ప్రేమ మత్తు వదిలినట్లు లేదు పాపం. అందుకే అఫీషియల్‌గా పెళ్లిచేసుకోకపోయినా, తన కోసం భార్యాపిల్లల్ని వదులుకోలేడని, గుబులు మళ్లినపుడు విడిచి వెళ్లిపోతాడని తెలిసినా మగవాళ్లని చేరనిస్తున్నారు ఇలాంటి స్త్రీలు. కానీ ఆవిడ మీద నీకు కోపంగా వుందేమోగానీ నాకు మాత్రం జాలేస్తోంది. ఆంటీ గురించి మీ అందరికీ సింపతీ వుంది కానీ ఆవిణ్ణి లోకం తిట్టిపోస్తుంది''

చిత్ర సాలోచనగా తలూపింది.

"నిజంగా స్త్రీల బతుకులు ఎంత ఇన్‌సెక్యూర్డ్‌గా తయారయ్యాయంటే పెళ్లయినంతలో కలిసి వుంటాడని నమ్మకంలేదు. నువ్వు నమ్ముతావో లేదో మా పక్కింటి వాళ్లబ్బాయి పెళ్లయిన రెండేళ్లకి భార్యని వదిలేశాడు ఎందుకో తెలుసా, కేవలం ఎలర్జీవల్ల చేతులకి రాష్ వచ్చిందట. అది తగ్గదని డాక్టర్లు చెప్పారట. అదే మగవాడికి కాన్సరొచ్చినా స్త్రీ వదిలేయగలదా?"

"సర్లే కాన్సరొచ్చిన భార్యల్ని భరిస్తున్న భర్తలు మాత్రం లేరా?"

"లేరనడం లేదు, చాలామంది వున్నారు. కానీ చిన్నచిన్న కారణాలకే భర్తల్ని ఒదిలేసే భార్యలేరు''

"భార్యని వదిలేయడమే కాదు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో చంపేసిన భర్తలకూడా కళ్లకద్దుకుని మరీ పిల్లనిచ్చి పెళ్లి చేసే తల్లిదండ్రులున్నారు మరి. అందుకే వాళ్ల ఆటలలా సాగుతున్నాయి. కానీ స్త్రీ ఏ ధైర్యంతో భర్తని వదిలేయగలదు? అందువల్ల పరిస్థితులలా వున్నాయి కాబట్టి తలొంచుకుంటున్నారు కానీ ఇందులో స్త్రీల గొప్పతనమేం లేదు'' అంది చిత్ర.

"ఇందులో ఎక్కువ తక్కువల ప్రసక్తే లేదు చిత్రా! నాకు స్త్రీలకి అన్నివిధాలా జరుగుతున్న అన్యాయాల గురించి బాధే తప్ప ఆడవాళ్లు దేవతలు, మగవాళ్లు రాక్షసులు అనే భావం ఏ కోశానా లేదు. జలజ పరిస్థితి అదే కదా! పెళ్లయి ఆర్నెల్లే అయినా అతన్ని వదిలి ఎందుకు ఒచ్చేయలేకపోయింది? మళ్లీ పెళ్లి కాకపోతే ఇక జీవితాంతం అమ్మానాన్నలకి లేదా అన్నా ఒదినలకి బరువుగా బతకవలసి వస్తుందేమోననే భయంతోనే కదా! పెళ్లయిన రెండో రోజే విడిపోయినా సరే స్త్రీకి పెళ్లవ్వడం చాలా కష్టం. కానీ మగవాడికి అల్లుళ్లూ, కోడళ్లూ వుండి, చావబోయే పొద్దొచ్చినా చేసుకుంటానంటే పిల్లనివ్వడానికి క్యూలో నిలబడ్తారు మనవాళ్లు. అందుకే స్త్రీకి ఒకసారి పెళ్లయ్యిందంటే భర్త ఎలాంటివాడయినా సరే సరిపెట్టేసుకుంటోంది. కానీ ఇదెంత దయనీయ పరిస్థితి?!"

"కానీ నువ్వెంతసేపూ స్త్రీస్త్రీ అంటావు. నువ్వు చలాన్ని చదివావని నాకు గుర్తుందిలే, మాటిమాటికే వాడి ఆ పదాన్ని ఇస్త్రీ చేయకు. ఇష్టంలేని భార్యలతో జీవితాలు వెళ్లదీస్తున్న భర్తలు కూడా అనేకమంది వున్నారు''

"నన్నేం ఎగతాళి చేస్తావులే? మగవాళ్ల తరఫున వకాల్తా పుచ్చుకోడానికి నువ్వు రెడీగా వున్నావుగా. ఇష్టంలేని భార్యల్ని భరిస్తున్న భర్తలున్నారు నిజమే. నిజానికి వాళ్లకా అవస

రంలేదు, అవకాశాలు వున్నా కానీ పిరికితనంతోనో, మరే కారణంతోనో సర్దుకుంటే అది వాళ్లు చేతులారా చేసుకునేదే తప్ప సమాజం తప్పుకాదు. కానీ అమ్మాయిలకి అసలా అవకాశాలే లేవు కదా!"

"అదీ పాయింటేగానీ లెక్చర్లిచ్చీ ఇచ్చీ అలసిపోయావు, కాస్త కాఫీ తీసుకొస్తానుండు'' అని లేచి కిందికెళ్లింది చిత్ర.

వర్ష ఆ మూడ్ నుండి బయటపడి కాస్త రిలాక్స్ అవడానికన్నట్లు కుండీల్లో వున్న మొక్కలని పరికిస్తూ పచార్లు చేయసాగింది.

రెండు నిమిషాల్లో చిత్ర కాఫీ కప్పులతోపాటు ఒక ప్లేట్లో మాంగో జెల్లీ ముక్కలు పెట్టుకుని వచ్చింది.

"అరే, ఎన్నాళ్లయిందో ఇది తిని'' అంటూ లొట్టలేసింది వర్ష.

"అదేంటి మరి ముందు కాఫీ తీసుకుంటావే?" అంది చిత్ర.

"కాఫీ చల్లబడితే తాగలేను, ముందు తాగేసి దాని భరతం పడతాను'' అంటూ కాఫీ సిప్ చేయసాగింది.

చిత్ర తను కూడా కాఫీ తాగుతూ "అవునూ, ఈశ్వరీదేవిగారిని మళ్లీ ఎప్పుడయినా కలిశావా?" అని అడిగింది.

"ఆవిడేమన్నా నా ఫ్రెండా మళ్లీ వెళ్లడానికి?"

"నాలుగుసార్లు వెళ్లి చూడు, నాకంటే క్లోజ్ ఫ్రెండంటావు. అలాంటి మేధావులతో పరిచయాలు పెంచుకోవడం మనకే మంచిది. బిందువింటే తంతుందేమోగానీ మనిద్దరం కూడా కేవలం డబ్బు కోసం ఉద్యోగాలు చేయడంలేదు. హైలీ రెస్పాన్సిబుల్ డ్యూటీస్‌లో వున్నాం. చిన్న తరగతులకే కావచ్చు, చదువు చెప్తున్నాను నేను. సిలబస్ పూర్తి చేయడమే కర్తవ్యమని ఎప్పుడూ అనుకోలేదు. నా స్టూడెంట్స్ చాలా కొద్దిమందే కావచ్చు, కానీ వీలయినంత మంచి సిటిజన్స్‌గా తయారు చేయాలనుకుంటాను. అలాగే నువ్వు పత్రికలో చేస్తున్నావు. అంటే దాన్ని అనేకమంది చదువుతారు. నువ్వు రాసే ఆర్టికల్స్ చదివి కొందరయినా తప్పక ప్రభావితులవుతారు. కాబట్టి ముందు మనం ఎదగాలి'' అంది చిత్ర.

"నాకంటే నీ ఉద్యోగం నయం. క్లాస్ రూంలోకి అడుగుపెట్టాక నీ ఇష్టమొచ్చినట్లు నువ్వు చెప్పొచ్చు. కానీ నేనంత లిబరల్‌గా వుండలేను. అక్షరం అక్షరంలో వ్యాపార ధోరణి"

"సర్లేవే, చిన్నచిన్న అడ్డంకులు ఎందులోనూ తప్పవు. అలా అంటే నాకూ అనిపిస్తుంది, సముద్రంలో నీటిబొట్టులా ఈ చిన్న స్కూల్లో ఈ కొద్దిమంది పిల్లలకే నేను టీచర్నా? ప్రపంచంలో వున్న పిల్లలందరికీ నేనే టీచర్నయితే ఎంచక్కా దోపిడీలు, దౌర్జన్యాలూ అంటే తెలీకుండా సిన్సియర్‌గా, సెన్సిటివ్‌గా పెరిగేట్లు చేద్దునుకదా అన్పిస్తుంది. ఐడియల్ డ్రీమ్స్ అన్నమాట" నవ్వింది చిత్ర.

వర్ష కూడా నవ్వి "అయితే మనిద్దరం కలిసి వెళ్దామా ఒక రోజు ఆవిడ దగ్గరికి?" అంది.

"అందుకు ముహూర్తం ఏమైనా చూడాలా, మంచిపని చేయడానికి ఆలశ్యం ఎందుకు, ఈ రోజే వెళ్దాం" అంది చిత్ర.

తర్వాత ఇద్దరూ మాంగోజెల్లీ తిని కిందికి దిగారు. చిత్ర డ్రెస్ మార్చుకుని రెడీ అయింది. ఇద్దరూ ఇంట్లో చెప్పి ఈశ్వరీదేవి ఇంటికి బయల్దేరారు.

గేటు తీసుకుని లోపలికి వెళ్లేసరికి ఇంటి తలుపు వేసివుంది. బెల్‌కొట్టి నిలబడ్డారిద్దరూ.

తలుపు తీసిన యువకుడు "ఎవరు కావాలి?" అన్నాడు.

చెప్పగానే వచ్చి కూర్చోమని, ఫాన్‌వేసి, లోనికెళ్లాడు. వెంటనే చిరునవ్వుతో వచ్చింది ఈశ్వరీదేవి.

"ఏం చిత్రా?! చాలా రోజులయిందే వచ్చి, బావున్నావా? నీ పక్కనెవరు?" అంది కళ్లజో




డు సరిచేసుకుంటూ.

వర్షని కాస్త చిత్ర కవర్ చేయడమేగాక, ఒకేసారి చూడడంవల్ల కూడా కావచ్చు ఆవిడ పోల్చుకోలేకపోయింది.

తర్వాత చిత్రే చనువుగా వర్ష గురించి వివరించి చెప్పింది.

"అయ్యో మర్చేపోయాను. అన్నట్లు నా మీద రాసిన ఆర్టికల్ చదివాను'' అంటూనవ్వింది. అంతకుమించి బాగుందీ లేదూ అంటూ ఏమీ కామెంట్ చేయలేదు.

ఆ తర్వాత చాలాసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ముఖ్యంగా చిత్రే అనేక విషయాల మీద ఆవిడ మాట్లాడేట్లు ప్రేరేపింప చేసింది.

"బాబూ, వివేక్! కాస్త టీ తెచ్చిపెట్టయ్యా'' అంటూ కేకేసింది మధ్యలో ఈశ్వరీదేవి.

వీళ్లకి తలుపు తీసిన యువకుడు కొద్దిసేపట్లో టీ కప్పులున్న ట్రేలో స్వీట్ బాక్స్ కూడా తెచ్చి టీపాయ్ మీద పెట్టి "ముందు స్వీట్స్ తీసుకోండి'' అన్నాడు.

ఆవిడ వీళ్లిద్దరినీ అతనికి పరిచయం చేసి "మా చెల్లెలి కొడుకు, వివేక్' అంటూ అతన్ని పరిచయం చేసింది. ముగ్గురూ తలలు పంకించి పలకరింపుగా నవ్వుకున్నారు.

మరి కొద్దిసేపు వుండి వచ్చేశారు వర్ష, చిత్ర.

"నిజంగా చాలా గొప్పవ్యక్తిలా వుందే ఆవిడ, ఇకనుండీ వెళ్తూండాలి'' అంది వర్ష దారిలో.

"వెళ్లుకానీ మరీ నన్ను మర్చిపోకు'' అంది చిత్ర.

"ఏమో ట్రై చేస్తాను'' నవ్వేసింది వర్ష.

★ ★ ★

తల్లి ఊరెళ్లినందువల్ల వర్ష రోజూకంటే పెందలాడే లేచింది. ముఖం కడుక్కొని కాఫీపెట్టి తండ్రికీ, తమ్ముడికీ ఇచ్చి తనూ తాగింది. టేప్ రికార్డర్‌లో కాసెట్ పెట్టి వంట ప్రయత్నాలు మొదలెట్టింది.

"బంబయిసె ఆయా మేరి దోస్త్ దోస్త్‌కో సలామ్ కరో…" అంటూ టేప్‌లో పాట వస్తూంటే తనూ కలిపి పాడుతూ ఉల్లిపాయలు పొట్టు తీస్తోంది.

"ఉదయాన్నే లేచి ఎవరయినా ఏ సుప్రభాతమో, శివస్తోత్రమో పెట్టుకుంటారు గానీ ఇవేం పాటలండీ బాబూ, ఈ కాలప్పిల్లలకి బొత్తిగా భయం భక్తీ లేకుండాపోయింది'' అన్నాడు హర్ష.

"నేనప్పుడే సన్యాసం పుచ్చుకోలేదు, నా ఇష్టమొచ్చిన పాటలు వింటాను, నీకు వినడం ఇష్టం లేకపోతే చెవుల్లో దూది పెట్టుకో. అన్నట్లు మర్చిపోయాను. మా ఆఫీసులో రజియా సుల్తానా అని కొత్తగా చేరింది. తనతో ఫ్రెండ్‌షిప్ చేయాలంటే అర్జంట్‌గా నేను హిందీ నేర్చుకోవాలి. కాబట్టి హిందీ పాటలు వింటాను, హిందీలోనే మాట్లాడ్తాను, అర్థమయిందా?" అంది వర్ష.

"హా, సమ్‌ఝీ మేమ్‌సాబ్!" అన్నాడు హర్ష వెక్కిరింతగా నొసలు పైకి ఎగరేసి, మూతి ముందుకి చాపి.

"పెహలే చావల్ సాఫ్ కరో!" అంది వర్ష

"ఛఛ… నేను బియ్యమేరడమేంటి, అవన్నీ ఆడవాళ్ల పనులు''

"బియ్యం మీద రాసిపెట్టి లేదు, ఆడవాళ్లే ఏరాలని. ప్చ… మళ్లీ తెలుగొస్తోంది. భోజన్‌తో కరతీ హెూ లేకిన్ రసోయీ నహీ కర్‌సక్‌తీ క్యా?"

"తినడం మా జన్మ హక్కు, వండడం మీ జన్మహక్కు''

"స్లోగన్ మార్చు బాబూ! వండి తినడం అందరి జన్మహక్కు… ఛఛ.. నీకు హిందీ వచ్చి చావదా, హిందీలో మాట్లాడమంటే''

"సర్లే, నేను స్నానానికెళ్తున్నా. ఆ పిచ్చిపాటలు పాడుకుంటూ వంట మాడ్చకు'' అంటూ వంటింట్లోంచి వెళ్లిపోతుంటే,

"మగవాళ్లిలా తయారవడానికి కారణం



అమ్మలే... ఏయ్ హర్షా! నువ్వుగానీ బియ్యం ఏరకపోతే నీకు ఇష్టంలేని కూరే వండుతాను తిక్కకుదుర్తుంది'' అంది వర్ష బెదిరిస్తున్నట్లు.

ఏమనుకున్నాడోగానీ హర్ష వెనుదిరిగి వచ్చి బియ్యం చేట చేతిలోకి తీసుకుని "అసలు మీ ఆడవాళ్లకి ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్. లేకపోతే ఇదేమంత పెద్ద పనని?" అన్నాడు.

"పెద్ద పని కాదు కాబట్టే నీకు చెప్పాను. కలిసి తినేప్పుడు కలిసి ఎందుకు చేసుకోకూడదు?"

"వద్దొద్దు, స్పీచులొద్దు. ఇంకేం చేయను కూరలు తరగనా?" అన్నాడు చేట అవతల పెట్టేస్తూ హర్ష.

"అదేంటి అప్పుడే అయిపోయిందా? మట్టి గడ్డలూ, రాళ్లూ సరిగ్గా చూశావా?" అంది వర్ష.

"నేనసలే పర్‌ఫెక్ట్ జంటిల్మన్ని. అసలా బియ్యం తెచ్చిందెవరనుకున్నావు, నేనే. రాళ్లూ, గీళ్లూ ఏమీ లేవు పెద్దగా'' అన్నాడు.

"సర్లే, అయితే ఫ్రిజ్‌లో బీరకాయలున్నాయి, తే''

"ఒకటే వుందక్కా'' అంటూ బీర్ బాటిల్ తెచ్చాడు.

"అతి తెలివంటే ఇదే. మేరీ సమయ్ ఖానీ మత్ కర్‌నా! జల్దీ జాకే... బీరకాయలు తెచ్చి కాట్‌నా'' అంది వర్ష.

"హారి భగవంతుడా, నీ హిందీ వింటే మీ రజియా సుల్తానా ఏ స్విమ్మింగ్‌పూల్‌లోనో దూకి ఆత్మహత్య చేసుకుంటుంది'' అంటూ హర్ష బీరకాయలు తెచ్చి, కత్తిపీట ముందు కూర్చున్నాడు.

"ముందు కడుగు... ఛఛ... ఈ మగవాళ్లకసలు శుభ్రమే లేదు''

"కడిగితే ప్రొటీన్స్ పోతాయి. నువ్వు కూరలకే అంటున్నావుగానీ మిలిట్రీవాళ్లు తినే అన్నంలో పురుగులు తేల్తుంటాయిట. అందుకేనేమో వాళ్లంత స్ట్రాంగ్‌గా వుంటారు'' అన్నాడు.

"అయితే నువ్వూపోయి జాయినవ్వు మిలట్రీలో'' అని తనే కాయలూ, కత్తిపీటా కడిగి ఇచ్చింది.

హర్ష బీరకాయలు ముక్కలు కోసే లోపు ఆమె ఉల్లిపాయలు చాకుతోకోసి, పోపు అన్నీ రెడీ చేసుకుంది.

స్టవ్ మీద పోపు వేగగానే, ఉల్లిపాయ ముక్కలు పోపులో వేసి రెండు గజాలు పరిగెత్తింది.

హర్ష పకపకా నవ్వుతుంటే "ఎందుకలా నవ్వుతావు, వంట గురించి నీకేం తెల్సని, అక్కడే నిలబడితే నూనె చిందుతుంది తెల్సా?" అంది.

"ఈ లెక్కన నువ్వుగానీ ఏ బూరెలో, గారెలో వండితే ఎన్నిసార్లు పరిగెత్తుతావు'' అని నవ్వుతూ హర్ష వెళ్లిపోయాడు.

ఆ తర్వాత కుకర్‌పెట్టి, పప్పుచారు చేసి, తను తినీ, అన్నీ టేబుల్ మీద పెట్టి తండ్రికీ, హర్షకీ చెప్పి ఆఫీసుకెళ్లింది వర్ష.

ఉదయం సీట్‌లో వెళ్లి కూర్చుంటే సాయంత్రం నాలుగున్నర వరకూ పని వత్తిడి వల్ల ఊపిరి సలపలేదు వర్షకి. లంచ్‌బ్రేక్‌లో కూడా భోజనం హడావిడిగా ముగించింది. టీ తెప్పించుకున్నా యాంత్రికంగా తాగేసినట్లు అన్పించింది. అందువల్ల కాస్త టీ తాగి, నాలుగు మాటలు మాట్లాడితే బడలిక తీరుతుందని సీట్లోంచి లేచింది.

'కాస్త కాంటిన్‌కెళ్లి టీ తాగొద్దామా?' అనడానికి హిందీలో ఏమనాలో గుణించుకుంటూ రజియా కోసం పక్క సెక్షన్‌కెళ్తే ఆ రోజు ఆమె రాలేదని తెలిసింది. కథల ఫైల్స్ చూసే కావేరి వర్షని ఆపేసి

"మీ దోస్త్ రాలేదుగానీ, కాఫీ ఎప్పుడయినా తాగచ్చు, ఓ కథ ఇస్తాను చదవండి, చాలా టచింగ్‌గా వుంది'' అంది.

చదివేమూడ్ లేదని చెప్పడానికి మొహమాటమేసి, మనసులో తిట్టుకుంటూ, పైకి నవ్వు




తూ "ఎరక్కపోయి వచ్చి ఇరుక్కున్నానే' అంటూ కథ చేతిలోకి తీసుకుంది.

అయితే కథ ఎంత అయిష్టంగా తీసు కుందో, అంత ఆసక్తిగా చదివింది. ఊహూ ఆమె చదవలేదు, కథే చదివించింది. సబ్జెక్ట్ పాతదయినా ప్రెజెంటేషన్ అంత గొప్పగా వుంది. కొడుకులూ, కోడళ్లూ నిర్లక్ష్యం చేసిన ఒక వృద్ధుడి కథ. కథ ముగించి కళ్లు తుడుచు కుంది. ఇంకా అక్కడే వుంటే పెద్దగా ఏడ్చేస్తా నేమో అన్పించిందామెకి.

ఇదేమీ గమనించని, మరో కథ చదవ డంలో లీనమయిన కావేరికి కథ బావుందని మాత్రం చెప్పి తన సెక్షన్‌కి తిరిగి వచ్చేసింది. ఈలోపు దాదాపు షెడ్యూల్ టైమ్ అయిపో యింది. కబోర్డ్‌లాక్ చేసుకుని ఇంటికి బయల్దే రింది.

తన చుట్టూ వందల వేలమంది నిరాశ్రయు లై నిట్టూర్పులు విడుస్తున్న వృద్ధులు నిలబడి విలపిస్తున్న భావన. ఆలోచించీ ఆలోచించి తలనొప్పిగా అన్పించింది. కణతలు నొక్కు కుంటూ హర్షకి చెప్పింది, కాస్త బయటికెళ్లి చిత్రకి ఫోను చేయమనీ, అమ్మ వూరెళ్లిందనీ వీలయితే తనకి తోడుగా పడుకోడానికి రమ్మనీ చెప్పమని.

వర్షకి మనసెప్పుడు కలవరంగా వున్నా చిత్రే గుర్తొస్తుంది. ఎలాంటి బాధయినా ఆమెతో పంచుకుంటే తగ్గినట్లుంటుంది.

ఫోను చేయించిన నలభై నిమిషాలకి గేటు చప్పుడయితే పరిగెత్తి వెళ్లి చూసింది వర్ష.

ఎదురుగా చిత్ర కన్పించేసరికి ప్రాణం లేచివచ్చినట్లయింది.

"ఇరవయ్యేళ్లు దాటాయి, పెళ్లి చేస్తే ఇద్దరు పిల్లలు కూడా పుట్టేవాళ్లు, నీకు భయమా, బుద్ధిలేదూ?" అంది వస్తూనేచిత్ర.

"వస్తూనే మొదలెట్టావా అష్టోత్తరం? బుద్ధి లేదు కాబట్టే నిన్ను పిల్చాను, వుంటే బిందూని పిలిచేదాన్ని''

"హమ్మయ్య, లేదని ఒప్పుకున్నావు సంతోషం"

"డబ్బులేనివాళ్లు దగ్గరికొస్తుంటే జేబులో డబ్బున్నా లేదని చెప్తారెందుకో తెలుసా, ఎక్కడ అడుగుతారోనని''

"అంటే నీ ఉద్దేశం... నాకేం అక్కర్లేదు నీ తిక్క బుద్ధి''

"అయ్యో చిత్రక్కా! ఈ రోజు నువ్వు బలయిపోతావు. వచ్చీరాని హిందీలో నిన్నూ వాయించేస్తుందిలే' అన్నాడు హర్ష వాళ్లు హాల్లోకి రాగానే.

"ఆలిండియన్ లాంగ్వేజెస్‌లో అదరగొట్టే ద్దామా దాన్నే'' అంది చిత్ర.

వర్ష వంటింట్లోకెళ్లి ఫ్లాస్కులోని టీ రెండు కప్పుల్లో పోసి తీసుకొచ్చింది.

టీ కప్పు అందుకుని "అంకుల్ ఇంకా రాలేదా?" అంది చిత్ర.

"అమ్మ నిన్న వెళ్లింది, నాన్న మధ్యాహ్నం వెళ్లారు, ఇద్దరూ కలిసి ఎల్లుండి వస్తామని చెప్పారు'' అంది వర్ష.

కొంతసేపాగి "చిత్రా! ఈరోజు నా మనసేం బాగోలేదు'' అంది వర్ష మళ్లీ.

"..."

"నీకే చెప్తోంది, ఆ టీవీ ఏం చూస్తావు?" అని "ఏయ్ హర్షా! ఆ టీవీ ఆఫ్ చేసి, నువ్వెళ్లి గదిలో చదువుకోరాదూ'' అంది.

"ఏదయినా బాగోకపోతే డాక్టర్ దగ్గరికె ళ్లాలి'' అంది చిత్ర.

"నువ్విలాగే వేషాలేశావంటే రాత్రికి నీకు తిండిపెట్టను జాగ్రత్త, అయ్యోపాపం ఏం కష్టమొచ్చిందోననే ఆతృతే లేదు''

"ఇంట్రడక్షన్లాపేసి అసలు కథేంటో చెప్పు''

వర్ష తాను చదివిన కథ, అది తనని కదిలించిన తీరూ క్లుప్తంగా చెప్పింది. అంతా విన్న చిత్ర కూడా బాధగా నిట్టూర్చింది.

"ఎన్నో త్యాగాలు చేసి, పెంచి పెద్ద చేసిన

అమ్మానాన్నలని ఇంత నిర్లక్ష్యం ఎలా చేయగలుగుతున్నారు? కన్న తల్లిదండ్రుల కనీస అవసరాలు చూడడం కూడా చేతకాని వాళ్లు మనుషులు కాదు రాక్షసులు''

"అని నువ్వూ నేనూ అంటే సరిపోతుందా, వాళ్లనుకోవద్దూ''

"వాళ్లకో అంతరాత్మ అంటూ వుండి ఏడిస్తే కదా వాళ్లేంటో వాళ్లకి తెలియడానికి. నాకు గానీ అలాంటి కిరాతకులు పుడితే స్వయంగా నా చేతులతో నేనే చంపేస్తా''

"నీలో ఇంత ఆవేశం వుందంటే సెంటిమెంట్ లేదంటే ఖచ్చితంగా క్రితం జన్మలో సెంట్‌పర్సెంట్ అమెరికన్ అయ్యుంటావు''

"ప్లీజ్‌చిత్రా! నేను సీరియస్‌గా మాట్లాడ్తున్నాను. నా వీక్‌నెసేంటో తెలీదుగానీ మీ అందరిలా తామరాకు మీద నీటిబొట్టులా పట్టీపట్టనట్లు వుండలేను. వృద్ధాప్యంలో బాధ పడ్తున్న వాళ్ల గురించి ఇంతకుముందు తెలీదని కాదు. చాలాసార్లు విన్నాను కొందర్ని ప్రత్యక్షంగా చూశాను కూడా. కానీ ఈ వేళ్టి కథ మరీ దయనీయంగావుంది. అక్కడే ఏడ్చాను తెల్సా, నన్ను నేను కంట్రోల్ చేసుకోలేకపోయాను''

"కథలు చదివే ఏడిస్తే ఎలా, జీవితాలు కథలకంటే భయంకరంగా వుంటాయి. అత్తమామలతో ఊడిగం చేయించుకుంటూ కూడా తిండి పెట్టడానికి ఏడుస్తున్న ఘనులున్నారు. ఇంట్లో పెరిగే పెంపుడు కుక్కకిచ్చేపాటి విలువ పెంచి ప్రయోజకుల్ని చేసిన తల్లి దండ్రులకివ్వని ఉత్తములున్నారు. అంతెందుకు తల్లిదండ్రులని తన్ని తగలేస్తున్న మహానీయులూ వున్నారు.."

"ఆ రాక్షసులందర్నీ కాల్చేసి, ఆ రక్తంతో బాధపడ్తున్న పెద్దవాళ్ల కాళ్లు కడగాలన్పిస్తోంది''

"మళ్లీ అదో శిక్షా వాళ్లకి, రక్తం నీచుకంపు కొడ్తుంది తెల్సా? చంపితే చంపేయ్‌గానీ ఏ అరేబియా సముద్రంలోకో విసిరేయి''

రెండు నిమిషాలు మౌనంగా వుండి "నాకేదో చేయాలన్పిస్తోంది, నేనేం చేయలేనా?" అంది వర్ష.

"ఒక పని చేయి... వాళ్లెవరిలా కాకుండా రేపు పెద్దయ్యాక ఆంటీనీ, అంకుల్నీ బాగా చూసుకో. అలాగే మీ అత్తామామల్ని''

"ఇంతేనా, మనవాళ్లని మనం చూసుకుంటే చాలా? ఇదేం లోకకల్యాణమని నేనను కోవడంలేదు''

"నేను మాత్రం అన్నానా అలా? ఎవరి వాళ్లని వాళ్లు చూసుకుంటే చాలు అప్పుడెవరూ అనాథ వృద్ధులు కారు. ఇక పిల్లల్లేని ఏ కొద్దిమందో సంగతేం పెద్ద లెక్కలోకి రాదు. ఎందుకంటే వాళ్లెటూ వాళ్ల జాగ్రత్తలో వాళ్లుంటారు''

"నిజానికి పిల్లల్లేని వాళ్లే అదృష్టవంతులు''

"నిజమే పుట్టిందగ్గర్నుంచీ పనికిమాలిన మమకారం పేరుతో అర్థంలేని త్యాగాలతో వాళ్ల జీవితాలు ధారపోసి పెంచుతారు, భవిష్యత్తులో ఉద్ధరిస్తారేమోనని''

"తీరా పెరిగాక ఒళ్లు కొవ్వెక్కి ఎదురు వాళ్లనే అడుగుతున్నారు ఎందుకు కన్నారు, కన్నాక పెంచకేం చేస్తారు? అని''

"ఇంకో తమాషా తెలుసా, ఒక కోడలు అత్తామామల్ని కాల్చుకు తింటుంటుంది. ఆ వాతావరణంలో అవన్నీ చూస్తూ పెరిగిన తన పిల్లలు మాత్రం తనలా తయారవుతారని ఆలోచించదు. తాను ప్రపంచంలోనే ప్రత్యేకమయిన తల్లిననీ తను చూసుకుంటున్నంత గొప్పగా ఇంకే తల్లీ ఏ పిల్లల్ని చూసుకోవడం లేదనీ అనుకుంటుంది. ఇలాంటి చెత్త మొహాలు అత్తమామల్ని హింసించే ఉదంతాలు విన్నా, చూసినా, చదివినా అవి తమకు వర్తించవనుకుంటారు. అసలవేవీ వాళ్ల మనసు వరకూ చేరవనుకుంటా''

"అసలా మనసనేది వుంటే అంత నికృష్టంగా ప్రవర్తించరు''





"మనసుంటుందిగానీ అది ఇనపది కావడాన ఇతర్ల కష్టాలకి, కన్నీళ్ళకి కరిగిపోదు. స్వయంగా కణకణ నిప్పుల్లో కాలినప్పుడే వాటిలో మార్పొచ్చేది'' అంటూ నవ్వింది చిత్ర.

"చిత్రా! అసలీ పెద్దవాళ్ళు పిల్లలకోసం ఎందుకు మహా ఆరాటపడిపోతారు?"

"ఇది మరీ బావుంది. మనిషి కెప్పుడూ ఏదో ఒక ఆరాటముండాలి. ముందు పిల్లలు పుట్టాలని తపన, తర్వాత వాళ్ళని సక్రమంగా పెంచాలని, వాళ్ళకి పెళ్ళిళ్ళు చేయాలని, మళ్ళీ వాళ్ళకి పిల్లలు అంటే మనవళ్ళు, మనవరాళ్ళూ పుట్టాలని... ఇలా అన్ని దశల్లో మనిషి ఏదో ఒక ఆరాటంతో ఎంగేజ్ అవుతాడు. లేకపోతే తోచదు. అంతెందుకు, ఒక భార్యాభర్తలకి పిల్లలు పుట్టలేదనుకో... కొన్నాళ్ళు బాగానే ఉంటుంది. ఇక ఆ తర్వాత ఏ సమస్యా లేక కేవలం తిని, పడుకోవడంవల్ల అసంతృప్తి బయల్దేరుతుంది''

"అంటే మనిషికి సంతోషంగా వుండడంలో తృప్తి లేదా? తనే సమస్యలు కొని తెచ్చుకుంటాడా?"

"అదే సృష్టి విచిత్రం. పైగా తల్లితండ్రులు పిల్లల్ని పెంచేప్పుడు వాళ్ళు భవిష్యత్తులో తమని ఉద్ధరిస్తారా లేదా అని ఆలోచించరు. కేవలం నిస్వార్థంగా వాళ్ళు ప్రయోజకులు కావాలని మాత్రమే ఆశిస్తారు''

"అదే వెర్రితనం. అలా ఆలోచించడం నాకేం గొప్ప లక్షణంగా కన్పించడంలేదు. మనం ఒక మొక్క నాటితేనే అది పుష్పించాలనో, ఫలించాలనో ఆశిస్తాం. ఇంకా వాటికి కాసిని నీళ్ళు పోయడం తప్పించి వండి వార్చనక్కర్లా, డబ్బు ఖర్చు పెట్టనక్కర్లా''

"కానీ అవి కేవలం మొక్కలు. పిల్లలు తమ రక్తం పంచుకు పుట్టినవాళ్ళు, రెంటికీ పోలికేముంది?"

"మనిషికి మెదడనేది ఒకటుంది. కాబట్టి వాటికంటే గొప్పవాడేగా, కృతజ్ఞత ఉండొద్దా?"

"కృతజ్ఞత అనే పదానికి ప్రపంచంలో చాలా మందికి అర్థం తెలీదు. వేదకాలంలో వర్షం కురిపిస్తున్నందుకు వరుణదేవుడికి, వేడిమిని స్తున్నందుకు భాస్కరుడికి ఇలా ప్రకృతికే గాక ఆఖరికి ఇల్లు ఊడ్చిపెడ్తుందని చీపురు కట్టక్కూడా కృతజ్ఞతలు చెప్పేవారట. ఒకరకంగా పూజించడం అనేది ఇలాగే మొదలైంది. కానీ రానురాను సహజంగా జరిగేవాటికి, జరుగుతున్నవాటికి కృతజ్ఞతలు చెప్పుకోవడం వృథాప్రయాస అన్పించి దేవుడిముందు తమ కోరికల్ని డిమాండ్ చేస్తున్నారు. కాబట్టి కృతజ్ఞత గురించి ఆలోచించడం కూడా దండగ"

"మరి అలాంటప్పుడు ఈ తల్లిదండ్రులు అంత చాదస్తంగా ఎందుకుండాలి. చాకిరీ చేయడం గాక లక్షలు ఖర్చుపెట్టి చదివించడం..."

"అందరూ ఎక్కడ చదివిస్తున్నార్లే, మన అక్షరాస్యత ఎంత అధ్వాన్నంగా వుందో తెలుసుకదా!"

"చదివిస్తున్నవాళ్ళు కూడా వున్నారుగా. ఇవాళ నేను చదివిన కథలో అదే జరిగింది తెలుసా! కూతుళ్ళకి పెళ్ళిచేసి పంపిస్తారు, కొడుకుల్ని బాగా చదివిస్తారు, ఇద్దరూ ఉద్యోగ రీత్యా ఊళ్ళు తిరుగుతుంటే వాళ్ళతో తామెందుకని తమ వంట తామే చేసుకుంటూ వృద్ధాప్యంలో సొంతవూరులో వుండిపోతారు. చివరికి భార్య చచ్చిపోయి తప్పనిసరి పరిస్థితులలో కొడుకుల దగ్గరకెళ్తే అక్కడ ఎదురయిన ఘనస్వాగతం..."

చిత్ర బదులు చెప్పలేదు, ఆలోచిస్తూండిపోయింది.

కొద్దిసేపాగి, 'అయితే రేపట్నుండీ హర్ష కాలేజీకెళ్ళడంలేదా?" అంది చిత్ర నవ్వుతూ.

"అదేం, అలా అడుగుతున్నావు?" అర్థంకాలేదు వర్షకి.

"మరి రేపు హర్షమాత్రం చూస్తాడని నమ్మకమేంటి, చదువు..."

"వాడు మరీ అలాంటివాడు కాదులేవే. అయినా నేను వాడికా ఛాన్స్ ఇవ్వను. అమ్మా, నాన్నలని నేను చూసుకోగలను, వాళ్ళు నాకెప్పటికీ బరువుకారు'' అంది వర్ష.

"యూ ఆర్ ఎ ఫీమేల్ పాపా, నీకా ఫ్రీడం ఎక్కడిది? నిన్ను చేసుకునేవాడు నిన్నొకతినే రానిస్తాడుగానీ అమ్మానాన్నతోసహా వెళ్తానంటే ఒప్పుకోడు. లోకంతీరు ఇంకా తెలీకపోతే ఎలా?"

"ఏడ్చాడులే, ఒకళ్ళు రానిచ్చేదేంటి మా అమ్మానాన్నలని. అసలలాంటి నేరో మైండెడ్ వాళ్ళని నేనే నా జీవితంలోకి రానివ్వను''

"ఈ కబుర్లన్నీ పెళ్ళయ్యేంతవరకే. ఆ తర్వాత వాళ్ళేదంటే దానికి దాసోహమనాలి, ఎందర్ని చూట్టంలేదు?"

"చూడబోతే నువ్వలాగే తయారయ్యేట్టున్నావు. 'నీ చరణదాసీని స్వామీ! నీ కాళ్ళదగ్గర కాసింత చోటిప్పిస్తే నా జన్మ ధన్యమౌతుంది' అంటావు కాబోలు, గొంతు మార్చి అభినయించింది వర్ష.

"అసలు కాళ్ళదగ్గర చోటు అడగడంలో పరమార్థం నీకు తెలిసినట్టు లేదు, తిక్క వేషాలేస్తే ఆ కాలు పట్టుకులాగి పడేయడానికే' అంటూ నవ్వింది చిత్ర.

"మన పూర్వీకుల చచ్చు భావాల్ని ఇలా సమర్థించుకోవాల్సిందేలే. లోకం ఎలా ఏడిస్తే నాకెందుగ్గానీ నామటుకు నేను పెళ్ళికోసం ఎదురుతెన్నులు చూట్టంలేదు. అలా అని పెళ్ళి చేసుకోనని కూడా శపథాలు చేయడంలేదు. అన్నివిధాలా నన్నర్థం చేసుకునేవాడు అంటూ ఒకడు తారసపడితే చేసుకుంటాను, లేదంటే ఇలాగే వుండిపోతాను, ఏమీ నష్టంలేదు'' అంది వర్ష ఆవేశధోరణిలోనే.

"అర్థం చేసుకోడానిక్కూడా లిమిటేషన్స్ వుంటాయికదా! లోకంలో తల్లిదండ్రుల బాధ్యత మగపిల్లలదేగానీ ఆడపిల్లలది కాదుగా''

"అలా అని రూలేం లేదు. సామాన్యంగా ఆడపిల్లలు ఇంకో ఇంటికి వెళ్తున్నారు కాబట్టి ఇంట్లోనే వుండిపోయే మగపిల్లలతో తల్లి దండ్రులు కలిసుంటున్నారు. అంతమాత్రాన ఆడపిల్లలు మాత్రం వాళ్ళకి పుట్టలేదా, వాళ్ళతో చాకిరీ చేయించుకోలేదా, వాళ్ళకిమాత్రం బాధ్యత వుండదా? ప్రతి జనరలైజేషన్‌కీ కొన్ని ఎక్సెప్షన్స్ వుంటాయి. నన్నడిగితే తల్లిదండ్రుల్ని చూసుకోవడం ఒక అదృష్టం తప్ప అదసలు బాధ్యత కూడా కాదు. బరువు కానేకాదు'' చాలా ఎమోషనల్‌గా అంది వర్ష.

"ఆలోచన్లు ఆరోగ్యంగానే వున్నాయి కానీ అవెంతవరకూ ఆచరణీయమో వేచిచూడాలి మరి''

"నీ కాంప్లిమెంట్‌కోసం నేనేం మాట్లాడ్డంలేదు. చేసి చూపిస్తాను. ఒకవేళ ఇంత సామాన్యమయిన భావాలని కూడా అర్థంచేసుకునేవాళ్ళు గనక నాకు తారసపడకపోతే..."

"ముందే చెప్పావుగా.... పెళ్ళిచేసుకోనని'' మధ్యలోనే అందుకుని అంది చిత్ర.

"కొంతవరకూ సమాజ ఆలోచనల్లోనే కాలుష్యం వుంది. చాలామంది ఆడపిల్లల్ని గమనిస్తుంటాను. వాళ్ళు పెళ్ళికోసం భర్తకోసమే బతుకుతున్నట్లు కన్పిస్తుంది. వాళ్ళ ధోరణి చూస్తే అసహ్యమేస్తుంది. ఇంకొందరు నారీమణులు చెప్తుంటారు, పెళ్ళికాకముందు ఉద్యోగం చేసినా ఆ జీతం ఇంట్లో ఖర్చుపెట్టకూడదు, బాంక్‌లో పదిలంగా దాచుకుని, అత్తారింటికి పోయేప్పుడు మూట కట్టుకువెళ్ళాలని. అలాగే కొందరు పెళ్ళయిన పతివ్రతలు భర్తలకంటే అత్తమామలకంటే తామే ముందుండి పుట్టింటివాళ్ళు ఏదో పెట్టలేదనీ, ఏమో చేయలేదనీ సాధిస్తుంటారు. ఛఛ... ఇలాంటి నాటుభావాలు నాటేది సమాజం కాదూ చెప్పు?!"

"మరి సమాజం నాకూ నీకూ నేర్పలేదే అలాంటి భావాలు?"

"ఎందుకంటే వాళ్ళలా మనం గానుగెద్దులం కాము. మనం ఏది చూసినా, చదివినా మన సొంత బుర్రలతో ఆలోచించి చూస్తాం




కాబట్టి''

"అంతేకాదు వర్షా! మనమిలా కాస్తయినా ఉన్నతంగా ఆలోచించడానిక్కారణం ఒకటి మన ఫామిలీ బాక్‌గ్రౌండ్, రెండు మన గురువు లు, మూడు మనం చదివిన మంచి పుస్తకాలు, కాదా చెప్పు?" అంది చిత్ర.

తల పంకించి, "అవును, నిజమే'' అంది వర్ష.

"ఇంక ఆకలేస్తోంది, అన్నం పెడతావా లేక భవతీ భిక్షాందేహీ! అంటూ రోడ్లమీద పడ నా?" అంది చిత్ర.

"లాభంలేదు ఈరోజుల్లో ఎవరికీ సంస్కృతం రాదు. అడుక్కోడానిక్కూడా ఇంగ్లీషే అర్థమయిన భాష" అని. "హర్షా! కాస్త పళ్ళేలు కడిగి, నీళ్ళుపెట్టవా, చిత్ర తిండి తిని ఎన్నాళ్ళయిందో ఏమో పాపం శోషొచ్చి పడి పోయింది'' అంటూ మరో కేకపెట్టింది వర్ష.

"చూడబోతే హర్షతో పళ్ళేలు కడిగించ డంకోసం నన్ను నెత్తిన బాది మరీ పడేసేట్లు న్నావు'' అంది చిత్ర స్వరం తగ్గించి.

"ష్... మాట్లాడకు. మగపిల్లలచేత కూడా వంటింటి పనులు చేయించినరోజే స్త్రీ జాతికి సుఖం, సౌఖ్యం... అర్థమయిందా?"

"దానికి ఇలాంటి టెక్నిక్‌లెందుకు, ధై ర్యంగా చెప్పలేవా?"

"చెప్పలేక కాదు. ఇన్నాళ్ళూ లార్డులా కూర్చున్నవాళ్ళు ఒక్కసారిగా అలవాటు చేసు కోలేరు. అందుకని నెమ్మదిగా దారిలోకి తే వాలి''

"రేపు మీ ఆయన్తో కూడా వంట చేయిస్తా వా?"

"నేను చేయించేదేమిటి మధ్య అంటే మళ్ళీ అతనికి నేను మొగుణ్ణి అయిన ట్లుంటుంది. ఈమధ్యేదో ఒక ఛండాలపు సిని మా ఒచ్చిందిలే. అందులో స్త్రీలు తాగి తందనా లాడుతూ వుంటే భర్తలు ఏడ్చుకుంటూ తుడు చుకుంటూ, వండి వార్చి భార్యల కాళ్ళుపట్టి, నానా సేవ చేయడం అయినా భార్యలు కళ్ళెర్రచేయడం, భర్తలు ఒణికిపోవడం చూస్తే అసహ్యమేసిందనుకో''

"చూళ్ళేదుగానీ నేనూ విన్నాను ఆ సినిమా గురించి. బ్రహ్మాండమైన హాస్యచిత్రమన్నారే చూసినవాళ్ళు''

"అలా ఏడ్చిందన్నమాట ఆంధ్రప్రేక్షకుల అభిరుచి. మగవాళ్ళు వంటచేస్తే అదో జోక్, ఆడవాళ్ళు లిక్కర్ తాగితే అదో జోక్''

"అసలు జోకంటే ఏంటి? దానికి నిర్వ చనం చెప్పడం చాలాకష్టం. మొత్తానికి దాని పర్యవసానం మాత్రం నవ్వు తెప్పించడం అవునా కాదా?"

"నిజమేకానీ అందులో వెకిలితనం, మొర టుతనం వుండకూడదు''

"నువ్వు చెప్పిందాన్నిబట్టి అందులో వెకిలి తనం లేదే'' అంది చిత్ర.

"కావాల్సినంత వల్గారిటీ వుందిగానీ దాని ప్రసక్తికూడా తేవడంలేదిప్పుడు. వంట చేయ డంలో కష్టనిష్ఠూరాలున్నాయి. నిజమేకానీ ఆడ వాళ్ళు సలక్షణంగా వంటలు చేయొచ్చనీ అదే మగవాళ్ళు చేస్తేమాత్రం హాస్యాస్పదమనీ చూపించడం పెద్ద తప్పు, అది చూసి ఆనందించడం ఆడియన్స్ తప్పు'' అంది వర్ష.

"అది ప్రస్తుతానికి అసహజంగా వుంది కాబట్టి హాస్యమే అనుకోవాలి. ఒక పాము నిన్ను కరిచిందనుకో అది సహజం. అందులో నవ్వులేదు. కానీ పాముని నువ్వు కరిచావను కో..." నవ్వింది చిత్ర.

"పాము... సంగతి తర్వాత. ముందు నిన్ను కరవాలన్పిస్తోంది. అంటే వాళ్ళు వంట చేయడం నీక్కూడా..."

'అబ్బబ్బా... నా సంగతికాదు, ఆ సినిమా తీసిన, చూసినవాళ్ళ గురించి. లెట్‌దెమ్ గోటు హెల్, ముందు నాకు తిండి పెట్టు, వాగి వాగి తిన్నదే కాదు, పేగులు కూడా అరిగిపో యాయి. రేపు ఇలా చిక్కిపోయావేం చిత్రా అని నా బోయ్‌ఫ్రెండు అడిగితే నేనేం చెప్ప



ను?"

"బోయ్‌ఫ్రెండా, వాడెవడు?"

"ష్... వాడూ వీడూ అనకు, నీకంటే పెద్దాయన, గౌరవించాలి''

"గౌరవించాలా, గోంగూరా? మరీ ఎడ్ల బండి టైపనుకున్నాను, ఏరోప్లేన్‌వయ్యావే అమాంతం. ఇంతకీ పేరేంటి, అసలు కథెంత వరకూ వచ్చింది?"

"ఎవరో కాదు జార్జ్‌బుష్''

"ఆహాహా... ఏం సెలవిచ్చారండీ?! పంపు తిప్పి పాలకోసం చూసే మొహంలావుంది. జార్జ్‌బుష్ నీ బోయ్‌ఫ్రెండా తల్లీ, అంతేనా లేక ఇద్దరూ కలిసి అష్టాచెమ్మా, చెమ్మచెక్కా కూడా ఆడుకున్నారా?" ఎగతాళిగా అడిగింది వర్ష.

"అసలు నీ ఉద్దేశమేంటి? పనికిమాలిన చచ్చుపుచ్చు ఆటలాడ్తేనే ఫ్రెండ్సా? ఏడు మాటలు మాట్లాడితే స్నేహం కుదిరినట్లే అంటారు తెలుసా?"

"ఓహో! నాకు తెలీదులే ఆ సంగతి. ఇంతకీ తమరెప్పుడు మాట్లాడుకున్నారు?"

"రాత్రి కూడా ఫోను చేశాడు... ప్చ్... కానీ అది కలైపోయింది. అయితేనేం, మాట్లాడుకోవడమంటే ఇద్దరూ మాట్లాడాలని రూలేం లేదు. ఒకరు మాట్లాడి రెండోవాళ్ళు విన్నా మాట్లాడుకున్నట్లే. బుష్ మాట్లాడ్డం టీవీలో ఎన్నోసార్లు విన్నాను, పేపర్లో ఇంకెన్నోసార్లు చదివాను. ఇంకా నీకేమయినా సందేహమా ఆయన నా ఫ్రెండ్ కాదని?"

"సంతోషించాంగానీ, ఫ్రెండంటే పర్లేదు గానీ మరీ డ్రీమ్స్ వరకూ పోకు''

"ఏ, మేమిద్దరం డ్యూయెట్స్ పాడుకుంటే నీ సొమ్మేంపోతుంది?"

"ఏయ్ హర్షా!" పెద్దగా పిలిచింది వర్ష.

హర్ష వచ్చి నిలబడి ఏమిటన్నట్లు చూశాడు.

"ఇందాక పిల్చాను, విన్పించుకోలేదు. అసలు టెక్స్ట్‌బుక్స్ చదువుతున్నావా లేక క్రైం థ్రిల్లర్లు చదువుతున్నావా?"

"నీకెప్పుడూ అనుమానమే. ఇందాక విన్నా నుగానీ హర్షద్‌మెహతా గురించి మాట్లాడుకుంటున్నారనుకున్నాను''

"లెస్స ఊహించితివి సోదరా! ముందు కాస్త పళ్ళేలు కడుగు. త్వరగా పడుకుందాం. మళ్ళీ పొద్దున్నే లేచి వంట చేయాలి'' అంది వర్ష.

హర్ష ఏ ఖయాల్‌లో వున్నాడోగాని ఎదురు చెప్పకుండా మూడు ప్లేట్లు, గ్లాసులు కడిగి టేబుల్‌మీద పెట్టి ఫ్రిజ్‌లోంచి వాటర్ కంటెయ్‌నర్ తీసి నీళ్ళు కూడా వంపాడు.

వర్ష, చిత్ర కూడా డైనింగ్ హాల్లోకొచ్చారు. వర్ష డిషెస్ అన్నీ తెచ్చి ముగ్గురికీ వడ్డించింది.

"పర్లేదే వంట బాగానే చేశావు. జార్జ్‌బుష్ వస్తే మినర్వాకి తీసికెళ్దామా, పాలసైట్స్‌కి తీసికెళ్దామా అని ఇన్నాళ్ళు పెద్ద డైలమాలో వున్నాను. వాటికంటే నువ్వే బెటరన్పిస్తున్నావు. ఇంకా టైముందిలే, మెనూ అప్పుడు చెప్తాను ఈలోపు ప్రాక్టీస్ మర్చిపోకు''

"మీరేం చెప్పనవసరంలేదు మేడమ్, ఎవరికి ఏం కావాలో మాకు బాగా తెలుసు. నువ్వు బుష్‌ని తేవాలిగానీ ఇసకవేపుడు, ఫినాయిల్ పులుసులాంటి వండ్రఫుల్ డిషెస్ చేయనూ?" అంది.

"ఛీ! దుర్మార్గురాలా! ఈ క్షణంనుండీ నీకొచ్చిన వంటలన్నీ నువ్వు మర్చిపోవుగాక. నీ చేత్తో తీపి చేసినా చేదగుగాక'' అంది చిత్ర.

"మీ శాపము నాకు వరమగుచున్నది గమనింపుడు స్వామినీ!"

"ఏమంటివేమంటివి? మాకు తలతిక్క అనుకొంటివా? శాపము వరమగునని ప్రేలాపించుదువేమి?"

"మీ శాపంవల్ల నేను చేసుకునేవాడు నా చేత వంట చేయనీక ఎంత చక్కగా అతడే వండిపెట్టాడు''

"అసలు మీరేం మాట్లాడ్తున్నారో నాకేం అర్థంకావడంలేదు'' అన్నాడు హర్ష.




"అదేంటి హర్షా! నీకు తెలుగు సరిగా రాదా పాపం?" అంది చిత్ర.

హర్ష చిత్రనేమీ అనలేక బుంగమూతి పెట్టి తినసాగాడు.

"ఏంటి కోపమొచ్చిందా? ఇలా చిన్నచిన్న విషయాలకే అలిగేవాళ్ళు నాకసలు నచ్చరు. ఇంకోసారి మీ ఇంటికి రానబ్బాయి'' అంది చిత్ర.

"లేదులేదు నాకేం కోపంలేదు''

"మరయితే రేపు నాకు మసాలా టీ చేసిస్తావా? అది నీకు మాత్రమే వస్తుందని మీ అక్క చెప్తుంటుంది''

"ఓ... తప్పకుండా. అయినా అందులో విచిత్రమేం లేదక్కా..."

"ఒద్దురా హర్షా చెప్పకు. తనూ నేర్చేసుకుంటుంది. అప్పుడు మన స్పెషాలిటీ ఏముంటుంది?" అంది వర్ష మధ్యలో అందుకుని.

అలా మాట్లాడుకుంటూ భోజనాలు చేశారు.

వర్ష దుప్పట్లు సరిచేసింది. హర్ష వెళ్ళి హాల్లో పడుకున్నాడు.

చిత్ర కాళ్ళు కడుక్కొచ్చి పడుకుని, "పాటలు విందామా, మాట్లాడుకుందామా?" అంది.

"ఒంటరిగా ఉన్నప్పుడు వింటనే పాటలు పూర్తిగా ఎంజాయ్ చేయగలం. నిద్రొచ్చేవరకూ మాట్లాడుకుందాం" అంది వర్ష.

"సరే... మాట్లాడు. నువ్వు మరీ సోది టాపిక్ తెస్తేమాత్రం నిద్ర నటించేస్తానమ్మాయి'' అంది చిత్ర.

"ఇంతకీ పెద్దవాళ్ళ సమస్యకి పరిష్కారం ఏమీలేదంటావా చిత్రా! బతికుంటే ప్రతి మనిషీ ఆ దశ చూస్తాడుకదా, అయినా ఇంత నిర్దాక్షిణ్యంగా ఎలా వుండగలుగుతున్నారు?"

"ఏడ్చినట్లుంది నువ్వు చెప్పేది. వృద్ధాప్యం సరే క్రమక్రమంగా వస్తుంది. కానీ అంతకంటే భయంకరమయిన చావు ఏ క్షణంలోనయినా రావచ్చు. పుట్టింది మొదలు ఎప్పుడయినా పోవచ్చు. బ్రతికినా కొన్నేళ్ళు మాత్రమే. ఆ తర్వాతయినా చావు తప్పదు. అది తెలిసి కూడా ఆస్తులెందుకు కూడబెడ్తున్నారు; బందోబస్తు ఇళ్ళెందుకు కడ్తున్నారు? అంతెందుకు ఇంత ఆదర్శాలు వల్లించే నువ్వు కూడా రేపు ఈ మాటమీదే వుంటావని నమ్మకం లేదు. అంటే వాళ్ళని నేనే చూస్తాను అంటున్నావు. బహుశా చూస్తావుకూడా. అందుకు హర్ష సరేనని ఊరుకున్నాడనుకో, నీకు తెలీకుండానే వాడిమీద నీకు కోపం బయల్దేరుతుంది. అలా అలా చిలికిచిలికి గాలివానలవుతాయి. పెద్దపెద్ద సమస్యలు కూడా మొదట్లో నలుసంతే వుంటాయి'' అంది చిత్ర.

"ఇది మరీ బావుంది. నాగురించి నాకు తెల్సినదానికంటే నీకే ఎక్కువ తెలిసినట్లు మాట్లాడుతున్నావే. నేను దేన్ని అసహ్యించుకుంటున్నానో అది నేను చేస్తానా?"

"పర్టిక్యులర్‌గా నువ్వని కాదే నా ఉద్దేశ్యం. సామాన్యంగా ఒకళ్ళకంటే ఎక్కువ పిల్లలున్నపుడు వంతులు మొదలవుతాయి. ఎవరికి వాళ్ళే నేనే ఎందుకు చూడాలని బాధపడిపోతారు. అక్కడే పెద్దవాళ్ళ బాధ మొదలవుతుంది''

"సిగ్గులేకపోతే సరి... ఎవరికి వాళ్ళకే అయ్యో అమ్మానాన్నలని వాడు చూస్తాడేమో, ఆ అదృష్టం నాకే దక్కాలి అని ఎదురుచూడాలి తప్ప నేను చూడకపోతే బావుండును, వాళ్ళొచ్చి నా నెత్తిన పడకపోతే బావుండును అనుకుంటారా? అలాంటి మనుషుల్ని ఎందర్ని స్వయంగా చూసినా కూడా అసలు వాళ్ళలా ఎలా ఆలోచించగలుగుతారన్నదిమాత్రం నాకర్థంకాదు''

"అంతేనా, శవాల మీద నడిచే రాక్షసులు కూడా వున్నారు''

"ఏమో చిత్రా! నాకొకటి అనిపిస్తోంది. మనం మదర్ థెరిస్సాలం కాకపోవచ్చు. కానీ

లోకంలో వున్న సమస్యల్ని చూస్తూ కూడా మనకేం పట్టనట్లు, అందులో మన ప్రసక్తి లేనంతమాత్రాన మన బాధ్యతేం లేనట్లు వూరు కుండిపోవడం మాత్రం న్యాయంకాదని పిస్తోంది. సముద్రంలో నీటిబిందువులా కాస్త యినా సరే చేయగలిగింది చేయాలనివుంది. ఏమీ చేయలేమా చెప్పు'' అంది వర్ష చిత్ర గడ్డాన్ని పట్టుకుని కుదుపుతూ.

"ఏంచేద్దాం? ఏజ్‌డ్‌వాళ్ళకోసం ఒక హెూమ్ పెడదామా?" అని నవ్వి, "రేపు ఈశ్వరీదేవిగారి దగ్గరికి వెళదాం, ఆవిడతో మాట్లాడితే నీక్కాస్త రిలీఫ్‌గా వుంటుంది. అయినా మరీ అంత సెన్సిటివ్‌నెస్ కూడా పనికిరాదమ్మాయి. పూలలో ఉండే ఫ్రాగ్రెన్స్‌నీ, డెలికసీని గుర్తించి ఆస్వాదించాలి కానీ మన మే పూలమయితే మాత్రం ప్రమాదం. ఇక నిద్రపో' అంది చిత్ర.

వర్షక్కూడా ఆ మాటలో నిజం కన్పించింది. చాలా సేపు అదే ఆలోచిస్తూండి పోయింది. మరుసటిరోజు ఈశ్వరీదేవి ఇంటికి వెళ్ళడాన్ని గురించి, అక్కడ ఆవిడతో ఏమేం మాట్లాడాలో, దేనికి ఆవిడ రెస్పాన్స్ ఎలా వుంటుందో అనుకుంటూ ఎప్పటికో నిద్రపోయింది వర్ష.



రాత్రి అనుకున్నట్లుగానే చిత్ర మూడున్నరకి స్కూలు అయిపోగానే వర్ష ఆఫీసుకి బర్కత్ పురా వచ్చింది. ఆమె రాగానే వర్ష పర్మిషన్ తీసుకుని ఇద్దరూ కలసి ఈశ్వరీ దేవి ఇంటికి వెళ్ళారు.

ఈశ్వరీదేవి దగ్గర బెరుకు, కొత్తతనం పూర్తి గా పోయాయి వర్షకి. చనువు పెరిగి, సన్ని హితం అయ్యేకొద్దీ ఆత్మీయంగా అనిపించసాగింది.

కొంతసేపు లోకాభిరామాయణం అయ్యాక చిత్రే అసలు విషయం ప్రస్తావనకి తెచ్చింది.

వర్ష కల్పించుకుని, "మేడం! సాధారణంగా అనేక కష్టాలకీ, కట్టుబాట్లకీ లోనవుతున్న స్త్రీలపట్ల నాకు సానుభూతి వుంది. కానీ ఒక్క విషయంలో మాత్రం అదే స్త్రీలని చూసి అసహ్యించుకుంటున్నాను. కన్న తల్లిదండ్రులనీ, పెరిగిన పరిసరాలనీ అన్నిటినీ వదులుకుని అత్తవారింటికి వెళ్ళడం నిజంగా చాలా కష్టమే. కానీ ఒకసారి వెళ్ళాక దాన్ని కూడా తనింటిగానే భావిస్తుంది. మరి అక్కడి వ్యక్తులని తనవాళ్ళలానే చూసుకోవాల్సిన బాధ్యత లేదా? భర్తా అతని సంపాదనా కావాలి కానీ అతను ప్రయోజకుడు అవడానికి కారణమయిన అతడి తల్లిదండ్రులు మాత్రం బరువైపోతారా? హక్కులు కావాలి గానీ బాధ్యతలు అక్కర్లేదు, ఇదెంత ఘోరం?" చాలా ఆవేశంగా అంది వర్ష.

అంతా విని చిద్విలాసంగా నవ్వింది ఈశ్వరి.

"మరి ఇంతకుముందొకసారి స్త్రీని చాలా సమర్థించినట్లున్నావు. ఆమె మగవాడి చేతిలో బానిసయిపోయింది, బలిపశువైపోతోందని, మగవాడు చెండుకు తింటున్నాడని ఇంకేమేమో అన్నావు. ఇప్పుడేమో పూర్తిగా స్త్రీని నిందిస్తున్నావు. అత్తమామల్ని కోడళ్ళు చూసుకోవాలి నిజమే కానీ అంతకంటే ముందు కొడుకులు కూడా..."

"నేను ముందే చెప్పాను కదండీ! స్త్రీ అనేక సమస్యలతో సతమతమైపోతున్నమాట నిజమే. కానీ చాలామంది వృద్ధాప్యంలో అనాథల్లా బతకడానికి చాలావరకు స్త్రీలే కారణం







అన్పిస్తుంది. ఎందుకంటే తమ భార్యలు ఆప్యాయంగా చూసుకుంటే వద్దనే కొడుకు లుంటారా?" అంది వర్ష.

"మళ్ళీ అదే మాట. బయటనుండి వచ్చిన కోడళ్ళనే ముందెందుకు తప్పు పట్టాలి, కన్న కొడుకులకి అంతకంటే ఎక్కువుండాలి''

"అది నిజమే. మనసులో ఎంత మమకార మున్నా మంచినీళ్ళు కూడా అందించలేని మగవాళ్ళేం చూసుకుంటారు మేడం? అవన్నీ చేస్తూనో, చేయలేకో గొణుగుతూ సణుగుతూ సాధించే భార్యల పోరు పడలేక..."

"పెద్దవాళ్ళచేత ముఖ్యంగా అత్తలచేత అడ్డ మయిన పనులూ చేయించుకుంటూ కూడా వాళ్ళకి తిండి పెట్టడానికి ఏడుస్తున్న కోడళ్ళు కూడా వున్నారు. ఎదురు వాళ్ళకి చేసేవాళ్ళు చాలా తక్కువ" అంది చిత్ర కల్పించుకుని.

"అసలు వీటన్నిటికీ ప్రధాన కారణం ఏమి టంటారు?" అంది ఈశ్వరి.

"సర్దుబాటు లేకపోవడం" అంది చిత్ర.

"మగవాళ్ళసలు ఇంటిపనులు చేయకపో వడం కూడా ఒక కారణమేగా మేడం. ప్రతి పనీ తనే చేసుకోవాలంటే అలసటతో స్త్రీకి విసుగు, చికాకు ఎక్కువవుతున్నాయి. అందులో ఉద్యోగం చేసే స్త్రీలకి మరీ కష్టం. మీరే చెప్పండి, ఇదీ ఒక పాయింటేగా'' అంటూ నవ్వింది వర్ష.

ఈశ్వరీదేవి నవ్వింది. "మీరు చెప్పేది నిజమే, కాదనను చిత్ర సర్దుబాటుతత్వం లేక పోవడం అంటోంది. అది అవసరమే.

ఏ ఇద్దరి వ్యక్తుల అభిప్రాయాలూ ఒక రకంగా వుండవు. ఆఖరికి ప్రాణస్నేహితులయి నా సరే. కాబట్టి ఒక కుటుంబంలో పుట్టి పెరిగిన అమ్మాయి ఇంకో కుటుంబంలో కల సిపోవాలంటే అటూ ఇటూ కూడా సర్దుబాటు

గుణం వుండాలి. కానీ అభిమానం దెబ్బతిన్నా గానీ సర్దుకుంటే దాన్ని అసమర్ధత అంటారు. వ్యక్తిత్వం లేకపోవడం అవుతుంది. అలాగే వర్ష మగవాళ్ళు కూడా పనులు చేయా లంటోంది. నిజమే, భార్యాభర్త ఇద్దరూ కలసి చేసుకుంటే ఇద్దరికీ సుఖసౌఖ్యాలుంటాయి. అసలివన్నీ ఎందులోంచి పుడుతున్నాయో తెలుసా, ఆధిక్యతలోంచి..."

వర్ష, చిత్ర ఇద్దరూ ఒక్కనిమిషం అర్ధంకానట్లు చూశారు.

మళ్ళీ ఈశ్వరీదేవి ఇలా అంది, "అవును... ఈ లోకంలో అనేక సమస్యలకి ప్రధాన కారణం ఆధిక్యత. ఇతర బాధలు అస్సలు లేవని నేననను. ఏదో అనారోగ్యం వల్లో అకస్మాత్తుగా జరిగే ప్రమాదం వల్లో ఇలా కూడా మనిషి బాధపడుతున్నాడు. కానీ ఇతర త్రా ఏ వ్యక్తి బాధకయినా సరే ప్రత్యక్షంగానో పరోక్షంగానో మరో వ్యక్తి లేదా వ్యక్తుల డామినేషనే కారణం"

వాళ్ళిద్దరూ మాటలు మర్చిపోయినట్లు చూస్తూండిపోయారు. కొద్దిసేపు ఈశ్వరి కూడా మౌనంగా వుండిపోయింది.

"బాధపెట్టే కోడళ్ళే కాదమ్మా బాధింపబడే కోడళ్ళూ వున్నారు. ఒకచోట అత్తలు పెత్తనం చేస్తే మరోచోట కోడళ్ళు చెలాయిస్తున్నారు. అలాగే ఒకచోట భర్తలు భార్యల్ని బాధపెడితే మరోచోట భార్యలు భర్తల్ని సతాయిస్తున్నారు. మీరంటున్నట్లు మేల్ డామినేషన్ ఎక్కువగా వుంటే వుండచ్చు కానీ స్త్రీలలోనూ వుంది ఆ గుణం"

ఇద్దరూ శ్రద్ధగా వింటున్నారు.

"నేను కొన్ని సంవత్సరాలు నవ్వడం మర్చిపోయాను తెలుసా!"

ఇద్దరూ చిత్రంగా చూశారు ఆవిడవైపు.

"అవును... మీకు ఆశ్చర్యంగానే వుండచ్చు... నాకు పెళ్ళంటే ఒక అవగాహన లేకముందే నా పెళ్ళయిపోయింది. మావయ్య నా పెళ్ళి కాకముందే పోయారు. అత్తయ్య, ఒక పెళ్ళికాని మరిది వుండేవాళ్ళు. ఆవిడతో ఏనాడూ ఏ చిన్న పనీ చేయించలేదు. నా చేత పని చేయించడమొక్కటే ఆవిడ పని. అందుకూడా నేనెప్పుడూ బాధపడలేదు. అప్పట్లో సెక్రటేరియట్‌లో ఉద్యోగం చేసేదాన్ని. తెల్లవారు ఝామునే లేచి పనులన్నీ చేసుకుని ఆఫీసుకి వెళ్తే ఇంటికి రాగానే నాకోసం ఎదురుచూస్తుండేది పని. ఆవిడకి ఏ లోపం చేయకపోయినా ఎక్కడో తప్పులు వెతికేది. గోరంతలు కొండంతలు చేసేది. ఆదివారం అన్ని పనులూ చేసుకుని ఏ కథో రాసుకుందామని కూర్చుంటే ఆవిడకి నచ్చేది కాదు. ఇక ఏ సాహిత్య సమావేశానికో కవి సమ్మేళనానికో వెళ్తే అక్కడ వున్నంతసేపూ అన్నీ మర్చిపోయినా, దారిలో అంతా టెన్షన్... ఇంటికొచ్చాక రాద్ధాంతం..."

"మరి మీ..." మాట పూర్తిచేయడానికి సందేహించింది వర్ష.

అది గ్రహించిన ఈశ్వరి, "నా భర్త... నన్నెప్పుడూ సమర్థించలేదు. అసలతను ఇంట్లో వుండే సమయం చాలా తక్కువ. అతనికి నా జీతంమీద వున్న అభిమానం నా మీద లేదని త్వరలోనే తెలిసింది. కానీ అప్పటికే ఇద్దరు పిల్లలు పుట్టారు. అప్పట్లో నా జీతం నాది కాదు. నా పిల్లలమీద నాకు హక్కులేదు. నాకు ఒంట్లో బాగోకపోతే జాలిపడే నాధులు లేకపోగా, ఇంటిపనులు చేయడానికి వేషమేసినట్లు భావించడం కాదు నిర్మొహమాటంగా అనేది మా అత్తయ్య. నా భర్త నుండి కనీసం కొంత సానుభూతి, సహకారం దొరక్కపోగా అతని జలసాలూ, విలాసాలతో కూడా చాలా విసిగిపోయాను. మొత్తానికి అతన్నుండి విడిపోడానికి నాకు చాలా సమయం పట్టింది. నేను నా కష్టం చెపితే మా అమ్మా, నాన్నా, స్నేహితులూ కన్నీళ్ళు పెట్టుకునేవాళ్ళు, కానీ క్రియకొచ్చేసరికి ఒక్కరూ సహకరించలేదు. ఓర్చుకోమంటూ ఓదార్చేవాళ్ళు. చివరికి నేనే ధైర్యం చేశాను పెళ్ళయిన ఎనిమిదేళ్ళకి"




వర్ష నమ్మశక్యంకానట్లు చూసింది.

"స్త్రీలు కష్టపడుతున్నారని ఎవ్వరూ చెప్ప నవసరం లేదు. అది కళ్ళున్నవాళ్ళందరికీ కన్పిస్తోంది. అయితే ఆ కష్టాన్ని ఎదుర్కో వడం వాళ్ళ చేతిలోనే వుంది. మనం ధైర్యం చేయాలేగానీ త్రాచుపాము కూడా తోక ముడుస్తుంది, అదే భయపడ్డావనుకో వానపాము కూడా తలెత్తుతుంది. అప్పట్లో విశ్వం అనే వ్యక్తి నాకు తారసపడతాడనిగానీ నన్ను చేర దీసి చేయూతగా నిలుస్తాడనిగానీ నేను ఊహించలేదు''

"కానీ మేడం, విడిపోవడం చాలా తేలికే. కానీ మరో పెళ్ళి కావడం చాలా కష్టం కదా అమ్మాయిలకి'' అంది చిత్ర.

"పిచ్చిపిల్లా! తెగతెంపులొక్కటే పరిష్కా రమని నేను అనడంలేదు. చూట్టానికి ఒకలా అన్పించే సమస్యలు కూడా ఆయా వ్యక్తుల మనస్తత్వాలని బట్టి, వారివారి స్థితిగతులు పరిస్థితులని బట్టీ పరిష్కారాలు ఎవరికి వారు నిర్ణయించుకోవాలి తప్ప తలనొప్పికి 'ఏస్ప్రో' వేసుకోండని చెప్పినట్లు చెప్పలేము, చెప్పకూడదు. తలనొప్పి ఒకటే కావచ్చు కానీ అది రావడానికి మాత్రం అనేక కారణాలుంటాయి''

"మేడం మీకంటే రచనావ్యాసంగం ఒక టుంది కాబట్టి భర్తనుండి విడిపోయినా ఆ బాధ మర్చిపోగలరు, కానీ సామాన్యులు..." అంది చిత్ర.

ఈశ్వరి నవ్వి "సామాన్యులు, అసామాన్యులు అంటూ విడగొట్టకులే. నేను కథలు రాసినంతమాత్రాన వీళ్ళందరికంటే గొప్పదాన్నని అనుకోవడంలేదు. ఒకవేళ అనుకుంటే అదే డామినేషన్ అవుతుంది. ఇక మర్చిపోవడానికి మార్గాలు అనేకం వున్నాయి. అయినా మీరు పొరబడ్తున్నారు. ఆధిపత్యం కనిపించగానే భేదాభిప్రాయాలు రాగానే విడాకులు తీసుకోవాలనేది నా ఉద్దేశం కానేకాదు. గది తలుపులు తెరుచుకునే మార్గంలేదని ఖచ్చితంగా తెలిస్తే తప్ప పగలగొట్టడానికి ఎవరూ ప్రయత్నించరు''

"మేడం ఇప్పుడు విశ్వంగారు... మిమ్మల్ని..."

"ఎలా చూస్తున్నాడని సందేహమా? మేమిద్దరం భార్యాభర్తల్లా వుండం మంచి స్నేహితులం" అంటూ నవ్వేసింది ఈశ్వరి.

"మీ ఇద్దరిలో టీ ఎవరు బాగా పెడతారు?" అంది ఆవిడ కొద్దిసేపాగి.

వర్ష, చిత్ర ఏమీ చెప్పకుండా ఎందుకన్నట్లు నవ్వారు.

"నాకు చిత్రమీదే నమ్మకముంది. ఏమ్మా, కాస్త నీ చేత్తో టీ..."

చిత్ర నవ్వుకుంటూ వంటింట్లోకెళ్ళింది.

"ఏం వర్షా! అర్థమయిందా నీకు?"

"చిన్న సందేహం. ఆధిక్యత చేసేవాళ్లది తప్పా, ఓర్చుకునేవాళ్లది తప్పా?" నవ్వుతూ అడిగింది వర్ష.

"అది హద్దులు మించనంతవరకూ ఎవరిదీ తప్పుకాదు. భార్యాభర్తల్లో భార్యకి కేవలం కాలక్షేపపు నవలలిష్టం, భర్తకి మేధస్సు పెంచే రచనలిష్టం అనుకో భర్త అవి చదవద్దు, ఇవి చదవమంటే అక్కడది డామినేషన్ కాదు, అయితే చెప్పే పద్ధతి సున్నితంగా వుండాలి. కానీ భార్య పుట్టింటికి వెళ్లాలో, వద్దో, వెళ్లినా ఎంతసేపు వుండాలో అన్నీ తానే నిర్ణయించి ప్రతి విషయంలో లక్ష్మణరేఖలు గీయడం మాత్రం అక్షరాలా ఆధిపత్యం. ఇలా ఆలోచించు, డామినేషన్ ప్రభావం ఎంతుందో నీకే అర్థమవుతుంది''

చిత్ర ఇచ్చిన టీ ముగ్గురూ తాగారు.

తర్వాత ఆవిడ దగ్గర సెలవు తీసుకుని బయల్దేరారు.

★ ★ ★

రజియా ఆఫీస్‌కి రాకపోయినా, వచ్చి కూడా పనిఒత్తిడిలో వున్నా కేంటిన్‌కి ఒక్కతే వెళ్తుందిగానీ ఇంకెవర్నీ తోడు రమ్మని అడగదు వర్ష.



కాంటీన్‌లో కూర్చుని కాఫీ తాగుతూ టైం చూసుకుంది. మూడున్నర అయింది. కాఫీ తాగి, ఒక అయిదు నిమిషాలు అలాగే రిలా క్సింగా కూర్చుని లేచి ఒస్తుంటే బిందులా వున్న అమ్మాయి కన్పించింది. 'అరే బిందు లా వుందే, ఏ డిపార్ట్‌మెంటో ఈ అమ్మాయి' అనుకుంది. ఆమెని చూడడంతో బిందు గుర్తొచ్చి, ఫోను చేయాలనిపించింది వర్షకి. చిత్రని తరచు కలుస్తూనే వుందిగానీ బిందుని కలిసి చాలా రోజులయ్యింది.

తీరా ఫోనుచేస్తే బిందు సగంపూట సెలవు పెట్టి వెళ్లిపోయినట్లు తెలిసింది.

మరుసటిరోజు చేస్తే సీట్లోలేదు, కాంటీన్‌కి వెళ్లిందేమో అని చెప్పారు.

అదేరోజు సాయంత్రం బిందు ఫోను చేసింది వర్షకి.

"ఏం తల్లీ వీఐపివైపోయావు దర్శనాలు లేవు సరే కనీసం ఫోను చేయడానికేమయింది, నేను చేస్తే ఫోనులో కూడా దొరకవు" అంది వర్ష.

"ష్... మరీ ఫోనులోనే వాయించకు. సర్లే సండే ప్రోగ్రామేమిటి?"

"ఏముంటుంది? కొన్ని పెండింగ్‌పనులు చేసుకోవడం, డ్రెసెస్ ఐరెన్ చేసుకోవడం, ఇంకా..."

"నీళ్లు తాగడం, అన్నం తినడం, ఆవి లించడం..." వెక్కిరించింది బిందు.

"వెవ్వెవ్వె... ఇంతకీ తమరేమయినా ప్రోగ్రామ్ ఫిక్స్ చేస్తున్నారా? భాస్కరా పాలెస్‌లో లంచ్, గోల్కొండలో డిన్నరూ..."

"అంతకంటే బెటర్ ప్రోగ్రాముంది. సండే పొద్దున్నే ఒచ్చేయి... యాజ్ ఎర్లీ యాజ్ పాజిబుల్"

"ఎర్లీ అంటే? నాలిగింటికొచ్చి మేలుకొలుపు పాట పాడనా?"

"ఒద్దులే మా చుట్టుపక్కలవాళ్లు న్యూసెన్స్ కేస్ పెట్టగలరు, మొత్తానికి పదిలోపు వచ్చేసెయ్, ప్లీజ్ ఇండియన్ టైమ్ పాటించకు, వుంటాను" అని పెట్టేసింది.

వర్ష "ఇడియట్" అని పెదవి కొరికి, రిసీవర్‌ని చిన్నగా కొట్టి పెట్టేస్తూ నవ్వుకుంది.

బిందు చెప్పినట్లుగానే ఆదివారం ఉదయం తొమ్మిదిన్నరకి వర్ష ఆమె ఇంటికెళ్లింది. అప్పటికే బిందూ తయారైకూర్చుంది. నారింజ రంగుమీద వంగ రంగు ఏబ్‌స్ట్రాక్ట్ డిజైన్ వున్న కుర్తా, పైజామా, వంగరంగు చున్నీ వేసుకుంది. డ్రెస్ పాటర్న్ కూడా చాలా బాగుంది. ఆరెంజ్‌రంగు ముఖంమీద, చేతులమీద రిఫ్లెక్ట్ అవడంవల్ల వున్నకంటే తెల్లగా కనిపిస్తోంది బిందు.

"సమ్‌థింగ్ స్పెషల్?! చాలా ఫెయిర్‌గా వున్నావు. ఫెయిర్ అండ్ లవ్లీ ఎడ్వర్టయిజ్‌మెంట్‌కి పనికొస్తావు, వాడకముందు, వాడేక అంటూ..."

"ఇది నేచురల్ ఫెయిర్‌నెస్ అంటే మళ్లీ 'ఇమామీనా?' అనకు. ఇంతకీ డ్రెస్ బాగుందా, డ్రెస్‌లో నేను...?"

"నా కళ్లే చెప్తున్నాయిగా ఆ విషయం. అసలు నువ్వు పోటీ చేయలేదుగానీ చేస్తే 'మిస్ యూనివర్సల్'గా సెలక్టయ్యేదానివి"

"సెలక్షన్ కమిటీలో హెూల్ అండ్ సోల్ నువ్వే అయితే అంతపనీ జరగ్గలదు. అప్పటి వరకూ మనం మిస్ సైదాబాద్, తమరు మిస్ దోమల్‌గుడా"

"పాపం చిత్రనొదిలేశావే, అది మిస్ పంజగుట్ట. అయితే మన ఏరియాస్‌కి మనమే క్వీన్స్ అన్నమాట, ఇంకెవరయినా వింటే?"

"వింటేనేం? వాళ్ల సొమ్మేం పోయింది మధ్య. దీన్నే సెల్ఫ్‌కాన్ఫిడెన్స్ అంటారన్న మాట. మనమీద మనకి నమ్మకం అర్థమైందా?"

"అంటే రేపొద్దున నేనో ఆర్టికల్ రాసి, గొప్ప కాన్ఫిడెన్స్‌తోటి నాకు నోబుల్ ప్రైజ్ ఒచ్చే..."

"నోబుల్ ప్రైజ్ అంటే మళ్లీ చిక్కొచ్చిప




డ్తుంది, అంత డబ్బు చూపాలికదా? కాబట్టి బెస్ట్ రిపోర్టర్ ఇన్ ది వోల్డ్, 'బెస్ట్ రిసెప్షనిస్ట్ ఇన్ ది వోల్డ్ లాంటివైతే మనకి మనమే ఇచ్చిపుచ్చుకున్నా సమస్యలేదు'' అంది బిందు నవ్వుతూ.

ఇంతలో మధుమతి హాల్లోంచి "ఎవరే బిందూ లోపల?" అంది.

"కరివేపాకు నాయినమ్మా, ఇందాకట్నుంచీ చూళ్లేదా?" అంది బిందు.

"ఓయోయి, ఏం చెప్తున్నావు. నా పేరుగానీ, మా ఇంటి పేరుగానీ కరివేపాకు కాదు'' అంది వర్ష చిరుకోపంతో.

"కానీ నువ్వొచ్చినప్పుడల్లా కరివేపాకు తెస్తావుగా, మా నాయనమ్మకి అలా చెప్తేనే అర్థమవుతుంది''

"ఇంకా నయం నీకు పెంచుకోడానికని ఏ కుక్కపిల్లనో ఇచ్చానుకాను''

వర్షతోబాటు బిందు కూడా నవ్వేసింది.

ఈలోపు సింధు ఇద్దరికీ టీ తెచ్చి ఇచ్చింది.

టీ తాగడం పూర్తవగానే 'ఇక వెళ్దామా?" అంది బిందు.

వర్ష ఎక్కడికని ప్రశ్నించలేదు. ఇద్దరూ బయల్దేరారు ఇంట్లో చెప్పి.

రోడ్డుమీదికొచ్చాక ఆటో పిలిచి పబ్లిక్‌గార్డెన్ అని చెప్పింది బిందు.

వర్షకి అంతా చిత్రంగానే అన్పించసాగింది. బిందు సామాన్యంగా వున్నంతలోనే మంచి బట్టలేసుకుంటుంది. అంటే ఖరీదయిన బట్టలని కాదు. ఆ మాటకొస్తే కొందరు ఎంత ఖరీదయిన బట్టలు వేసుకున్నా అందులో అందం చందం వుండదు. అయితే మరీ వెలిసిపోయినట్లుండే రంగులు లేదా మరీ కొట్టొచ్చినట్లు గాడీగా వుండే రంగులు వాటికి తగ్గట్లు భయంకరమ్మైన డిజైన్లూ వుంటాయి. కానీ బిందు ఎంపిక అందుకు భిన్నంగా, ఆహ్లాదం గొలిపేట్లుంటుంది. అయితే ఈరోజు మరీ ప్రత్యేకంగా ఉంది. అంతేగాక బిందు ఆర్థిక పరిస్థితులవల్ల ఆటో ఎక్కడానికి ఇష్టపడదు. అలాంటిది ఈరోజు సైదాబాద్‌నుండి పబ్లిక్‌గార్డెన్ వరకూ ఆటో.

వర్ష ఇక కుతూహలం అణచుకోలేక "ఇంతకీ ఎందుకెళ్తున్నాం?" అంది.

"సస్పెన్స్ చెప్పను. గెస్ చేయగలవా?" అంది బిందు నవ్వుతూ.

"నీకేమ్మైనా ప్రమోషన్ వచ్చిందా? అలా అయితే చిత్రని కూడా పిలిచేదానివి. ఏమో నాకీ పజిల్స్ ఇష్టంలేదు. నేనేం ఆలోచించను. అరగంటలో ఎలాగో తెలీకమానదు'' అంది ఆటోలోంచి బయటికి చూస్తూ వర్ష.

"అసలు సస్పెన్స్ ఎంత థ్రిల్లింగ్‌గా వుంటుందో? నువ్వుగానీ రైటర్‌వయితే ముందు ముగింపు రాసేసి తర్వాత కథ చెప్పేట్లు కన్పిస్తున్నావు''

"ఓ హెన్రీలాగానా? అదెంత గొప్ప పద్ధతో'' మురిసిపోయింది వర్ష.

తర్వాత బిందూ ఇంకేమీ అనలేదు. వర్ష కూడా రోడ్డు చూస్తూ కూర్చుంది.

ఆటో త్వరగానే గమ్యం చేరింది. ఇద్దరూ ఆటో దిగారు.

వర్ష ఎంట్రన్స్ ద్వారా లోనికి దారితీస్తుంటే బిందు ఆమె చెయ్యి పట్టుకుని "ఆగాగు, ఇక్కడే నిలబడు'' అంది.

వర్ష ఎందుకన్నట్లు చూస్తే బిందు కాస్తాగు అన్నట్లు కళ్లతోనే నవ్వింది.

"చిత్రనిగానీ డైరెక్ట్‌గా రమ్మనలేదుకదా?" అంది వర్ష.

"ఉహూఁ" అంది గడియారం వంక చూసుకుంటూ బిందు.

"ఇదిగో అమ్మాయి! నాకీ సస్పెన్సులు నచ్చవు. పరమచిరాకేస్తుంది. అసలు నన్నెందుకు తెచ్చావు, ఎవరికోసమీ వెయిటింగు? ఏ సద్దాంహుస్సేనో ఫోనుచేసి పబ్లిక్ గార్డెన్ దగ్గర వెయిట్ చేయమని చెప్పలేదుకదా?"

"అసందర్భంగా అతడెందుకు గుర్తొచ్చాడు?"

"చిత్ర బోయ్‌ఫ్రెండ్ బుష్ అట, అందుకుని నువ్వతడికి లైనేశావేమోని''

"ఏడ్చినట్లుంది గానీ... ఈ కేవీకేమయ్యింది, ఇంకా నాదే లేటైందని నేను కంగారుగా వస్తే ఇంతవరకూ రాలేదు'' అంది బిందు తనలో అనుకుంటున్నట్లు.

"హయ్యా బాబోయ్... ఏమిటి కథ ఎంతవరకొచ్చింది?" అభినయించింది వర్ష.

బిందు ఏదో చెబ్దామని నోరు తెరిచేలోపు కేవీ అనబడే వ్యక్తి వచ్చేశాడు.

"హాయ్ బిందూ, సారీ లేటయిపోయింది. నువ్వేమో వెహికల్ తేవద్దన్నావు. మన హైదరాబాద్ ఆటోవాలాల సంగతి తెలిసిందేగా. రాజుల్లా దర్జాగా రోడ్డుపక్కన పార్కు చేసుకుని పాన్ నములుతూ వచ్చీపోయేవాళ్లని వినోదంగా చూట్టమే వాళ్ల ధ్యేయమన్నట్లుంటారు తప్ప అడిగితే మాత్రం తల అడ్డంగా వూపుతారు. ఎవరో పాపం ఒక మహానుభావుడు నన్ను కరుణించి, నాపై జాలి తలచి రానూ, నో, నహీ అని చెప్పకుండా వచ్చాడు కాబట్టి ఇప్పటికయినా రాగలిగాను'' అన్నాడు.

"నాన్‌స్టాప్ నాన్‌సెన్స్'' కళ్లు మూసి, పెదాలు అదో మాదిరిగా బిగపట్టి నవ్వుతూ, తల సుతారంగా, అడ్డంగా వూపుతూ గొప్ప ఎక్స్‌ప్రెషనిచ్చింది బిందు.

కేవీ పెద్దగా నవ్వేశాడు. బిందు వర్షని పరిచయం చేయబోయింది. కానీ అతను ఆమెని వారించి "నాకు ఎస్ట్రాలజీ తెలుసండీ. మాటల్లో చెప్తే మీరు నమ్మకపోవచ్చు, ప్రాక్టికల్‌గా చూడండి. మీ పేరు వర్ష, మీరు సబెడిటర్‌గా పనిచేస్తున్నారు. మీకేదో ముక్కుమీదే వుంటుంది..." తమాషాగా రెండు సెకన్లు గాప్ ఇచ్చి "కోపంకాదు... ముక్కుపుడక" అన్నాడు గలగలా నవ్వేస్తూ.

వర్షకి అసలు ఒక కొత్త మనిషిని చూస్తున్న భావనే కలగలేదు, కానీ ఏం మాట్లాడాలో తోచక చిరునవ్వు చిందిస్తూ వుండిపోయింది.

"అన్నట్లు మీకు ఫేస్ రీడింగ్ రాదుగా, కాబట్టి నా గురించి నేను చెప్తాను. నా పేరు కె. విశ్వనాథ్, నాట్ ది ఫిల్మ్ డైరెక్టర్... జనాలు అలా పొరబడ్తారనే బెంగతోనే నా పేరుని షార్ట్‌కట్ చేసేశాను.. కేవీ. ఆంధ్రాబ్యాంక్‌లో కేషియర్‌గా చేస్తున్నాను. అన్నట్లు మీ ఇద్దరికీ కంబైండ్‌గా ఇంకో ఫ్రెండ్ వుండాలికదా'' అని గాలిలో వేళ్లు తిప్పుతూ ఏవో కాలిక్యులేషన్స్ చేసినట్లు నటించి "పేరు చిత్ర, టీచర్‌గా పనిచేస్తోంది, ప్రస్తుతానికి పంజగుట్టలో వుంటోంది'' అన్నాడు.

"ఇదిగో కేవీ! నిన్ను మాటికీ నాన్‌స్టాప్ నాన్సెన్స్ అనడం కూడా నాకు విసుగ్గా వుంది, దాన్నే షార్ట్‌చేసి ఎన్నెన్ అని పిలుస్తాను. ఏయ్ వర్షా! నువ్వు 'అన్నా ఎన్నెన్' అని పిల్చుకో సరేనా?" అంది బిందు.

"అన్నయ్యా అంటే చాలు చెల్లెమ్మా. మరీ అన్నా ఎన్నెన్ అంటే అదేదో రష్యన్ పేరులా వుంది'' అన్నాడు కేవీ.

"వర్ష కాబట్టి సరిపోయింది, నువ్వెంత సోది మాట్లాడినా మనసులోనే ఎడిట్ చేసుకుంటుంది. కానీ చిత్ర ఇలా కాదబ్బాయి. వన్ వర్డ్ ఆన్సర్లని కూడా ఎస్సే టైప్‌లో ఎంటెంప్ట్ చేస్తే మొత్తం కొట్టి పడేస్తుంది''

"అప్పటి సంగతి చూద్దాంలే. అయినా ఇప్పుడు మార్కులొస్తేనేం, రాకపోతేనేం, ఉద్యోగమొచ్చాక గోల్డ్‌మెడలొచ్చినా వేస్టే'' అన్నాడు కేవీ.

"ఆం పెద్ద నీగ్గాక వుందిలే గవర్నమెంట్ జాబ్. కేషియర్‌గా చేస్తూ కలక్టర్లా ఫీలయిపోతున్నావు'' వ్యంగ్యంగా నవ్వింది బిందు.

"కలక్టర్ దగ్గర అంత కరెన్సీ ఎందుకుంటుంది? నేనయితే ప్రతిరోజూ వేలూ లక్షలు మారుస్తుంటాను''

వాళ్లిద్దరూ మాట్లాడ్తుంటే వర్ష శ్రోతగా మిగిలింది. ముగ్గురూ మెల్లగా నడుచుకుంటూ




రవీంద్రభారతి వరకూ వచ్చారు.

"మిమ్మల్ని వర్షా అంటే పరవాలేదా, వర్ష గారూ అనాలా?" అన్నాడు కేవీ.

"అయ్యయ్యో, గారూ గీరు ఏమక్కర్లేదు'' అంది వర్ష.

"హమ్మయ్య, ఎలా అయితేనేం మీచేత మాట్లాడించాను. సరే మళ్ళీ ఫ్యూచర్ చెప్పనా? ఇప్పుడు మనం ముగ్గురం కామత్‌లో ఏదో తినబోతున్నాం. ఆ తర్వాత టీ తాగి..." అంటూ కేవీ చెప్తుంటే.

"వ్వెవ్వెవ్వె... నీకే కాదులే ఈ పిచ్చి జ్యోతిష్యాలు మాకూ తెలుసు. నువ్వు ఏదో తింటాం అని ఎప్రాక్సిమేట్‌గా చెప్తున్నావుగానీ నేను ఇంకా ఖచ్చితంగా చెప్పగలను, మనం దోశ తింటాం, ఎందుకంటే అది మన ముగ్గురికీ ఇష్టం గనుక, తర్వాత బిర్లామందిరానికి వెళ్తాం, అక్కడ నేనూ వర్షా ఫోజులిస్తుంటే తమరు ఫొటోలు తీస్తారు'' అంది బిందు.

"అసలు జ్యోతిష్యమంటే అర్థమేంటి?" అంది బిందు.

"అమ్మో ఈ పేపర్‌వాళ్లు బడా ఖతర్నాక్స్. ఏదడిగినా, ఏం చేసినా ఎందులోనో ఇరికించడానికే' అంది బిందు.

"మీ బిందూగానీ ఏ ఎమ్మెల్యేనో అయ్యిందంటే రిపోర్టర్లు చచ్చారే. ప్రశ్నా జవాబు రెండూ వాళ్లే రాసుకోవాలి'' అన్నాడు కేవీ.

వర్ష నవ్వి "ఏంలేదు జ్యోతిష్యమంటే మూడు కాలాలూ వస్తాయి. మీరు భవిష్యత్తు మాత్రమే చెప్తున్నారు, నేను ప్రెజెంటెన్స్ సరిగ్గా చెప్పగలను. మీరు ఎల్లోకలర్ షర్ట్ వేసుకున్నారు'' అంది వర్ష.

"అరే సెంట్‌పర్సెంట్ కరక్ట్‌గా చెప్తున్నారే'

"ఇద్దరూ సరిపోయార్లేగానీ లోనికి దయచేయండి'' అంది బిందు.

ముగ్గురూ ఓ టేబుల్‌ముందు కూర్చున్నారు.

టిఫిన్ తిని, టీ తాగాక కొంతసేపు బిర్లా మందిరంలో గడిపి కేవీని పంపేసి ఇద్దరూ బస్టాపువైపు నడుస్తున్నారు.

"ఆc ఇప్పుడు చెప్పు ఎలా వున్నాడు కేవీ?" అంది బిందు.

"నీకంటే మంచివాడిలా వున్నాడు''

"అంతేలే ముందొచ్చిన చెవులకంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి''

"సర్లేగానీ. ఇంతకు ముందెప్పుడూ మాట మాత్రం చెప్పలేదు. ఇలా సడెన్ సర్‌ప్రైజ్ లెందుకు. కాస్త ముందు చెప్పివుంటే మంచి డ్రెస్ వేసుకుని ఎలా మాట్లాడాలో రిహార్సల్స్ వేసుకుని వచ్చేదాన్ని''

"ఇప్పుడేం నష్టంలేదు. నీ గురించి ముందే చెప్పేశాన్లే''

"ఏం చెప్పావేంటి?"

"మట్టితో చేసిన బుర్రలో వెలక్కాయంత వెర్రి తప్ప ఇంకేం లేదని''

"ఏయ్, నిన్ను... మా అన్న ఈసారి కలిసినప్పుడు చెప్తానీపని''

బిందు నవ్వి "వచ్చే ఆదివారం చిత్రకి పరిచయం చేయాలి'' అంది.

"మేం సంతోషించాలి, ఒకేసారి వెడ్డింగ్ కార్డ్స్ ఇవ్వనందుకు'' అంది వర్ష.

"నీకు వర్ష కాదు వక్ర అని పేరుపెడితే సరిపోయేది. ముందు పరిచయం చేసింది నీకే తెలుసా? ఇంతవరకూ ఇంట్లో తెలీదు, సింధూక్కూడా..."

"అసలు ముందు చెప్తే నీకొచ్చే నష్టమేంటి? ఇంకా ఇంట్లో చెప్పకపోవడమేంటి ఇంతవరకూ వచ్చాక. మీ ఇద్దరూ కలిసి తిరుగుతూ, ఎవరో చూసి ఇంట్లో చెప్పి అప్పుడు క్రిమినల్లా నిలబడేకంటే ఏ గొడవా లేకుండా ముందే చెప్పేయడం మంచిది'' అంది వర్ష.

"నువ్వు చెప్పేది నా మంచి కోసమే, కాదనను. కానీ మేమిద్దరం ఆఫీసులో కలుసు



కోవడమే తప్ప బయట తిరగడం ఇది రెండో సారి మాత్రమే. ఇకపోతే ఇప్పటివరకూ ఎందుకు చెప్పలేదంటే.. కేవీ నాకు అయిదారు నెలలుగా క్లోజ్‌గా మూవవుతూ వచ్చాడు. అసలు మా పరిచయం కూడా గమ్మత్తుగా జరిగింది, అది వేరే సంగతి. అతను ప్రపోజ్ చేస్తాడని తెలుసు. కానీ చేయకుండానే అందరికీ చెప్తే తర్వాత బాగోదని...''

"ఇంతకీ ఇప్పుడు కన్‌ఫర్మ్‌డా?''

"అయ్యగారికెలాగో కాస్తంత ధైర్యమొచ్చింది పాపం. ఆ నాన్చుడుబేరం చూస్తే నాకైతే గుండుగీయించి గాడిదమీద తిప్పాలన్నంత కోపం వచ్చేదనుకో. తోటకూర దగ్గర్నుంచి టోరంటో వరకూ అన్నీ మాట్లాడేవాడు నీ గురించి నేనిలా అనుకుంటున్నాను, నీ ఉద్దేశమేంటి అని అడగడానికి మాత్రం గొంతులో గరగర మొదలయ్యేది'' నవ్వింది బిందు.

"వెంటనే స్ట్రెయిట్‌గా ఇవ్వకపోయావా? అయినా తనమీదే నిందవేయడమెందుకు? పోనీ ముందు నువ్వే అడగాల్సింది'' అంది వర్ష.

"చాల్లే పోవే. నీకస్సలు తెలివిలేదు. అమ్మాయిలు ప్రపోజ్ చేస్తే బాగోదు. మగవాళ్లంటే ధైర్యంగా, ఛాలెంజింగా వుండాలి, ఆ మాత్రం ధైర్యం కూడా లేకపోతే... ఉహూ, నాకు నచ్చరు'' అంది బిందు.

అలా చాలాసేపు వచ్చేపోయే బస్సులని పట్టించుకోకుండా మాట్లాడుకున్నారు. చివరికి మళ్ళీ ఎప్పుడు కలవాలో చెప్పుకుని ఎవరి బస్సులు వాళ్లు ఎక్కారు ఇళ్లకి వెళ్లేందుకు.

★ ★ ★

వర్ష ఇల్లు చేరేసరికి దాదాపు మధ్యాహ్నం రెండుగంటలౌతోంది. ఉదయం స్నానం చేసినా ఎండలో నడవడంవల్ల చికాగ్గా అన్పించి మళ్లీ స్నానంచేసి, సింథాల్‌పౌడర్ సువాసనలు ఘుమఘుమపిస్తుండగా జడని నడినెత్తిమీద కొప్పుగా పెట్టేసి మెడమీద ఒక భారం తీరినట్లు హాయిగా తల విదుల్చుకుని వచ్చీరాని పాటల్ని కూనిరాగం తీస్తూ వాలుకుర్చీమీద కూర్చుంది.

"దీదీ, ఓ దీదీ! ఆప్ కిస్ ఖయాల్‌పే హయ్, జరా బతావో'' అన్నాడు హర్ష ఎంతకీ పలకని సోదరిని సమీపించి.

"ఏందీ భయ్యా!? హమేషా నా యెన్క చెక్కెర్లు కొట్టుడేంటి? పొద్దుగాల్నుంచి ఎండల తిరిగి తిరిగి గుండె బేజారొచ్చె పోరగాని వున్నావంటే అక్కగిట్ల బైక్ తీసుకోమని కూడా చెప్పువాయె'' అంది వర్ష.

"మళ్లీ ఒక తెలంగాణా అమ్మాయి చేరిందా తల్లీ మీ ఆఫీసులో?''

"అవు భయ్యా, స్వీపర్ని గిట్ల మార్చిన్రు''

"తల్లీ, నీకో నమస్కారం. నాకు తెలంగాణ వింటే తెముల్తుంది'' అని వెనుదిరిగాడు హర్ష.

"రెడ్డీ, రెడ్డీ! నిన్నే'' అంది వర్ష.

హర్ష ఎవరినన్నట్లు గేటువైపు చూసి అక్కడెవరూ లేక వర్షవైపు తిరిగాడు.

"పింక్ బట్టలేసుకుంటే పింకీ అంటారు, రెడ్ బట్టలేసుకుంటే రెడ్డీ అనకూడదా, సరేగానీ అమ్మని కాస్త అన్నం పెట్టమని చెప్పవా?'' అంది వర్ష.

"అలాగే చెప్తాను. ముందీ రెడ్‌షర్ట్ తీసేసి'' అంటూ వెళ్లాడు హర్ష.

వర్ష లోనికెళ్లి భోజనం చేసి డైరీ రాయడం మొదలుపెట్టింది.

వర్ష డైరీ రాసే పద్ధతి కాస్త వింతగానే వుంటుంది. దాన్నో డ్యూటీగా పెట్టుకుని రోజూ రాయదు. బుద్ధిపుట్టినప్పుడు మాత్రమే రాస్తుంది. ఒక్కోసారి కొన్ని నెలలు కూడా రాయదు. ఒక్కోసారి ప్రతిరోజూ ఇంకా మాట్లాడ్తే రోజుకి రెండుసార్లు కూడా రాస్తుంది. ఆ రాతలో పడిందంటే పైన తారీఖులు కొట్టేస్తూ పేజీలకొద్దీ రాస్తుంది. కొన్ని కొన్ని పేజీల్లో ఒకటి రెండు వాక్యాలు మాత్రమే వుంటాయి.

"బిందు ఫోన్ చేసినప్పుడు కాదుగదా

 

కనీసం పబ్లిక్‌గార్డెన్‌కి ఆటో మాట్లాడినప్పుడు కూడా ఎందుకో నేను ఊహించలేకపోయాను. కొన్ని విషయాల్లో నిజంగా నాది మట్టిబుర్రేన న్పించింది. అసలు విషయం ఏమంటే అదీరోజు తన బోయ్‌ఫ్రెండ్‌ని పరిచయం చేసింది. పేరు కేవీ అట. చాలా పొడవుగా వున్నాడు. అతన్ని చూస్తూ మాట్లాడాలంటే తల కాస్త పైకి ఎత్తక తప్పదు. అందం విషయానికొస్తే ఒకమాదిరిగా వుంటాడు. నడక మాత్రం అసలు బాగా లేదు. నేను రోడ్డుమీద నడుస్తూ కూడా అందరి నడకలనీ గమనిస్తూంటాను. చాలా కొద్దిమంది మాత్ర మే హుందాగా నడుస్తుంటారు. రూపురేఖ లంటే మన చేతిలో వుండవు. కానీ నీట్‌గా డ్రెసప్ అవ్వడం, ఆహ్లాదంగా మాట్లాడ్డం, కాళ్ళీడ్చుకుంటూనో గుర్రం గెంతినట్లోగాక చక్కగా నడవడం ఇవన్నీ ఖచ్చితంగా మన చేతిలోనే వుంటాయి. అయినా చాలామందికి వాటిమీద శ్రద్ధేవుండదు. మొత్తానికి బిందు బచన్ అంటే పడి చచ్చేది. అందుకు తగ్గట్లే బచన్‌లాంటి పొడవ్వాడొచ్చాడు.

బోళా మనిషిలా అన్పించాడు. బిందు సెలక్షన్ని మెచ్చుకోవాలి.

అంతవరకూ రాసి డైరీ మూసేసింది.

కొంతసేపు కప్‌బోర్డ్ సర్దింది. తర్వాత టేప్ రికార్డర్‌లో పాటలు వింటూ వారానికి సరిపడా బట్టలు ఇస్త్రీ చేసి హాంగర్లకి తగిలించింది. మరోసారి పేపర్ తిరగేసి కొంచెం టీ పెట్టుకుని తాగుతూ మొక్కల్ని పర్యవేక్షించింది. ఇక అక్కణ్ణుంచి కదలాలన్పించలేదు. పండిపో యిన, ఎండిపోయిన ఆకుల్ని తుంచేస్తూ కొన్ని మొక్కల మొదళ్లలో గుల్లచేయడం మొదలె ట్టింది. సాయంత్రం అయిదవుతుండగా చిత్ర వచ్చింది.

"అర్ధాంతరంగా నామీద ఇలా దయకలి గిందే?" అంది వర్ష.

"ఎవరయినా రాగానే 'రండి కూర్చోండి, మంచినీళ్లు కావాలా?' అని అడుగుతారు. కానీ నువ్వు మాత్రం దారి తప్పి వచ్చావా, ఏం పాపం ఇలా వచ్చావు అంటావు. ఛఛ అతిథి మర్యాదలు కూడా తెలీదు''

"అతిథి మర్యాదలా ఆవకాయా? సమయా నికొచ్చావు. ఇప్పుడు మా పనిమనిషి రాకపోతే గిన్నెలు నేనే తోమాలి, నువ్వు కడిగిపెట్టు''

"బ్రతికించావు అంతవరకూ అయితే పరవా లేదు. మీ పక్కిళ్లవాళ్లకి రికమండ్ చేయకపోతే చాలు''

"సర్లే నువ్వెళ్లి హాల్లో కూర్చో, నేను చేయి కడుక్కుని వస్తున్నా''

చిత్ర వెళ్లి సోఫాలో కూర్చుంది.

అప్పుడే నిద్రలేచి హాల్లోకొచ్చిన గిరిజ చిత్రతో మాట్లాడ్తూకూర్చుంది.

ఈలోపు వర్ష లోపలికెళ్లి తల్లికీ, చిత్రకీ టీ తెచ్చి ఇచ్చింది.

"అమ్మ టీవీ చూసుకుంటుంది గానీ మని ద్దరం పైకెళ్దాం పద" అంది వర్ష.

ఇద్దరూ డాబామీద కూర్చున్నారు.

"ఆc చెప్పు ఏవిటి సంగతి?" అంది వర్ష, రాగం తీస్తూ.

"నువ్వు ఉడ్‌వర్డ్స్ గ్రైప్‌వాటర్ ఏడ్ స్టైల్‌లో అడిగితే నేను మాయాబజార్‌లో సావిత్రి స్టై ల్‌లో సమాధానం చెప్పాల్సుంటుంది''

"అంటే?"

"అహ నా పెళ్లంట అంటూ..." నవ్వింది చిత్ర.

"నిజమా? ఈరోజు ఇది రెండో షాకింగ్ న్యూస్''

"ఛ అదేంటే అలా అంటావు నేనేమైనా హార్టెటాక్ అన్నానా?"

"నాకు మాత్రం ఇది కాస్త వింతగానే వుంది. ఇంత అకస్మాత్తుగా అటు బిందు, ఇటు నువ్వూ కూడా..."

"ఏంటి, బిందు పెళ్లి కూడా కుదిరిందా?"

"కుదిరిందా కాదు కుదుర్చుకుంది. ఐ మీన్ లవ్ మేరేజ్..."

"బావుంది, మరి పెళ్లి ఎప్పుడట?"

"వీలయినంత త్వరలో అని చెప్పింది. రిజిష్టర్ మారేజ్ అంది''

"అయితే నాకంటే ముందు బిందూదే అవుతుందన్నమాట"

"ఏమో నన్నొదిలేసి మీరిద్దరూ ఉడాయిస్తున్నారు''

"మేం నలుగురం కలిసి నీ పెళ్లి చేస్తాంలే'

పెళ్లంటే సంకెళ్లు. మీకు దానిమీద మోజుగా వున్నట్లుందిగానీ నాకేం లేదు. నేనిలాగే పదికాలాలపాటు ఫ్రీబర్డ్లా..."

"అదెప్పటికీ నిజం కాదు. మనకి తెలివితేటలుండాలేగానీ ఎలాంటి పరిస్థితులనయినా మన చెప్పుచేతల్లోకి తెచ్చుకోవచ్చు. పక్షి కేవలం పైన ఎగరగలదు. కానీ మనిషి అంతకంటే పైకి వెళ్లగలదు. ఇక మనసు సంగతి చెప్పాల్సిందే లేదు''

వర్షకి ఆ విషయంమీద వాదించడం ఇష్టం లేకపోయింది.

"ఇంతకీ అతనేం చేస్తాడు? సారీ... చేస్తారు అనాలేమో''

"గౌరవించనక్కర్లా, అభిమానించు చాలు. ఫిజిక్స్లో పీహెచ్డీ చేస్తున్నాడట. ఇంకో రెండు మూడు నెలల్లో థీసిస్ సబ్మిట్ చేయాలట"

"అయితే ప్రొఫెసరయ్యే ఛాన్సెస్ వున్నాయన్నమాట"

"ఈ రోజుల్లో ఐ.ఏ.ఎస్.లూ, ఐ.పీ.ఎస్.లకి కూడా విలువ తగ్గిపోయింది ఇక పీ.హెచ్.డీ. ఒక లెక్కా? ఒక ఖాళీకి వెయ్యి తలలు లైన్లో వుంటున్నాయి కాబట్టి ముందే మనమేం ఊహించలేం"

"అంటే అతనిమీద నీకామాత్రం నమ్మకం లేదా?"

"అతనెవరో కొత్తవాడు కాదు. నేను చాలాసార్లు చూశాను. మంచి తెలివయినవాడే. అది కాదు సమస్య. ఈశ్వరీదేవిగారు చెప్పినట్లు ఇందులోనూ డామినెన్స్ వుంది. రిక్రూట్మెంట్ బోర్డ్సులో ఇంటలిజెన్సుని ఇన్ఫ్లుయెన్స్ డామినేట్ చేస్తోంది. కాబట్టి అతను ప్రొఫెసరయితే మంచిదే కానీ నేను దానిమీద ఏమాత్రం హోప్స్ పెట్టుకోవడంలేదు. ఏదో ప్రైవేట్ జాబయినా ఫరవాలేదనుకుంటున్నాను''

"కాంప్రమైజేషన్?!"

"నాకే కాదు అది ఎవరికయినా తప్పదు. అన్నీ కావాలంటే దొరకవు వర్షా! నేను ఎప్పుడూ పైకి చెప్పను కానీ లోపల నాకు పెళ్లంటే ఎంతో భయముండేది. ఎందుకో తెలుసా? పెళ్లంటే సంకెళ్లనీ, పెళ్లి కాగానే నేనో బానిసనయిపోతాననీ నీలాంటి పిచ్చిభయాలు కావు. నాన్న సంగతి తెలుసుకదా... అదే కృష్ణవేణితో... ఆ విషయం వేలెత్తి చూపించి అవమానిస్తారేమోనని..."

"అందుకే నిన్ను అమ్మమ్మ అనేది. మనం తప్పు చేస్తే మనం భయపడాలి. మన నాన్నలూ, అన్నలూ చేసిన తప్పులక్కూడా మనదే బాధ్యత అవుతుందా?"

"చూడమ్మాయి ఇక్కడ న్యాయం అన్యాయం ప్రసక్తిలేదు. లాయర్ లేని కోర్టులాంటిది మన సమాజం. జస్ట్ జడ్జిమెంట్ మాత్రమే వుంటుంది''

"అలాంటి చెత్త కోర్టులని మనం ఏక్సెప్ట్ చేయకూడదు. మనం నమ్మిని సిద్ధాంతాలని లెక్కచేయకూడదు. అందుకోసం అవసరమయితే రిస్క్ తీసుకోవాలి. రాజుకంటే మొండివాడు గొప్పవాడట. అందుకే గాలి వస్తే కొట్టుకుపోయేట్లుండే గాంధీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించాడు. చిన్న జంతువులు చచ్చిపోతాయి, చూసి నడుద్దామనే జ్ఞానం ఏ కొద్ది ఏనుగులకో వుంటుంది. కానీ వాటి కాళ్లకింద పడకుండా తప్పించుకోవాలనే విచక్షణ ముందు చిన్న జంతువులకే వుండాలి''

"ఏ జంతువుకీ ఇంకో జంతువు కాళ్లకిందపడి చచ్చిపోవాలనుండదు. ఏ మనిషికీ తమ మీద ఇంకొకళ్లు పెత్తనం చేస్తుంటే హాయిగా




వుండదు. కానీ ఏం చేయగలం, పరిస్థితులు లొంగదీస్తాయి. మన ఆదర్శాలన్నీ మాటలవరకే పరిమితం అవుతాయి. చేతల దగ్గరికొచ్చేసరికి ఎదిరించలేని అసమర్థత. నిజానికి అల్లుడయినా, కోడలయినా ఒకటే. మరొక ఇంటి నుండి తమ పిల్లలకి భాగస్వాములుగా వచ్చినవాళ్లు. కానీ నువ్వెంత వాదించీ ఆ సమానత్వాన్ని సాధించగలవా? అల్లుడయితే నెత్తిన పెట్టుకుంటారు. ఎందులో ఏలోపం జరుగుతుందో, దేనికి అలకపాన్పు ఎక్కుతాడోనని వణికిపోతుంటారు. అదే కోడలయితే పనిమనిషికంటే హీనమయిపోతుంది. ఏ పనిలో ఏ వంక చూపిద్దామా అని భూతద్దం పెట్టుకుమరీ వెతుకుతుంటారు? సరే ఆ కోడలే గడసరయితే అసలుకే మోసమొస్తుందనుకో''

వర్ష ఆలోచనలో పడిపోయింది. చిత్ర మళ్లీ ఇలా అంది.

సమాజం అలా వున్నపుడు అందులో భాగమయిన మనం సర్దుకుపోవడం తప్పనిసరి అవుతుంది వర్షా. మొన్నొకరోజు నువ్వే అన్నావు నాన్నకి కృష్ణవేణిలా అమ్మకి మరొకరు వుంటే సానుభూతితో అర్థం చేసుకోగలవా అని. నిజమే వర్షా! ఒకళ్లని నిందించడం కాదు ఈ సమాజంలో పుట్టి పెరిగిన మనం అవే భావాలని జీర్ణించుకున్నాం. మొదట్నుండీ ఏది చూస్తామో వింటామో అవే అలవాటయిపోతాయి. అందుకు భిన్నమయినవాటిని ఒప్పుకోలేము. నాన్న చేసిన దానికి నేనెందుకు భయపడాలని నువ్వన్నావు. ఇంటికొచ్చిన కోడళ్లలో మంచిని చూడాలి, చూద్దాము అనుకునే అత్తమామలు చాలా అరుదు. లోపాలు వెతికేవాళ్లే ఎక్కువ. ఇందులో నా తప్పేముందని వాళ్లు ఆలోచించరు. ఆయనకి కూతురిగా పుట్టడమే నువ్వు చేసిన తప్పు అనగలరు''

"ఈ లెక్కన బిందు కూడా భయపడాలి. వాళ్ల నాన్నగారు కాస్త ఎక్కువగా తాగుతారని నీకూ తెలుసుగా. రేపు పెళ్లయ్యాక నువ్వొక తాగుబోతు కూతురివి అంటే పాపం అందుకదేం చేయగలదు?" అంది వర్ష.

"మరి నేను చెప్పేది కూడా అదే. మనం చేయని తప్పులకి కూడా మనం తల వంచాల్సి వస్తుంది కొన్నిసార్లు. అంతెందుకు వర్షా! అమ్మ ఒక పక్క బాధపడుతూ కూడా కృష్ణవేణి విషయం ఎవరికి తెలిస్తే ఏం చులకన చేస్తారోనని భయపడుతూంటుంది. ఇలాంటివాటికి ఎందుకని ప్రశ్నిస్తే సమాధానాలు దొరకవు. స్వయంగా మనం చేసే తప్పుల సంగతి సరేసరి. మన మగవాళ్లు చేసే తప్పులకి మనం బాధ్యులం కాకపోయినా ఫలితం మాత్రం మనమీద పడుతూనే వుంటుంది. ఎందుకంటే మనకి మనం గాల్లోంచి రాలేదు. ఫలానా అతడి కూతురు, భార్య, తల్లి, చెల్లి ఇలా ఏదో ఒక మగవాడివల్లే గుర్తింపు వస్తోంది కాబట్టి అది తప్పదు''

"అయితే ఈ మేల్ డామినేషన్ పోదంటావా'' నిట్టూర్చి అంది వర్ష.

"పోతుంది గానీ ఇట్ టేక్స్ సమ్ మోర్ టైం. ఇప్పటికే చాలా మార్పొచ్చింది కదా''

"అవునవును చాలా మార్పొచ్చింది. సతీసహగమనాలు లేవు. మూడేళ్ల పిల్లకి ముప్పయ్యేళ్ల మగవాడినిచ్చి చేసి పసితనంలోనే వైధవ్యం వస్తే గుండు గీయించి, వంటిపూట భోజనం పెట్టడంలేదు. ఇందుకయినా సంతోషించాలి కదూ'' వ్యంగ్యంగా అంది వర్ష.

"అంతేనా, నీకు ఇవి మాత్రమే కనిపిస్తున్నాయా? స్త్రీకి చదువెందుకు అని ప్రశ్నించడం లేదు. ఆడవాళ్లు అన్ని రంగాల్లోనూ ప్రవేశిస్తున్నారు. ఒక రకంగా ఇప్పుడు స్త్రీ స్వతంత్రురాలే''

"ఇదంతా కొద్దోగొప్పో సంస్కారంవున్న కుటుంబాల్లోనే చిత్రా. అమ్మాయిలకి పెద్ద చదువులు అక్కర్లేదనే ఘనులు ఇంకా ఇప్పటికీ అనేకమంది వున్నారు తెలుసా. మనని చదువుకోనిస్తున్నందుకు, ఉద్యోగాలు చేయనిస్తున్నందుకు మనం మురిసిపోవాలన్నమాట. అంటే మనం ఒక అడుగు ముందుకి వేయాలంటే కూడా మగవాళ్ల దయాదాక్షిణ్యాలు

వుండాలి''

చిత్ర మవునంగా వుండిపోయింది.

"అయినా ఈ చదువులూ, ఉద్యోగాలూ ఆడవాళ్లనేం ఉద్ధరిస్తున్నాయి? ఇప్పుడు మరీ రెండు పడవల మీద కాళ్లు పెట్టినట్లుంది. స్త్రీలు ఏ ఉద్యోగాలు వెలగబెట్టినా, ఎన్ని విజయాలు సాధించినా ఇంటిపనీ వంటపనీ తప్పదు. ఇటు ఇంట్లో చాకిరీ, అటు బయటా చాకిరీ..."

"మన పని మనం చేసుకోకపోతే ఎవరు చేస్తారే వర్షా?"

"మన పని మనమే చేసుకోవాలి, నేనేం కాదనను. కానీ ఆ ఇంగితం ఆడామగా ఇద్దరికీ వుండాలి కదా! కలిసి చేసుకుంటే ఎంత హాయిగా వుంటుంది? ఒకరు నియంత, ఇంకొకరు బానిస కాకుండా ఇద్దరూ సమానంగా వుంటే''

"అబ్బ బయల్దేరింది లేడీ లెనిన్. మాట్లాడ్తే బానిసలంటావు. ఇందులో బానిసత్వమేం లేదు. ఒకరకంగా అలా అని మనని మనం కించపరచుకోవడమే అవుతుంది. ఇంటి పనులు చేయాలంటే కాస్త ఓర్పు ఎక్కువుండాలి. స్త్రీలకి సహజంగా సహనం ఎక్కువ కాబట్టి వంటావార్పు, పిల్లల పెంపకంలాంటివన్నీ వాళ్లు చేస్తేనే సక్రమంగా చేయగలుగుతారు. ఇక ఉద్యోగాలంటావా రెండూ చేయలేం అనుకున్నప్పుడు మానేయాలి'' అందిచిత్ర.

"ఆహాహ ఎంత తేలిగ్గా తేల్చేశావమ్మాయి బోఫోర్స్‌లాంటి సమస్యని. అక్కడికి ఆడవాళ్లంతా సరదాకోసం ఉద్యోగాలు చేస్తున్నట్లు మాట్లాడుతున్నావు."

"చిన్నచిన్న విషయాలకే మనం సమస్యలని పేరు పెట్టి హంగామా చేయకూడదు వర్షా''

"ఉద్యోగం చేయకపోతే స్త్రీలకి ఆర్థిక స్వాతంత్ర్యం ఎక్కడిది?"

"భర్తల సంపాదనలో తమకి భాగముందని భార్యలు పూర్తిగా నమ్మనంతవరకూ పరిస్థితి అలాగే వుంటుంది మరి. ఒక భర్త భార్యని అన్నం పెట్టమనో మరేదో పని చేసిపెట్టమనో ఎంత నిస్సందేహంగా అడుగుతాడో భార్య కూడా తనకి అవసరమైనపుడు డబ్బులు అలాగే అడగాలి. తనేదో యాచిస్తున్న భావన తనే సృష్టించుకోకూడదు''

"భార్యాభర్తలు నిజమయిన స్నేహితుల్లా మెలిగినపుడు పరిస్థితి నువ్వు చెప్పినట్లుంటుంది. కానీ ప్రస్తుతం అలా వుండే అవకాశాలు చాలా తక్కువగా వున్నాయి చిత్రా. నువ్వు హైలీ సొఫిస్టికేటెడ్ ఫామిలీస్‌ని మాత్రం తీసుకుని ఆ ధోరణిలోనే ఆలోచించకు. మామూలు పనులే కాదు ఆఖరికి కాళ్లు నొక్కమని కూడా భర్తలు డిమాండ్ చేయగలరు. కానీ భార్యలు మాత్రం వాళ్ల అవసరాలన్నీ సమకూరుస్తూ కూడా తమకి ఏమయినా కావాలంటే మాత్రం బతిమాలుకోవడం లేదా అడుక్కోవడం చేస్తున్నారు. ముఖ్యంగా డబ్బులు''

"ఆ మాటకొస్తే ఆడవాళ్లు సంపాదిస్తే మాత్రం..."

"అవునవును... ఇందాక నేనదే అన్నాను. ఉద్యోగాలు చేస్తున్నవాళ్లకి ఒరుగుతోందేమీ లేదు. జీతం రాగానే తెచ్చి భర్త చేతుల్లో పెట్టి బస్సు ఛార్జీలకో, ఇతర అవసరాలకో అడిగి తీసుకుంటున్నవాళ్లు ఎంతమందో... తమ జీతాలుగాక భార్యల జీతాలు కూడా తాగుడుకోసం తగలేస్తున్న మహానుభావులూ వున్నారు. ఇవన్నీ ఆలోచిస్తే బుర్రవేడెక్కడం మినహా ప్రయోజనం ఏమీ కన్పించడం లేదు''

"మరి దీన్నిబట్టి ఆడవాళ్ళు ఉద్యోగాలు చేయకపోవడమే మేలన్పిస్తోందికదా! ఇంటిపట్టునే వుండి వంటావార్పూ చేసుకుని కాస్తయినా ప్రశాంతంగా వుండక ఉరుకులు పరుగులు పెట్టడం..."

"మామూలుగా పెళ్ళి కుదిరితే పిచ్చి పోతుందంటారు. నీకుమాత్రం పెళ్ళి కుదరగానే పిచ్చి పట్టుకున్నట్లుంది. ఉద్యోగం చేస్తున్న స్త్రీలలో తొంభైశాతం ఆర్థికంగా అవసరమయ్యే చేస్తున్నారు. వాళ్ళకి ఉద్యోగం చేయడ





మా మానడమా అంటూ ఛాయిస్ లేదు. ఇక మిగిలిన పదిశాతం కాలక్షేపం కోసమో హెూ దాకోసమో చేస్తున్నారనుకో. వాళ్ళుమాత్రం ఉద్యోగం ఎందుకు మానాలి?"

"అంటే ఆడవాళ్ళు ఉద్యోగాలు చేసి మగవాళ్ళు..."

"ఛఛ... నన్ను మరీ అంత అండరెస్టిమేట్ చేయకు. నేను కేవలం స్త్రీల సమానత్వాన్ని కోరుకుంటున్నాను. కానీ పురుషుల అణచివేతను కాదు. ఇద్దరూ ఉద్యోగాలు చేయవలసివస్తే ఇంటిపనులు ఇద్దరూ షేర్ చేసుకుంటే అందులో ఎంత ఆనందం వుంది?! ఒకరు కావడి మోసే బదులు ఇద్దరూ చెరో బిందె పట్టుకుంటే బావుంటుందికదా!"

"వారెవా ఏమి ఉపమానం?" అంటూ చిత్ర చప్పట్లు కొట్టింది.

"ఛఛ చెవిటోళ్ళముందు శంఖం ఊదడం నాదే పొరపాటు. అసలు నీతో ఇలాంటి విషయాలు మాట్లాడ్డం ఎనర్జీ వేస్ట్. సర్లేగానీ నిన్ను భరించబోయే ఆ దురదృష్టవంతుని నామధేయంబేమో సెలవిచ్చితివి కాదు?"

"పేరు చెప్పాలంటే సిగ్గేస్తుంది కదా?"

"పర్లేదు సిగ్గు లేకుండా చెప్పు, సారీ సిగ్గు పడకుండా''

"పవన్'

"అయితే ఇక గాలికి కొట్టుకుపోతావన్నమాట. బంధువులా?"

"ఇప్పటికయితే ఏమీకారు. వాళ్ళ నాన్న, మా నాన్న క్లోజ్‌ఫ్రెండ్స్''

"ఓహెూ అదన్నమాట సంగతి''

"ఆc అదే సంగతి. అంతేగానీ మీ పత్రికల్లో ఒచ్చే కథల్లోలా స్పందనలూ, చింతకాయలూ ఏమీ లేవు. సిగ్గుపడడం, మెలికలు తిరగడం అవన్నీ అసలుంటాయా అన్పించింది''

"థిక్ స్కిన్నయితే అలాంటి స్పర్శలన్నీ తెలియవులే' నవ్వింది వర్ష.

"పోన్లే అదే మంచిది. మరీ థిన్ స్కిన్నయినా ప్రమాదమే''

"అందని ద్రాక్షపళ్ళ సామెతలా ఉంది. అదిసరే మీ కాబోయే అత్తగారి ఇంటి విశేషాలేంటి? కట్నం గట్రా ఉందా?"

"లేకేం, లక్షల్లోనే. అయినా కట్నాన్ని నేనేం తప్పుపట్టను. ఆడవాళ్ళకి ఆస్తిహక్కు లేదు కాబట్టి ఆ రూపంలో ఇస్తారు''

"కానీ మగపిల్లలయితే ఆస్తివుంటే పంచుకుంటారు, లేకుంటే లేదు. మరి ఆడపిల్లల పరిస్థితి అలా లేదే. ఆస్తులు లేకపోయినా కట్నం తెమ్మంటారు. మగపిల్లలకి చిల్లిగవ్వ ఆస్తి లేకపోయినా పెళ్ళిళ్ళవుతున్నాయికానీ అదే ఆడపిల్లల విషయంలో కట్నం ఇవ్వలేకపోతే పెళ్ళిళ్ళు ఆగిపోతున్నాయి''

"నిజమే కానీ ఆడపిల్లలక్కూడా ఆస్థిహక్కు ఒస్తే ఈ పరిస్థితులు చాలావరకు మారతాయి వర్షా!"

"అసలీ హక్కులూ చట్టాలకంటే ముందు మనవాళ్ళ ఆలోచనల్లోనే మార్పు రావాలి. వేళ్ళు పాతుకుపోయిన ఈ ఆచారాల కొమ్మలు నరికితే ఏం లాభం చెప్పు? ఒక కొమ్మ నరికితే దాని స్థానంలో రెండు కొమ్మలు పుట్టుకువస్తాయి. పూర్తి వ్యవస్థలోనే ఎన్నో లోపాలున్నాయి''

"అంటే?"

"స్త్రీలకి ఆస్థిహక్కు వుండాలన్నావు, బాగానే వుంది మరి తల్లిదండ్రుల బాధ్యతమాత్రం స్త్రీలు స్వీకరించరు. వాళ్ళు ఇష్టపడినా వాళ్ళ అత్తింటివాళ్ళు ఒప్పుకోరు. అలాంటప్పుడు ఆస్తిలో వాటా ఎందుకుండాలి?"

"అమ్మాయిలు వాళ్ళ అమ్మానాన్నలని కాకపోయినా అత్తామామల్ని ఎలాగూ చూసుకుంటారుగా. అదయినా బాధ్యత స్వీకరించడమేగా''

"అసలిక్కడే పెద్ద తప్పున్నట్లు నాకన్పిస్తోంది చిత్రా. మగవాళ్ళెలాగూ ఇంటిపనులు చేయరు. పెద్దవాళ్ళ కనీస అవసరాలు చూడాలన్నా కొడుకులు స్వయంగా పట్టించుకోరు,

వాళ్ళ భార్యలు అంటే కోడళ్ళు చేయాలి. ఇంకో ఇంటినుండి ఒచ్చిన పిల్లకి అత్తామామలపట్ల శ్రద్ధాసక్తులు ఉండాలని అయితే వాదించగలం గానీ లేకపోతేమాత్రం ఏం చేయగలం? గుర్రాన్ని చెరువుదగ్గరికి తీసికెళ్ళగలం కానీ నీళ్ళు తాగించగలమా?"

"ఇది మరీ బాగుంది. వేరే ఇంటినుండే ఒచ్చినా భర్తని, భర్తకి సంబంధించిన ఆస్తిపాస్తులన్నిటినీ సొంతమనుకున్నప్పుడు ఆ భర్తని కన్న తల్లిదండ్రులు మాత్రం బరువవుతారా?"

"హక్కులకోసం పోరాడి బాధ్యతలు విస్మరించడం అంటే ఇదే. తల్లిదండ్రుల బాధ్యత ఆడపిల్లలు తీసుకునే వీలుంటే ఇప్పుడున్నంత ధారుణంగా వుండదు వాళ్ళ స్థితి. వాళ్ళ బతుకులు మరీ వీధినపడవు''

చిత్ర నవ్వి "చూడబోతే నువ్వు మొత్తం వ్యవస్థనే తిరగరాసేట్లున్నావు'' అంది.

"ఏం లాభం నీలాంటివాళ్ళకి అది పైశాచీ ప్రాకృతంలా అర్థంకాదాయె'' అంటూ వర్ష కూడా నవ్వేసింది.



"నీకసలు ట్రాఫిక్ రూల్స్ తెలీవు నాన్నమ్మా, అలా దారిలో నిలబడితే నడిచేదెలా చెప్పు'' అంటూ రెండు భుజాలు పట్టుకుని మధుమతిని కాస్త పక్కకి తప్పించే ప్రయత్నం చేసి తను గదిలోకెళ్ళింది బిందు.




మధుమతి బుగ్గలు నొక్కుకుని "ఇది మరీ చోద్యంగా ఉందే! ఏవిటా ఉరుకులూ పరుగులూ ఎవరో పెళ్ళివారొస్తున్నట్లు?!" అంది.

"అరే బలే కనిపెట్టేశావే నాన్నమ్మా, హేట్స్ ఆఫ్ టు యూ. ఇప్పుడొచ్చేది పెళ్ళివారే'' అంది బిందు నవ్వుతూ.

జయలక్ష్మి లోపల వంటింట్లోంచి బిందూని పిలుస్తోంది కానీ మరోలోకంలో ఉన్న బిందూకి ఆ పిలుపు వినిపించలేదు.

"బిందూ ఓ బిందూ, వినిపించడంలేదా'' అంది సింధూ తల్లిని అనుకరించి, దగ్గరగా వచ్చి నిలబడి.

"నా ఇన్షియల్ ఇంకా మారలేదు, మారినా 'ఓ' కాదు''

"నాన్నమ్మోయి, ఇదేదో అనుమానించాల్సిన కేస్‌లానే ఉంది'' అంది సింధు ఫిర్యాదు చేసినట్లు చెప్పి నవ్వుతూ.

"ఏమిటి బిందూ, ఎవరొస్తున్నారో నాకయినా చెప్పవే'' అంది మధుమతి తల ఒక పక్కకి వంచి చెవి చూపుతూ.

"నిజంగా నేను చేసుకోబోయేవాడే నాన్నమ్మా. పేరు కే.విశ్వనాథ్''

"బాలచందర్ అయితే ఇంకా బావుండేది'' సింధు వ్యంగ్యంగా అంది.

"ఛ పోవే. ఇది జోక్ కాదు, ఈ విశ్వనాథ్ వేరే''

"ఈ విశ్వనాథో, డీ విశ్వనాథో నీకే తెలియాలి'' మూతి విరిచింది సింధు.

"'కే' అని చెప్పానా, మళ్ళీ ఇన్షియల్స్ మార్చకు. అదిసరే నాన్నమ్మా నువ్విక్కడే కూర్చుంటావుగా. కేవీ చాలా పొడవుగా ఉంటాడు. గుమ్మందగ్గిరకి రాగానే వంగమని గుర్తు చెయ్యి. నిన్ను చూస్తూ పరధ్యానంగా అలాగే వచ్చేశాడంటే..."

"నాన్నమ్మ కూర్చుంటే ఆ ప్రమాదం ఉండదులే. ఇంకా నన్ను చూస్తే అలా జరగచ్చు'' అంది సింధు.

"నిజమే, బిందూ అందంగా ఉంటుంది. తన చెల్లెలేంటబ్బా మరీ ఇలా ఉంది? అని

ఆలోచనలో పడిపోగలడు'' నవ్వింది బిందు.

"చూడు నాన్నమ్మా, ఏమంటోందో' గోము గా అంది సింధు.

"నీకేం తక్కువే సింధూ!? స్వయంవరం పెట్టించాలేగానీ..."

"ఛ పో నాన్నమ్మా! నీక్కూడా జోకయ్యా ను'' అని మధుమతి మాటలు మధ్యలోనే తుంచేసి అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది సింధు.

"నాన్నమ్మా! ఇంతకీ నమ్మావా లేదా?" అడిగింది బిందు గది సర్దుతూనే.

"ఏ విషయం?" కావాలని అర్థం కానట్లు అడిగింది మధుమతి.

"ఖర్మ... రామాయణం అంతా విని రాము డికి సీతేమవుతుంది అన్నట్లు... ఆ అబ్బాయి నిజంగా వస్తాడిప్పుడు''

"అయితే నన్నేం చేయమంటావు?" మధు మతికి ఇంకా నమ్మకం కుదరలేదు.

"అమ్మకి కాస్త నువ్వు చెప్పవా, ప్లీజ్. నాన్న ఇప్పుడెలాగూ ఇంట్లోలేరు. తర్వాత నెమ్మదిగా చెప్పచ్చు. నువ్వు మంచిదానివి గా'' అంది దగ్గరికొచ్చి గడ్డం పట్టుకుని.

"ఇంతకీ ఎవరతను, ఎవరబ్బాయి?"

'ఇదేవన్నా పల్లెటూరనుకున్నావా, ఎవర బ్బాయిట ఇక్కడందరూ నీకు తెలిసినట్లు. మొత్తానికి చాలా మంచివాడు, బాంకులో కాషియర్‌గా చేస్తున్నాడు''

"మన కులమేనా?" సందేహంగా అడి గింది.

"ఏమో నాన్నమ్మా, ఇంకా ఈ రోజుల్లో కూడా కులాలూ మతాలూ అంటూ... నేనడగ లేదు, ఏ కులమో'' అంది చిరుకోపంగా.

"హవ్వ... అదేంటే కులమైనా తెలీనివాణ్ణి చేసుకుంటావా?"

ఇక తప్పేట్లు లేదని నిర్ణయించుకుని "తెలీ కేం తెలుసు. కానీ అసలీ కులాలంటే నాకు అసహ్యం. అయినా నీకోసం చెప్తున్నాను'' అంటూ కులం చెప్పింది.

విని మధుమతి మౌనంగా వుండిపో యింది.

"అయితే నీవన్నీ పైపై మాటలేనా నాన్న మ్మా, కులానిదేముంది, గుణం మంచిది కావా లిగానీ అంటావుగా ఎప్పుడూ, ఇప్పుడు కులాల గురించి నీకేం ఉపన్యాసం ఇచ్చే మూడ్‌లో లేనుకానీ... నాన్నమ్మా ప్లీజ్ అతనొ చ్చే టైమైంది. కాస్త సేమ్యాలాంటిదేమయినా చేయమని అమ్మకి నువ్వు చెప్పవా, త్వరగా'' అంది.

"ఏమోనమ్మా, ఈ కాలప్పిల్లల్ని అర్థం చేసుకోవడం కష్టం" అంటూ వంటింటివైపు దారితీసింది మధుమతి.

"ఒకప్పుడు మీ నాన్నమ్మా ఇలాగే అను కుని వుంటుందిలే' అని నవ్వి బట్టలు తీసు కుని స్నానానికి పరిగెత్తింది బిందు.

బిందు తల అంటుకుని, టవల్‌తో తుడుచు కుంటూ ఒచ్చేసరికి కేవీ కూర్చుని ఉన్నాడు.

సింధు అతణ్ణి ఎంగేజ్ చేస్తుండగా, మధు మతి నఖశిఖ పర్యంతం గమనిస్తోంది. జయ లక్ష్మి కర్టెన్ పక్కన నిలబడి చాటుమాటుగా చూస్తోంది.

బిందు ఒక్క క్షణం అందర్నీ గమనించి నవ్వుకుంది.

"అరే ఎంతసేపయింది ఒచ్చి మంచినీళ్ళి వ్వనా?" అంది.

కేవీ వద్దన్నట్లు తల అడ్డంగా ఊపి పలక రింపుగా నవ్వాడు.

జయలక్ష్మి చేసైగ చేసి సింధూని పిలి చింది.

సింధు వెళ్ళి ట్రేలో రవ్వకేసరి వున్న బౌల్స్ తీసుకొచ్చి ముందు కేవీకిచ్చి, తర్వాత మిగిలినవారికిచ్చింది.

"అమ్మా! ఒకసారి ఇటురా, నువ్వేంటి తప్పించుకు తిరుగుతున్నావు?" అంటూ కాస్త పెద్దగా పిలిచింది బిందు.

జయలక్ష్మి కొంగు భుజంనిండా కప్పుకుని

ఒచ్చింది.

ఆవిడ రాగానే కేవీ నిలబడి నమస్కరించి కూర్చున్నాడు.

బిందు పెద్దవాళ్ళకి విన్పించకుండా సింధు చెవిలో "ఏక్షన్‌లే" అంది.

జయలక్ష్మికి లోలోపల లక్ష సందేహాలున్నా పైకి ఏం మాట్లాడాలో అర్థంకావడంలేదు.

మర్యాదకోసం "మీరెక్కడుంటారు బాబూ?!" అంది జయలక్ష్మి.

"సనత్‌నగర్ అండీ''

"అబ్బో, చాలా దూరమే'' అంది జయలక్ష్మి.

రెండు నిమిషాలయ్యాక ఆవిడే "మీ ఇంట్లో తెలుసా ఈ విషయం?" అంది.

"ఆc తెలుసండీ! అమ్మానాన్నా నేనేం చెప్పినా కాదనరు. ఇంతకీ మీ ఉద్దేశమేంటి, నాకేం డౌరీ అక్కర్లేదు'' అన్నాడు.

"ఆడవాళ్ళం మేమేం చెప్పగలం బాబూ! బిందూ ముందు చెప్పింది కాదు. వాళ్ళ నాన్నగారు సమయానికి ఇంట్లో లేరు'' అంది జయలక్ష్మి.

కానీ పైకి చెప్పకపోయినా జయలక్ష్మికేకాదు, మధుమతికి కూడా కేవీని చూడగానే సదభిప్రాయం ఏర్పడింది.

"ఏంటి నాన్నమ్మా, నువ్వేం ఇంటర్వ్యూ చేయవా?" అడిగింది బిందు.

"చాల్లే ఊరుకో" సిగ్గుపడింది మధుమతి.

కేవీతోసహా అందరూ నవ్వారు ఆవిడ ఎక్స్‌ప్రెషన్ చూసి.

"అయితే హాలిడే ప్రోగ్రాం ఏమీ లేదా?" కేవీ సింధుని ఉద్దేశించి అన్నాడు.

టాపిక్ మారేసరికి జయలక్ష్మి, మధుమతి కూడా అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

"ఆc ఏముంటుంది నాకేమయినా మా అక్కలా..."

"ఏయ్, ఏయ్... నువ్వు నాకంటే రెండేళ్ళు చిన్నదానివి, అప్పుడే నీకేం తొందరే' అంది బిందు.

"అది సరేగానీ బిందూ! నువ్వు రోజూ స్నానం చేయవా?" అన్నాడు కేవీ.

"ఏయ్ కేవీ. నన్ను ఘోరంగా ఇన్సల్ట్ చేస్తున్నావు''

"మరి రోజూ చేస్తే గంటసేపు ఎందుకు పడ్తుంది?" నవ్వాడు.

"మా అక్క ఒక్కో వెంట్రుకని పట్టుకుని విడివిడిగా క్లీన్ చేస్తుంది తెలుసా? ఇంకా ఈరోజు మీరొస్తున్నారని దయతలచి పాపం త్వరగా వచ్చింది'' అంది సింధు.

"ఓహెూ... మీరిద్దరూ కలిశారా ఇప్పుడు? పార్టీ ఫిరాయించావటే సో ద్రోహీ?" అంది బిందు.

"సో ద్రోహీ అంటే?" అడిగింది సింధు.

"మిత్రద్రోహిలా సోదరిద్రోహీ''

"నీచేత కొత్త డిక్షనరీ రాయించాలి'' వెక్కిరించింది సింధు.

"ఇందాక నామీద కామెంటరీ విన్నాన్లే'' అన్నాడు కేవీ.

"నే మంచిదాన్నే నేనేం అనలేదు'' కంగారుగా అంది సింధు.

"అన్నది నేనేగానీ అది కూడా నవ్వింది కేవీ'' అంది బిందు.

మరో గంటసేపు వుండి వెళ్ళిపోయాడు కేవీ.

తర్వాత ఇంట్లో చాలాసేపు తర్జనభర్జనలు అయ్యాయి.

మధ్యాహ్నం మూడు తర్వాత తండ్రి రావడం గమనించి కేవీ ప్రసక్తి తనముందే తండ్రితో చెప్పడం సిగ్గుగా భావించి నిద్ర నటించింది. కానీ కళ్ళు మూసుకుంటే నిజంగానే నిద్ర పట్టింది బిందుకి.

అయిదున్నరకి లేచేసరికి సింధూ టీకప్పు అందించింది. ఇంట్లో వాతావరణం చాలా ఆహ్లాదకరంగా కనిపించింది. తల్లి, నాన్న







మ్మల ముఖాల్లో అయితే సంతోషం కొట్టొచ్చిన ట్లు కనిపిస్తోంది.

బిందు టీ తాగుతూ మళ్ళీ గదిలోకి వచ్చి టేప్ ఆన్‌చేసింది.

'హమే తుమ్‌సె ప్యార్ కిత్‌నా యె హమ్ నహీ జాన్‌తే
మగర్ జీ నహీ సక్‌తే తుమ్‌హారే బినా...'

టీ సిప్ చేస్తున్నందువల్ల పైకి పాడలేక మౌనంగాఆలకిస్తోంది.

"ఈ పాట పెట్టకపోయినా ఆ సంగతి తెలుస్తూనే ఉందిలే' అంటూ సింధూ టేప్ ఆఫ్‌చేసి "అమ్మావాళ్ళేమంటున్నారో తెలుసా?" అంది.

ఏమిటన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించింది బిందు.

"పెళ్ళిఖర్చులు లెక్కవేస్తున్నారు, అంటే అర్థమైందిగా''

బిందు కాస్త సిగ్గుపడింది.

"ఆంఆం స్టాక్ అయిపోగలదు, ముందు ముందు దాని అవసరం చాలా ఉంటుందను కుంటా''

"ఏయ్, ఊరికే నా బుర్ర తినకు, పోయి సినిమా చూసుకో'

"ఉహూం ఆ సినిమా ఎవరు చూస్తారు? ఇంతకీ షాపింగ్ ఎక్కడక్కా?! నాకు మస్టర్డ్ కలర్ శారీ బావుంటుందా?"

"ఏయ్, పెళ్ళి నీకా నాకా?"

ఇంతలో జయలక్ష్మి, మధుమతి కూడా గదిలోకి వచ్చారు. తిలక్‌మాత్రం టీవీ చూసు కుంటూ ఉండిపోయాడు.

మధుమతే ముందు సంభాషణ ప్రారంభించింది.

"మీ నాన్నతో చెప్పామే అమ్మాయి'' అంది.

బిందుకి తండ్రితో వీళ్ళు ఏమేం చెప్పారో, ఆయనేమన్నారో అంతా తెలుసుకోవాలని కుతూహలంగానే ఉంది. ఏదో పుస్తకం పేజీలు తిరగేస్తూ వినసాగింది.

"అయినా నువ్వు చేసిన పని కూడా ఏమీ బాగాలేదు బిందూ! నువ్వూ పెద్దదానివ య్యావు. నీ పెళ్ళి నువ్వు చేసుకోవాలనుకు న్నావు. సరే కాదనడంలేదు. కానీ ఆ అబ్బా యిని ఇంటికి రమ్మని పిలిచిందానివి ఆ సంగతి మీ నాన్నకి ముందు చెప్పాల్సిన అవసరం లేదా? ఆయనమాత్రం బాధపడరా, ఇదేనా నువ్వు ఆయనకిచ్చే గౌరవం? మీరెంత పెద్దవాళ్ళయినా మాకు పిల్లలేనని మర్చిపోవ ద్దు'' అంది జయలక్ష్మి నిష్ఠూరంగా.

"నాకు అలాంటి ఉద్దేశమేం లేదు. నాన్నకి చెప్పాలంటే భయమేసింది''

"సరే! అయ్యిందేదో అయ్యింది. కట్నకాను కలివ్వడానికి మనచేతిలో దమ్మిడీ లేదు. మీ నాన్నమాత్రం ఇంతకంటే మంచి సంబంధం తెచ్చేవాడా? కాకపోతే మన కులంవాడయితే బాగుండేది. కాకపోయినా ఏం చేస్తాం. పిల్లవా డు చూస్తే బుద్ధిమంతుడిలా ఉన్నాడు. గౌర్న మెంటు ఉద్యోగమూ... ఇంకా పిచ్చి చాదస్తా లెందుకు? కాళ్ళదగ్గరికొచ్చిన బేరం కాశీపోయి నా దొరకదట" అంది మధుమతి.

"ఇంతకీ నాన్న ఏమన్నారు నాన్నమ్మా?"

"వాడసలు నోరు మెదిపితేకదా! కులం పట్టింపే ఉన్నట్లుంది. అన్నీ కలిసొచ్చినప్పుడు దానికోసం సందేహిస్తే ఎలా? ఆc... అయినా ఇలాంటి పెళ్ళిళ్ళు చూసీ చూసీ నా తల పండిపోయింది. ఒకప్పుడు సముద్రం దాటి ఇతరదేశాలకెళ్తే మ్లేచ్ఛులనేవారు''

"ఇప్పుడు మాత్రం ఫారిన్ రిటర్న్డ్ అని గౌరవిస్తున్నారు నాన్నమ్మా! అలాగే ఇతర కులస్తులని చేసుకుంటే కూడా ఇంటర్‌కాస్ట్ మారేజ్ అని ఘనంగా చెప్పుకోవచ్చు తె లుసా?" అంది సింధూ.

"చూడబోతే నువ్వూ ఇలాగే చేసుకునేట్లు న్నావే. పోన్లే కూతుళ్ళయి పుట్టినా మీ దారి మీరే చూసుకుంటే అంతకంటే కావల్సిందే ముంది? ఇంతకీ పెళ్ళెప్పుడంటున్నాడే అబ్బాయి?" అంది మధుమతి.

"అబ్బాయేంటి నాన్నమ్మా అతనికి పే రుంది. విశ్వనాథ్'' అంది బిందు.

"హవ్వ... కాబోయే మొగుణ్ణి పేరుపెట్టి పిలుస్తారా ఆయుఃక్షీణం..."

"వచ్చేతరంవాళ్ళు అరేయ్ ఒరేయ్ అని కూడా అంటారేమో'' అంటూ నవ్వింది సింధు.

"మీరంతా చదువుకుని చెడిపోతున్నారు బొత్తిగా. మగవాణ్ణి ముఖ్యంగా మొగుణ్ణి గౌర వించాలి. మా కాలంలో మొగుడివంక తలెత్తి చూడాలంటేనే భయమేసేది. పల్లెత్తు మాట మాట్లాడేవాళ్ళం కాదు. ఆ రోజులే వేరు. భర్తని గౌరవించకపోయాక ఈ చదువులెందుకు?"

"అబ్బా అష్టోత్తరం వద్దులే నాన్నమ్మా. ఇప్పుడే కులం విషయంలో కాంప్రమైజ్ అయి తే నువ్వు చాలా ప్రోగ్రెసయ్యావులే అనుకున్నా ను. మళ్ళీ ఇంతలోనే హిల్స్ నుండి వేలీలోకి దూకినట్లు మారిపోయావే నాన్నమ్మా'' అంది సింధు.

"ఏయ్ చిన్న పిల్లవి నువ్వు పోయి సినిమా చూసుకో'' అంది జయలక్ష్మి.

"నేనేం చిన్న పిల్లని కాను, ఎయిటీన్ దాటాయి మేజర్ని. సర్లే పెళ్ళి సంగతులు మాట్లాడండి. షాపింగ్ సూపర్ విషన్ మాత్రం నాదే'' అంది సింధు.

"కట్నం లేకపోయినా పెళ్ళి ఖర్చులేం తక్కువవుతాయా? ఎన్ని ఏర్పాట్లు చేసుకో వాలి, అందుకే పెళ్ళిచేసి చూడు, ఇల్లుకట్టి చూడు అంటారు'' అంది మధుమతి.

"ఇదిగోండి నాన్నమ్మా! మీరేం కంగారు పడిపోకండి. కేవీకి నేనంతా చెప్పాను. పెళ్లి గురించి కూడా అంతా మాట్లాడాను. ఇప్పుడు నా పెళ్ళికోసం మీరు అప్పులు చేయడం




నాకేమాత్రం ఇష్టంలేదు. అందుకే ఎలాంటి ఆడంబరాలూ లేకుండా మేం రిజిష్టర్ మారేజ్ చేసుకోవాలనుకున్నాం సింపుల్‌గా బట్టలు కొనడం, చాలా కావల్సిన వాళ్ళని మాత్రం పిలవడం. అంతే ఇంతకు మించి హంగులూ ఆర్భాటాలూ ఏమీ అక్కర్లేదు'' అంది బిందు.

"అయ్యో అదేంటే బిందూ అలా అంటావు? తాడు చాల్లేదని నుయ్యి పూడ్చుకుంటామా? శుభమాని ఇంట్లో మొదటి పెళ్ళి అదీ ఆడపిల్ల పెళ్ళి మరీ తూతూమంత్రంలా జరిపిస్తే లోకం నవ్వదూ?"

"నవ్వితే నవ్వనీ లేకపోతే ఏడవనీ మనకెందుకు? ఎవరి సంగతి వాళ్ళు చూసుకోవడం ముఖ్యం నాన్నమ్మా! ఒకరి కోసం మనం ఆడంబరాలు పోతే మన అప్పులు వాళ్ళు తీరుస్తారా చెప్పు?" అంది బిందు.

"అలా వితండవాదంగా మాట్లాడ్తే నేనేం చెప్తాను? మనం ఒకళ్ళ గురించి అనుకున్నట్లే ఇంకొకళ్ళు మన గురించి అనుకుంటారు. అది లోక సహజం. అందుకే ఒకరి చేత వేలెత్తి చూపించుకునే పనులు చేయకూడదు. అంతే గానీ..."

"అర్థంలేకుండా మాట్లాడకు నాన్నమ్మా. ఒకరు వేలెత్తి చూపడానికి ఇందులో మనం చేస్తున్న తప్పేంటి చెప్పు?! పెళ్ళి ఘనంగా చేసుకోవాలని రూలేం లేదు. అంతా నీలాగే ఎవరేం అనుకుంటారోనని స్తోమతులేకపోయినా డాబూ దర్పం ప్రదర్శిస్తున్నారు. పోనీ మీ మోజు నేనెందుకు కాదనాలి, చేయండి, మీ ఇష్టమొచ్చినంత ఆర్భాటంగా చేయండి సత్య సాయి నిగమాగమం బుక్ చేద్దామా?" ఎంత తమాయించుకున్నా కోపం ఆగలేదు బిందూకి.

"పెద్దవాళ్ళతో మాట్లాడే పద్ధతి అదేనా?" అంది జయలక్ష్మి.

"ఇంకెలా మాట్లాడాలి? పెళ్ళంటే మళ్ళీ మళ్ళీ చేసుకునేది కాదు నిజమే. అయినా మన పరిస్థితి మనమే మర్చిపోతే ఎలా? మొహమాటాలన్నీ పక్కనపెట్టి అతనితో మాట్లాడి అన్నీ సరేనన్పిస్తే సంతోషించక మీరే రివర్స్‌లో మాట్లాడ్తే ఎలా చెప్పండి. అసలిప్పటికే నేనెంత బాధపడ్తున్నానో మీకు తెలీదు. నేను పెళ్ళి చేసుకు వెళ్ళిపోతే నాన్న ఒక్కరి జీతంతో ఇల్లు, వాళ్ళిద్దరి చదువులు..." బిందు స్వరంలో ఆవేదన తొంగిచూసింది.

"రాజులాంటి ఉద్యోగం. పొదుపుచేసి కూడబెడితే ఈ పాటికి ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్ళకీ సరిపడా అయ్యేది. ఆ వేధన తాగుడికి బానిసై పోయాడు. ఎంత డబ్బూ చాలడంలేదు. వచ్చేదంతా దానికే ధారాదత్తం చేస్తున్నాడు'' అంటూ నిట్టూర్చింది మధుమతి.

కొద్దిసేపు అందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

తర్వాత బిందూ "అందుకే నా మాట వినండి. నా పెళ్ళి ఇలా సింపుల్‌గా జరిగిపోనివ్వండి. సింధూ పెళ్ళప్పటికి దానికేకాక తిలక్కి కూడా ఏదో ఒక ఉద్యోగం వస్తుంది. అప్పుడు మీ ఇష్టమొచ్చినంత భారీగా చేద్దురు గాని సరేనా?" అంది ఒప్పించే ధోరణిలో నచ్చచెప్తూ.

వాళ్ళకిక అందులో అభ్యంతరం చెప్పాల్సిందేమీ కన్పించలేదు. వయసులో చిన్నదయినా అంత బాధ్యతాయుతంగా ముందు చూపుతో ఆలోచించడం ఎంతో సంతోషాన్నిచ్చింది. మాటల్లో మెచ్చుకోకపోయినా ప్రశంసాపూర్వకంగా చూసి వెళ్ళిపోయారు.

బిందు ఒక్కతే గదిలో మిగిలింది. మళ్ళీ పాటలు పెట్టుకుని తీయటి కలలు కంటూ వెల్లకిలా పడుకుంది.

తొమ్మిదింటికి తల్లి పిలిస్తే భోజనం చేసింది.

అంతా నిద్రపోతున్నారు. బిందు మాత్రం మంచంమీద పడుకునే పుస్తకం చదవసాగింది. తండ్రి ఇంకా రాలేదనే శంకతో మనసు దానిమీద పూర్తిగా కేంద్రీకరించలేక ఒకటికి రెండుసార్లు చదివిందే చదువుతోంది. రాత్రి పదకొండున్నరకి కాలింగ్ బెల్ మోగితే వెళ్ళి

తలుపు తీసింది.

తూలుకుంటూ లోనికొచ్చిన తండ్రిని చూసి మౌనంగా తప్పుకుని ఆయన బూట్లు విడిచి ఇవతలికొచ్చాక తలుపు గడియపెట్టి వచ్చి డైనింగ్ టేబుల్ దగ్గర నిలబడి, "ఇక ఈయనలో మార్పు రాదా?' అనుకుని నిట్టూర్చింది.

పదిసార్లు పడబోయి, నిలదొక్కుకుని అతికష్టమ్మీద బట్టలు మార్చుకుని హాల్లో కొచ్చాడు జగన్నాథం.

"చేతులు కడుక్కోండి'' అని చెప్పి పళ్ళెం, గ్లాసు కడిగేందుకు వంటింట్లోకెళ్ళింది.

"ఏం జయలక్ష్మిగారప్పుడే పవళించారా?" ముద్దముద్దగా వుంది ఆయన గొంతు.

"అప్పుడే ఏంటి, ఇప్పుడు పదకొండున్నరయింది''

"అవును తల్లీ మీకు పెళ్ళిచేయడమే కాదు ఆఖరికి టైం చూట్టం కూడా తెలీదు ఏం చేద్దాం నా బతుకలా అయిపోయింది'' అకస్మాత్తుగా జగన్నాథం స్వరం బాగా హెచ్చింది.

జయలక్ష్మి ఉలిక్కిపడి లేచి వచ్చింది. ఒక నిమిషం ఆవిడకి అసలేం అర్థంకాలేదు. కలకంటున్నట్లు నిలబడిపోయింది.

"కూతుర్ని సలక్షణంగా పెంచావు కదా! నీ అయ్య ఒక తాగుబోతు, నీకు పెళ్ళి చేయలేడు. ఎవడో ఒకడు కులం తక్కువవాడో తలకుమాసినవాడో దొరికిన వాణ్ణి నువ్వే చేసుకోమ్మా అని పాఠాలు నేర్పి అలసిపోయావా అప్పుడే నిద్రపోతున్నావు. ఇవతల మొగుడనే వాడు ఒకడున్నాడు ఇంకా రాలేదనే దిగులు వీసమెత్తుకూడా లేదు''

జయలక్ష్మి నిద్రమత్తు పూర్తిగా వదిలిపోయింది.

"మీరు తాగాలి, తాగి జాతర చేయాలి, అదే మీ ధ్యేయంలా వుంది. ఈ అర్ధరాత్రి భాగోతాలు చూడకుండా నేనెప్పుడు దాటిపోతానో తెలీడంలేదు. మళ్ళీ తెల్లారి లేచి అందరి ముఖాలూ చూడాలంటే సిగ్గుతో చచ్చిపోతున్నాను''

"మీరెందుకు చచ్చిపోతారు? తల్లీ కూతుళ్ళూ కలసి నన్ను చంపుతున్నారు. నలుగురిలో తలెత్తుకోకుండా చేస్తున్నారు''

"అంత కాని పని అదేం చేసింది. పిల్లవాడు నిక్షేపంగా వున్నాడు. మీరు తపస్సుచేసినా అలాంటి సంబంధం తేలేరు. ఏదో ఒకటి కలిసొచ్చింది, పిల్ల సుఖపడడం ముఖ్యమని దీవిరించకపైపెచ్చు దీనిక్కూడా రభస చేస్తున్నారంటే మిమ్మల్నేం అనాలసలు?"

"అందువుగానే, నీకు బాగా కొమ్ములొచ్చాయి. సంపాదించి పడేస్తుంటే తిని కూర్చుని ఒళ్ళు కొవ్వెక్కింది మీ అందరికి''

"అవునవును మీరు తెచ్చి పడేస్తుంటే భోగభాగ్యాలన్నీ అనుభవిస్తున్నాను. మీరు సంపాదిస్తున్నారు నిజమే. కానీ అందులో సగానికిపైగా మీ వ్యసనాలకే తగలేస్తున్నారు. కానీ నేనో జీతభత్యం లేని వెట్టిచాకిరీ చేస్తున్నాను''

ఏంటీ నువ్వు చేసేది పాతిక రూపాయిలిస్తే పనిమనిషి కూడా చేస్తుంది''

"మరి పనిమనుషులతోనే చేయించుకోకపోయారా నన్నెందుకు చేసుకున్నారు? ఇదిగో చూస్తున్నావుగా బిందూ! ఇంటి చాకిరీ ఎంత చేసినా సంపాదన లేకపోయాక పరిస్థితి ఇలాగే వుంటుంది. ఎప్పుడు కోపమొస్తే అప్పుడు నువ్వు తింటోంది నేనేసే ముష్టేనంటారు. బాగా గుర్తుంచుకో బిందూ, ఉద్యోగం మాత్రం మానేయకు'' అంది జయలక్ష్మి.

జగన్నాథం కొరకొరా చూస్తున్నాడు భార్యని.

"నాన్నా! నేను చేసిన పని మీకు తప్పుగా అన్పిస్తే నన్ననండి. అంతేగానీ ప్రొద్దుటివరకూ అమ్మకేం తెలీదు ఈ సంగతి. ఒకవేళ మీకు ముందుగా చెప్పలేదని కోపమా? ఎలా చెప్పాలో తెలీక భయమేసి చెప్పలేదు నాన్నా. అంతకుమించి మీ దగ్గర దాచాలని కాదు''

"హుం... భయం... ఎంత భయభక్తులు





న్నాయో తెలుస్తూనే వుంది'' వ్యంగ్యంగా తల ఆడించాడు జగన్నాథం.

బిందుకి అంతకంటే ఏం మాట్లాడాలో తెలీలేదు. నెమ్మదిగా భోజనం వడ్డించింది. జగన్నాథం మరో అరగంటపైగా అలాగే తోచీ తోయని వాదనలు చేసి, చివరికి అన్నం కెలికి కాస్త తిని, మిగిలింది వదిలేసి పడుకున్నాడు.

బిందు కానీ జయలక్ష్మి కానీ దాని గురించి పెద్దగా ఆలోచించలేదు. ఇది దాదాపు వాళ్ళ జీవితంలో ఒక భాగమైపోయింది.

ఉదయం బిందు ఆఫీసుకి తయారవు తుండగా తల్లి, "బిందూ! మీ నాన్న వెళ్ళి కలుస్తారట, అతను ఏ బ్రాంచ్‌లో చేస్తాడో, ఫోన్ నంబరూ అదీ రాసివ్వు'' అని చెప్పింది.

"మొదటి పరిచయం... ఎలా మాట్లా డ్తారో'' అని కాస్త సందేహంగా అనిపించినా, అడ్రసు రాసిచ్చి ఆఫీసుకి వెళ్ళిపోయింది బిందు.

★ ★ ★

రిజిష్టర్ ఆఫీసు తతంగం ముగియగానే దేవుడి గుడిలో బిందు మెడలో మూడుముళ్ళు వేశాడు కేవీ. అక్కడే దండలు మార్చుకుని ఇంటికొచ్చారు.

గుడికి ఇద్దరి కుటుంబ సభ్యులూ, ముఖ్య స్నేహితులూ మాత్రం వచ్చారు.

ఇక ఆరోజు రాత్రి చిన్నపాటి రిసెప్షన్ ఏర్పాటు చేశారు. అతి ముఖ్యమయిన వాళ్ళ నుకున్నవారినే పిలిచారు.

ఈ విషయంలో కేవీ తల్లిదండ్రుల సహ కారం గొప్పదనే చెప్పాలి. వాళ్ళు ఎలా చేస్తామన్నా "సరే' అన్నారే తప్ప చిన్నమెత్తు వంక పెట్టలేదు.

మొత్తానికి పెళ్ళి పుట్టినరోజు వేడుకంత నిరాడంబరంగా జరిగిపోయింది.

చిత్ర, వర్ష ముందే అనుకుని బంగారు గాజులు ఒకరు, గొలుసు ఒకరు తీసుకున్నారు బిందు కోసం.

"మీకు మరీ బుద్ధిలేకుండా పోయింది. ఇంత పెద్ద గిఫ్టులిస్తారని ముందే తెలిస్తే అసలు మిమ్మల్ని పిలిచేదాన్నే కాను'' అంది బిందు.

"అవి గోల్డువి కాదే తల్లీ, ఆర్టిఫిషియల్ ఆర్నమెంట్స్'' అంది వర్ష.

"తథాస్తు దేవతలుంటారు జాగ్రత్త' అంది చిత్ర, మాట మాత్రానికే గోల్డు కాస్తా రోల్డుగోల్డ యిపోతుందేమోనని భయపడుతూ.

"ఇదో పిచ్చి మొహం" అంటూ తల కొట్టుకుంది వర్ష.

"ఇది మరీ అన్యాయమండి! పెళ్ళి ఇద్దరికీ కదా! నాక్కూడా పనికొచ్చేట్లు ఏ పర్ఫ్యూమో ప్రెజెంట్ చేయొచ్చుగా'' అన్నాడు కేవీ.

"ఈమధ్య మగవాళ్ళు కూడా చెయిన్ వేసుకుంటున్నారుగా, కాబట్టి నేనిచ్చిన చెయిన్ మీకూ పనికొస్తుందన్నయ్యా'' అంది వర్ష.

చిత్ర నవ్వి వూరుకుంది.

వెళ్ళబోయేముందు "రేపు లంచ్ మా ఇంట్లోనే. వీలయినంత త్వరగా రావాలి. ఏయ్, కొత్త పెళ్ళి కూతురా! నీతో నేనేం వంటలు చేయించనులేగానీ ఉదయానే రా వాలి, సరేనా'' అంది చిత్ర.

"అయితే డిన్నర్ మా ఇంట్లో'' అంది వర్ష.

"ఇదేదో బాగానే వుందే. నా ఫ్రెండ్స్ కూడా చాలామంది పిలిచారు. పెళ్ళి చేసుకుంటే పిలిచి మరీ భోజనాలు పెడతారన్నమాట" అంటూ నవ్వాడు కేవీ.

కేవీ హనీమూన్ వెళ్దామని పట్టుబట్టాడు. బిందు డబ్బు లెక్కలేసి చూసి వృధాఖర్చు, వద్దు పొమ్మంది. కాస్త డబ్బు కూడబెట్టుకుని, జీవితంలో స్థిరపడ్డాక ఎక్కడికయినా, ఎన్నిసా ర్లయినా వెళ్ళొచ్చని బిందూ వాదించింది. కానీ అప్పుడు ఈ చిన్నవయస్సు, చిలిపి కోరికలూ వుండవని కేవీ వెక్కిరింతగా చెప్పా డు. అలా పెళ్ళయిన మూడోరోజే కొత్త దంప తులిద్దరూ ఘర్షణపడ్డారు. మొత్తానికి చివరికి

బిందూనే గెలిచింది కేవీ రాజీకొచ్చాడు.

చాలా కొద్దిరోజుల్లోనే జగన్నాథం కులం సంగతి కూడా మర్చిపోయి కేవీపై గొప్ప ఆత్మీయత పెంచుకున్నాడు. ఆయనకి సొంత కొడుకుకంటే అల్లుడే అభిమానపాత్రుడయ్యాడు.

ఇక మధుమతి, జయలక్ష్మిల సంగతి చెప్పాల్సిందే లేదు. వాళ్ళకి కొండంత సంబరంగా వుంది.

సింధు బావగారిని ఉడికించడానికి రకరకాలు చిట్కాలు చమత్కారాలూ కనిపెట్టసాగింది.

ఎటొచ్చీ తిలక్‌లోనే ఏ భావమూ కనిపించలేదు.

★ ★ ★

వర్ష టీ తాగిన మగ్ పక్కనపెట్టి డైరీ రాయసాగింది.

"బిందు పెళ్ళి చేసుకుని అత్తగారింటికెళ్ళి అప్పుడే రెండు నెలలైపోయింది. ఈరోజు నన్నూ, చిత్రనీ వాళ్ళింటికి భోజనానికి పిలిచింది. మూడు గదులు, వరండా, డైనింగ్‌హాలు, కిచెను, ఈ పొడవు నుంచి, ఆ పొడవు వరకూ పెద్ద బాల్కనీ... బాగుంది. విశాలంగా వున్నంత మాత్రాన ఇంటికి అందం రాదు. ముఖ్యంగా ఇంట్లో వున్న మనుషులని బట్టే కదా ఇంటికి అందమొచ్చేది. బిందూ వాళ్ళ అత్తగారూ, ఆడపడుచూ, మామగారూ కూడా ఎలాంటి దర్పం లేకుండా ఆత్మీయంగా మాట్లాడారు. పూర్వపరిచయాలేమీ లేకపోయి నా ఫొటో ఆల్బమ్‌లూ గట్రా చూపిస్తూ చాలా కలసిపోయి మాట్లాడారు.

నాకదేం బలహీనతో తెలీదుగానీ నచ్చిన విషయాన్ని పదేపదే చెప్తాను. బిందూవాళ్ళ ఆడపడుచు నాకు నిజంగా బాగా నచ్చింది. ఆ మాటే దాంతో అంటే "ఎన్నిసార్లు చెప్తావు? చూడబోతే నన్నొదిలేసి తనే నా ఫ్రెండని చెప్పేట్లున్నావు'' అంది. నేను నవ్వి వూరుకున్నాను.

కానీ బిందుకి నా మీదున్న అభిమానం చూస్తే నిజంగా ఆనందం కలిగింది. చూస్తే తప్ప నేనే గుర్తుపెట్టుకోని నాకు చాలా ఇష్టమయిన ఐటమ్స్ చేసింది. చిత్ర ఒక రకంగా అదృష్టవంతురాలు. దానికి పెద్దగా ఇష్టాలూ, అయిష్టాలూ అంటూ లేవు. అన్నీ తింటుంది.

ఏదేమయినా రుచికరమయిన విందుని మించిన పసందు కేవీ సెన్సాఫ్‌హ్యూమర్. అతి మామూలు మాటల్లోంచి చక్కటి హాస్యాన్ని తీసే అతని చతురతని మెచ్చుకుని తీరాలి. వాళ్ళింట్లో వున్నంతసేపూ చార్లీ చాప్లిన్ సినిమా చూస్తున్నంత హాయిగా వుందంటే తక్కువేగానీ ఎక్కువ మాత్రం కాదు''

డైరీ మూసి కబోర్డ్‌లో పెట్టి, కప్పు తీసికెళ్ళి కడిగింది. అంట్ల గిన్నెలన్నీ సింకులోనే వున్నాయి.

పని మనిషి వచ్చే జాడ కనిపించలేదు. గిరిజ అప్పుడే ఆఫీసునుండి వచ్చి కుర్చీలో కూలబడింది. తల బాగా వెనక్కి వాల్చి కళ్ళు మూసుకుంది.

హర్ష హైపిచ్‌లో పాటలు పెట్టి, వాటికనుగుణంగా స్టెప్పులు వేస్తూ డాన్సు చేస్తున్నాడు గదిలో.

"ఏయ్ హర్షా! ఆ దిక్కుమాలిన పాటలు తీసెయ్. అసలా టేప్‌రికార్డర్ తీసికెళ్ళి చెత్తబుట్టలో పడేస్తే పీడాపోతుంది'' అంటూ గట్టిగా అరిచింది గిరిజ.

ఎప్పుడయినా వర్ష మీదయినా అరుస్తుంది గానీ హర్షని ఏమీ అనదు. అలాంటిది అలా అరిచేసరికి హర్ష బిత్తరపోయి పాటలు ఆపేసి, పుస్తకాలు తీశాడు.

వర్ష తల్లికి టీ కప్పు అందించి "పనిమనిషి రాలేదమ్మా'' అంది.

"ఏం చేస్తాను అది కూడా నా ఖర్మకొద్దీ దొరికింది. నాలుగు రోజులు నోటీసిచ్చి మానేస్తుంది. నాలుగు రోజులు చెప్పకుండా మానేస్తుంది. అదేమంటే అసలే చేయనని బెదిరి




స్తుంది''

"అసలు మాన్పించేసి వేరేవాళ్ళని మాట్లాడరాదూ?"

"పనిమనుషులు అంత తేలిగ్గా దొరుకుతున్నారా? ఈ వెధవుద్యోగం మానేసి నాలుగిళ్ళలో పనిచేసుకుంటే బాగుండేట్లుంది''

"గిన్నెలు నేను తోముతాన్లేగానీ ఈ రోజేంటి మరీ ఇంత లేటైంది, మీ కొలీగ్స్‌తో ఎక్కడికయినా వెళ్ళావా?" అంది వర్ష.

"ఆఁ నా మొహానికి ఎక్కడికయినా వెళ్ళడం కూడానా? నా పక్క సీటు రమణి లాంగ్‌లీవ్ పెట్టింది, దాంతో పని తెమలడం లేదు''

"ఓహో అయితే ఓటీ అన్నమాట"

"గుర్తింపు లేకపోయాక ఏదయితేనేం"

"అసలేమయిందమ్మా, ఈమధ్య చాలా చికాగ్గా వుంటున్నావు?"

"చెప్పడానికేముంది, అంతా నా ఖర్మ''

"ప్చ్... అమ్మా! నీకు డైరీ రాసే అలవాటున్నా బావుండేది. తప్పయితే అయ్యింది, దొంగచాటుగా చదివి నీకొచ్చిన ప్రాబ్లమేంటో తెలుసుకునేదాన్ని'' అంది వర్ష.

"సర్లే... నువ్వు తెలుసుకుని చేసేదేం లేదు గానీ ముందెళ్ళి గిన్నెల సంగతి చూడు. ఈలోపు నేను కాస్త స్నానం చేసొచ్చి వంట చేస్తాను''

వర్ష వంటింట్లోకి వెళ్ళగానే గిరిజ బట్టలు తీసుకుని బాత్‌రూమ్ వేపు నడిచింది.

ఆ తర్వాత వంట, భోజనాలు అయిపోయాక వర్ష ఏదో మేగజైన్ తిరగేస్తూ కూర్చుంది. సామాన్యంగా భోజనాలు కాగానే తల్లి మరుసటిరోజుకి కూరలు తరగడం లాంటి పనులు చేసుకుంటుంది. కానీ ఈ రోజు హాల్లో లైటు ఆర్పేసి గదిలోకెళ్ళి పడుకుంది. తండ్రి ఇంకా రాలేదు.

వర్ష పుస్తకం మూసేసి, తల్లి గదిలోకెళ్ళింది. ఆవిడ కూతురిరాక గమనించలేదు. అటువైపు తిరిగి పడుకుని వుంది.

వర్ష నిశ్శబ్దంగా తల్లి మంచంమీద కూర్చుంది. ఆ అలికిడికి గిరిజ ఉలిక్కిపడి "ఎవరు?" అంది.

ఆవిడ గొంతు మామూలుగా లేదు, ఏడ్చినట్లుంది.

వర్ష కంగారుగా "ఏంటమ్మా, ఏమయింది?" అంది.

గిరిజ కూడా అంతే కంగారుగా "ఏం లేదు తల్నొప్పిగా వుంది. నువ్వేంటి ఇలా వచ్చావు? వెళ్ళి పడుకో, మళ్ళీ ప్రొద్దున్నే లేవాలి'' అంది.

"అమ్మా! నేనేం పసిపిల్లననుకున్నావా? నిన్నిలా వదిలేసి నేనెళ్ళి నిక్షేపంగా పడుకోనా? అసలేమయింది చెప్పు? నీకేమయినా బాధుంటే నాతో చెప్పకూడదా? విని నేనేం చేయలేకపోవచ్చు, కానీ..."

గిరిజ అప్పటివరకూ ఏడ్చిందేమో అప్పటికి మనసు కాస్త కుదుటపడింది. కళ్ళు తుడుచుకుని, గొంతు సవరించుకుని మామూలుగా వుండడానికి ప్రయత్నిస్తూ "ఏం లేదు, ఏదో టెన్షన్ భరించలేక ఏడ్పొచ్చింది'' అంది బలవంతంగా నవ్వుతూ.

"అదే కాస్త క్లియర్‌గా చెప్పు''

"మా ఆఫీసులో సూపరింటెండెంట్ మారాడు కదా?"

"అవును చెప్పావు, రెండు నెలలైనట్లుంది గా, అయితే...?"

"అతనొట్టి కోపిష్టి... దూర్వాసుడు''

వర్ష నవ్వుతూ "అయితే ఏంటి, మీరేం స్కూలుపిల్లలా భయపడడానికి?" అంది.

"చేతిలో కర్రొకటే తక్కువ కానీ మమ్మల్ని స్కూలు పిల్లల్లానే ట్రీట్ చేస్తున్నాడు'' సీలింగ్ వైపు చూస్తూ అంది గిరిజ.

"పిచ్చి అమ్మా! నిన్ను చూస్తే నిజంగా నవ్వొస్తోంది. నువ్వు అమాయకురాలివని తెలుసుగానీ మరీ ఇంత అని తెలీదు. మెత్తగా వుంటే ఎవరయినా నెత్తికెక్కుతారు'' అంటూ పెద్దగా నవ్వింది వర్ష.

"చాల్లే వెళ్ళి పడుకో' విసుక్కుంది గిరిజ.

"నువ్వేనా లేక అందరూ ఇలాగే హడలిపోతున్నారా?"

గిరిజ అందుకు బదులేమీ చెప్పలేదు.

"అబ్బా... నేనీ సస్పెన్స్ భరించలేను. గవర్నమెంట్ ఆఫీసుల్లో పని చేస్తూ నువ్వే ఇంత భయపడుతుంటే ఇక దిక్కూ దివాణంలేని ప్రైవేట్ ఆఫీసులో చేసేవాళ్ళ సంగతేం కావాలి? వాళ్ళకైనీసం జాబ్ సెక్యూరిటీ కూడా లేదు. ముల్లూ, అరిటాకు సామెతలా వుంటుంది వాళ్ళ పరిస్థితి. మీతో పోలిస్తే జీతాలూ తక్కువే' అంది వర్ష మళ్ళీ.

"నిజమే... ప్రైవేట్ ఆఫీసులు మరీ దారుణంగా వుంటాయి. రూపాయిచ్చి రెండు రూపాయిల పని చేయించుకుంటారు. అయితే అక్కడొక సుగుణం కూడా వుంది. పని చేసేవాళ్ళని గుర్తిస్తారు. కానీ గవర్నమెంట్ ఆఫీసుల్లో గాడిదనీ, గుర్రాన్నీ ఒకే చోట కట్టేస్తారు. పని చేసినవాడే చేస్తాడు, చేయనివాడు అసలు చేయడు. కాంటిన్‌చుట్టూ చెక్కర్లు కొడుతూ, అస్తమానం ఆ సెక్షన్‌కో ఈ సెక్షన్‌కో పోయి బాతాఖానీ కొట్టి సీట్లోనే వుండని శాల్తీల గురించి ఎవరూ పట్టించుకోరు. జీతం తీసుకుంటున్నందుకు నిజాయితీగా పని చేద్దాం అనుకునేవాళ్ళమీద తమ జులుం చూపుతారు. అసలు మంచితనమే పెద్ద లోపమేమో అన్పిస్తోంది'' ఆవేదనగా అంది గిరిజ.

"మీ పాత సూపరింటెండెంట్ మంచివాడే కదమ్మా! ట్రాన్స్‌ఫర్ మీద నిన్నగాక మొన్నొచ్చినవాడు ఇతనికేమయింది?"

"అదే చిత్రంగా వుంది. ఇవరయ్యేళ్ళ సర్వీసులో నాకెప్పుడూ ఇలాంటి ఎక్స్‌పీరియన్స్ కాలేదు. ఛఛ... ఆఫీసులో అడుగుపెడుతుంటేనే ఈరోజేం ఫేస్ చేయాలోనని భయం. సాయంత్రం ఆఫీసుగేటు దాటి బయటికొచ్చేదాకా ప్రతిక్షణం టెన్షనే. నువ్వన్నట్లు స్కూలు పిల్లలకంటే అధ్వాన్నంగా వుంది. చదువుకునే రోజుల్లో కూడా ఏనాడూ ఇలా భయపడింది లేదు. చివరాఖరికి రిటైరయ్యే రోజులు ముందుపడుతుంటే..." వాక్యం కూడా పూర్తి చేయలేకపోయింది గిరిజ.

తల్లి ఒక స్నేహితురాలితో చెప్పినట్లు చెప్తుంటే వర్ష రెప్పవేయకుండా వినసాగింది.

గిరిజ కూడా తన చేతులతో పెంచి పెద్ద చేసిన కూతురికి చెప్పేదేంటి అనుకోకుండా చెప్పసాగింది. చల్లగాలికి వర్షించిన మేఘంలా ఆవిడ మనసులో గూడుకట్టుకున్న ఆవేదనంతా మాటలరూపంలో ప్రవహించసాగింది. అదే ఆత్మీయత ప్రత్యేకత. ఈ లోకంలో ఏ వ్యక్తికయినా ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక రూపంలో సుఖదుఃఖాలు కలగడం సహజమే. అయితే అవి పంచుకునే వాళ్ళు లేకపోతేనే జీవితం దుర్భరంగా వుంటుంది. ఆప్తులతో ఆనందం పంచుకుంటే అది మరింత అతిశయిస్తుంది. అదే ఆవేదనయితే హృదయభారం తగ్గుతుంది.

"ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్ ది బెస్ట్ ఇంప్రెషనంటారు. ఆ మాట అన్నిచోట్లా ఏమోగానీ నా విషయంలో మాత్రం అక్షరాలా నిజమయింది. మన ఎదురింటి వింధ్య పెళ్ళయ్యింది చూశావూ అప్పుడు ఆ పనుల హడావిడిలో ఆ రాత్రంతా నిద్రలేక, లీవులు కూడా లేనందువల్ల తప్పనిసరయి ఆఫీసుకెళ్తేనా ఖర్మకొద్దీ ఆరోజు పనికూడా పెద్దగా లేదు. దాంతో కాస్త నిద్రొచ్చిన మాట నిజమే. చేతినిండా పని వుంటే ఎంత స్థైయినయినా, ముందురోజు నిద్రలేకపోయినా కనీసం ఆవిలింత కూడా రాదు. ఎప్పుడూ లేనిది ఆరోజు తీరిక దొరకడం, అది కొత్తగా వచ్చిన ఆ మహానుభావుడి కంటబడటం... అంతా నా దురదృష్టం అనుకోవాలి. మూతలు పడుతున్న కళ్ళు, ఆయన నా ముందు నిలబడి దగ్గిన పొడిదగ్గుకి అల్చిప్పల్లా తెరుచుకున్నాయి. అప్పటికే నేను సిగ్గుతో చచ్చిపోతుంటే చాలా ఇన్సల్టింగ్‌గా మాట్లాడాడు. అందుకతన్ని తప్పుబట్టడం లేదు కూడా, నేను చేసిందే తప్పు కాబట్టి..."

"అదిగో అమ్మా, నిన్ను నువ్వే అంతగా




ప్రొజెక్ట్ చేసుకుంటే ఇతర్లెందుకు చేయరు? ఎప్పుడూ సిన్సియర్‌గా వుండి అలసట వల్ల కాస్త కునుకుపడితే ఏదో మర్డర్ చేసినంతగా బాధపడాల్సిన అవసరం లేదు. ఇక్కడ నువ్వు అమ్మవని నిన్ను సపోర్ట్ చేస్తూ మాట్లాడ్డం లేదు. తెలిసి తప్పు చేయకూడదు నిజమే కానీ..."

"ఇది అన్యాయమే వర్షా! ఆఫీసులు నిద్రపోవడానిక్కాదు. నిజానికి లీవ్ లేకపోయినా ఆరోజు లాస్ ఆఫ్‌పే అయినా నేను ఇంట్లో వుండిపోవాల్సింది. కానీ నన్ను నేను కంట్రోల్ చేసుకోగలను అనుకున్నాను, అక్కడే పొరపాటు జరిగింది'' అంది గిరిజ.

"సర్లే... అయితే మాత్రం తప్పులు చేయని వాళ్ళు అసలీ భూమ్మీదే లేరు. దానికంత అవమానించాల్సిన పని లేదు''

"అవమానించినా అంతటితో ఆ టాపిక్ మర్చిపోతే బాగుండేది. కాని అలా జరగలేదు. ఇప్పటికీ ఆయనకి గుర్తొచ్చినప్పుడల్లా నాకు వినిపించేట్లు నిద్ర మీద లెక్చర్లు, జోకులు. ఒక చిన్న పొరపాటుకి, ఇంతగా అవమానించే మనుషులు వుంటారని అతన్ని చూసేవరకు తెలీదు'' అంది గిరిజ.

వర్ష మునుపెన్నడూ అతన్ని చూడకపోయినా తల్లి చెప్పేదాన్ని బట్టి అమ్రిష్‌పురిలా ఓ రూపాన్ని ఏర్పరచుకోసాగింది.

"అంతేనా, తర్వాత ఇంకేమయినా జరిగిందా'' అడిగింది వర్ష.

"మండే ఎండకి తట్టుకోలేక ఒక బట్టతలవాడు నీడకోసం వేరే చెట్లు లేక తాటి చెట్టు కిందకెళ్తే అప్పుడే తాటికాయ రాలి తలమీద పడిందట. నాపనీ అంతే అయింది. ముందే అతనికి నామీద మంచి ఇంప్రెషన్ కలగలేదంటే దానికితోడు ఒకసారి అతను అరవై అని చెప్పారట, నేను వోచర్‌లో పదహారని రాశాను. అంటే సిక్స్‌టీ అంటే సిక్స్‌టీన్‌లా విన్పించింది. దానికి నా వయసు కూడా చూడకుండా వెకిలిగా "సిక్స్‌టీ అంటే సిక్స్‌టీన్‌గా విన్పించిందా? స్వీట్ సిక్స్‌టీన్‌లోనే ఉండిపోవాలనుకుంటే ఎలా?" అన్నాడు.

"లెఫ్ట్ అండ్ రైట్ ఇచ్చుకోకపోయావా, ఎంత ధైర్యం అలా మాట్లాడ్డానికి?" అంది వర్ష.

"కోపమొచ్చినా అలవికానిచోట ఏం చేయగలం? అతడు నాకంటే పైఅధికారి. ఎదురు మాట్లాడితే ఏ మారుమూల ప్రాంతానికో ట్రాన్స్‌ఫర్ చేయించగలడు. మగవాళ్ళయితే అదో రకం. ఆడవాళ్ళకి అందుకే భయం. ట్రాన్స్‌ఫరయితే ఇప్పుడు ఈ వయసులో ఎక్కడికయినా కష్టమేకదా వెళ్ళడం"

"ఇందులో కూడా సిసలయిన భారతనారివి అనిపించుకున్నావమ్మా. దేనికి ఏం జరుగుతుందోనని ముందే ఏవేవో ఊహించుకుని భయపడితే ఇక అవతలివాళ్ళుహద్దులో ఎలా ఉంటారు? పిరికితనాన్ని వాళ్ళు అలుసుగా తీసుకుంటారు. నీకు చెప్పేంతదాన్ని కాదు గానీ ఎలాంటివాళ్ళతో అలాగే ఉండాలమ్మా'' బాధగా అంది వర్ష.

"అమ్మా! అతను నీ ఆఫీసరయితే కావచ్చు కానీ తనూ ఇంకోళ్లకి సబార్డినేటే కదా! హీ ఈజ్ నాట్ ది సుప్రీమ్. ఒకవేళ అయినా కూడా అంత అణిగుండాల్సిన అవసరం లేదు'' అంది.

తల్లి అందుకేం మాట్లాడలేదు. విని ఊరుకుంది.

"అది సరే అమ్మా నువ్వు మరీ రెస్ట్‌లెస్‌గా ఫీలవుతున్నావు. కొన్నిరోజులు సెలవుపెట్టు, తర్వాత సంగతి చూద్దాం" అంది.

"అర్థం లేకుండా మాట్లాడ్తావేంటి? ఒక పక్క రమణి సెలవు పెడితేనే ఇంత గందరగోళంగా వుంది, ఇక నేనూ పెడితే అయినట్లే. ముందసలు లీవ్ శాంక్షన్ కాదు'' అంది గిరిజ విసుగ్గా.

"మనం ఏ పని చేసినా బాధ్యతగా చేయాలని నేనూ ఒప్పుకుంటాను, కానీ నువ్వు నీ

కొలీగ్ పని కూడా కలిపి చేసినా దానికి మెప్పు లేకపోగా కనీసం గుర్తింపు కూడా లేకపోయాక దానికేమయినా అర్థముందా చెప్పు?" బాధతో నే అలా మాట్లాడింది వర్ష.

"వాళ్ళేంటి గుర్తించేది? నేనేమయినా వాళ ళ్ళని ఉద్ధరిస్తున్నానా? జీతం తీసుకుంటు న్నందుకు నా బాధ్యత నేను నిర్వహిస్తున్నా ను''

"నీకసలు తెలివి లేదు, నేనేమయినా చెప్తే వప్పుకోవు. అంత బాధ్యతగా పని చేసే వ్యక్తి పొరపాటున చేసిన చిన్న తప్పుకి ఘోరంగా అవమానించే రైట్ వాళ్ళకెక్కడుంది? ఏదేమ యినా నువ్వు ప్రస్తుతం చాలా అప్‌సెట్ అయ్యావు. నీకు కొన్నిరోజులయినా విశ్రాంతి అవసరం. నువ్వు ఇంకేం అవునూ కాదు అనద్దు'' అనేసి ఇంక తల్లి మాట్లాడ్డానికి ఆస్కారం ఇవ్వకుండా తను గదిలోకి వెళ్ళిపో యింది వర్ష.

★ ★ ★

వర్ష రాత్రి పడుకునేముందు ఉదయానే లేవాలని ఎంతో అనుకుంది. కానీ అలవాటు ప్రకారం ఆలశ్యంగానే లేచింది. దుప్పటి మడుస్తుండగా రాత్రి తల్లి దీనవదనం కని పించి గిల్టీగా ఫీలయింది. "ఖర్మ, అప్పుడే ఏడయ్యింది. ఈ గడియారానికి ప్రొద్దున్నే పరిగెత్తడమే పని, ఆఫీస్ అవర్స్‌లో మాత్రం నత్తనడక నడుస్తుంది'' అనుకుంది విసుగ్గా. తనమీద తనకే కోపమొచ్చింది.

త్వరగా వెళ్ళి బ్రష్ చేసుకుని, కాఫీ పె ట్టింది.

తల్లి పనిమనిషికి అంట్ల గిన్నెలు వేస్తోంది. రెండ్రోజులకోసారి మానేసే పనిమనిషిని చూస్తే వర్షకి చికాకేసింది. నిన్న ఎందుకు రాలేదని పెదవి వరకూ వచ్చిన మాటని బయటకి రాకుండా అక్కడే వుంచేసింది. మళ్ళీ ఆ పిల్ల ఏం సమాధానం చెప్తే తన కోపం ఎంతవరకూ పోతుందోనని తమాయించుకుంది.

తల్లికి కాఫీ కప్పు అందించి, తనూ తీసు కుంది.

"అమ్మా! నువ్వెళ్ళి పడుకో. నాక్కాస్త పని వుంది. ఇప్పుడే బయటికెళ్ళి వచ్చి వంట చేస్తాను'' అంది వర్ష.

"నువ్వు వంట చేస్తావా? ఈరోజు సూర్యు డు తూర్పునే ఉదయించాడా?" అంది గిరిజ తన పని తను చేసుకుంటూ.

"ఏమో, ఆ సూర్యుడు ఎటు ఉదయించాడో చూసేంత టైమ్ నాకు లేదు'' అని చెప్పులేసు కుని బయటకి దారితీసింది వర్ష.

ఒక అరగంటలో తిరిగొచ్చిన వర్ష "అ మ్మా! నిన్ను నాన్న పిలుస్తున్నారు. ముందు కాఫీ కావాలంటారేమో ఇదిగో కప్పు, ఫ్లాస్కు తీసుకుని నువ్వెళ్ళు, వంట సంగతి నేను చూస్తాను'' అంది.

గిరిజ కూతురిని ఒకసారి చిత్రంగా చూసి అలాగే వెళ్ళింది.

అంతే వర్ష వంటింటి తలుపు లోపల గడియపెట్టుకుని చున్నీ డాన్సర్‌లా క్రాస్‌గా ముడివేసి వంటకి శ్రీకారం చుట్టింది.

నిజానికి తండ్రి ఎవరినీ పిలవలేదు. తల్లిని అక్కణ్ణుంచి తరిమేయడానికి అదో సాకుగా చెప్పింది.

కొద్దిసేపట్లోనే తల్లి వెనక్కొచ్చి వంటింటి తలుపు బాదినా "ఎటూ నేను తలుపు తీయను గానీ నువ్వీలోపు స్నానం చేసి, పూజ చేసుకో, లేదా హాయిగా వెళ్ళి ఓ గంట పడుకో'' అంది వర్ష.

గిరిజ విసుక్కుంటూ వెళ్ళి స్నానం చే సింది.

తల్లి అప్పటికే కుకర్ పెట్టేయడాన కూర, చారు, పచ్చడి చకచకా చేసేసింది వర్ష. అవన్నీ డిషెస్‌లోకి తీసి డైనింగ్ టేబుల్‌మీద సర్ది, తనూ స్నానానికి వెళ్ళింది.

స్నానం చేసొచ్చి టవల్ తీగమీద ఆరేస్తూ- "ఏంటమ్మా, ఇంట్లో ఈ చీరెందుకు, ఎక్కడికె ళ్తున్నావు?" అంది తల్లి దగ్గరికొచ్చి.

"ఇంట్లో వుండేందుకు ఈరోజేం ఆదివార





మా?"

"రాత్రి నేనంతా చెప్తే, మళ్ళీ ప్రొద్దున్నే లేచి ఆఫీసంటావేం? వెళ్ళొళ్ళు, నిన్నూ నన్నూచూసి అందరూ నవ్వుతారు'' అంది.

గిరిజ అయోమయంగా చూసి, "ఎందుకు?" అంది.

"ఈ నందు చివర వుండే మీ కొలీగ్ రాజ్‌గోపాల్‌గారికి చెప్పొచ్చాను, నీకు హైఫీవరనీ, కొన్నిరోజులు రాలేవనీ చెప్పమని''

"ఈ అబద్ధాలు ఎక్కడ నేర్చావే?"

"ఇందులో తప్పేముంది, నిజానికి మెంటల్ స్ట్రెయిన్ అంతకంటే పెద్దది తెలుసా? ఏ డాక్టర్‌నయినా అడుగు, దానికి రెస్టే మందంటారు''

"ఆc ఆc... గొప్ప తెలివితేటలు సంపాదించావులే. నాతో మాట మాత్రం చెప్పకుండా నీ ఇష్టమొచ్చినట్లు చేసేయడమేనా?

ఈరోజు ఇంట్లో కూర్చోగానే సమస్య పరిష్కారమవుతుందా రేపు ఇంకెంత రిస్క్ తీసుకోవాలి?" అంది గిరిజ.

"ఒంట్లో బాలేదంటే వచ్చి పని చేయలేదే అని ఎవరూ అనరు అంతగా అవసరమయితే మన ఎదురింటి డాక్టర్ చేత మెడికల్ సర్టిఫికెట్ రాయించి తీసికెళ్ళి ఇద్దుగాని. సరేగానీ ముందు కాస్త స్ట్రాంగ్‌గా వుండడం నేర్చుకో అమ్మా. నేను అమ్మనై, నువ్వు కూతురయినా బాగుండేది. ఎంత కరేజియస్‌గా వుండాలో నూరిపోసేదాన్ని'' అంటూ గదిలోకెళ్ళింది.

గిరిజ నవ్వి ఊరుకుంది. ఇంతలో దివాకర్ బెడ్ కాఫీ కోసం కేకపెడితే తీసికెళ్ళి ఇచ్చింది.

వర్ష జడ అల్లుకుని, బొట్టు పెట్టుకుని పేపర్ చదువుతూ హాల్లో కూర్చుంది.

"ఇక్కడ కొత్త బ్లేడ్ పెట్టాను, ఎవరు తీశారు?" అంటూ ఒక సింహగర్జన చేశాడు దివాకర్.

"సరిగ్గా చూడండి, ఎక్కడ పెట్టి ఎక్కడ వెతుకుతున్నారో' అంది గిరిజ దగ్గరికెళ్ళి తను కూడా వెతికే ప్రయత్నం చేస్తూ.

"నేనెప్పుడూ ఈ అల్మర్లోనే పెడ్తాను'' అలాగే అరిచి చెప్పాడు.

గిరిజ గుండె వేగంగా కొట్టుకుంటోంది. హడావిడిగా వెతకసాగింది.

"పెట్టిన వస్తువు పెట్టినచోట వుండదు. ఎవరూ తీయకపోతే దానికేం కాళ్ళొచ్చి లేచి వెళ్ళిందా?" దివాకర్ గొంతు ఇంకా ఇంకా పెరుగుతోంది.

వర్షకి చిరాగ్గా అనిపించింది. పేపర్ విసుగ్గా టీపాయ్‌మీద పడేసి లోపలికొచ్చింది.

ఆ క్షణంలో రౌద్రరూపం దాల్చిన తండ్రిని చూస్తే మనసులో దేవినట్లయ్యింది. కోపంగా తారాస్థాయిలో అరుస్తున్న ఆయన స్వరం బొంగురుపోయి, సహించరానిదిగా వుంది.

మనిషి ఉగ్రరూపం ధరిస్తే తనమీద తనకి కంట్రోల్ వుండదు. అందుకే అలాంటపుడు విచక్షణా జ్ఞానం కోల్పోయి అవతలివాళ్ళని ఎంత మాట అనడానికయినా వెనుకాడరు. అలా అవతలివాళ్ళని నొప్పించడమే కాదు, తమమీద విలువ లేకుండా చేసుకుంటారు. నూరు నోములూ నోచి ఒక్క తప్పుతో ఫలితం దక్కనట్లు ముందు సంపాదించుకున్న మంచితనం కూడా పోతుంది. మనిషి కోపంలో ఎంత భయంకరంగా జుగుప్సాకరంగా వుంటాడో ఎవరయినా ఆ క్షణంలో ఫొటో తీసి, టేప్ చేసి తర్వాత చూపిస్తే, వినిపిస్తే సిగ్గు పడగలరు.

"ఎవరు తీస్తారండీ మీ బ్లేడు? దాంతో నేనేం పెన్సిలు చెక్కుకుంటానా కూరగాయలు తరుక్కుంటానా?" అంది గిరిజ.

వర్షకి ఇలాంటపుడే తల్లి ప్రవర్తన నచ్చదు. అవతల తండ్రి రూపాయి ఖరీదుచేయని బ్లేడు కోసం అంత శివతాండవం చేస్తుంటే తను తీయని, అసలు తన జోక్యమే లేని విషయానికి ఎందుకు భయపడ్తుంది? అనుకుని అక్కణ్నుంచి వెళ్ళిపోయింది.

టెర్రస్ మీదికెళ్ళి చలికాలపు ఎండలో

పిట్టగోడమీద కూర్చుంది. కానీ ఆ హాయి అనుభవంలోకి రాలేదు. ఏదో తెలియని ఆవేదన చుట్టుముట్టింది. ఆలోచనలు ముసురుకున్నాయి.

అసలీ స్త్రీ పురుషులమధ్య ఇంత అసమానత్వం ఎందుకుంది? పూర్వంలాగాక ఇప్పుడు స్త్రీలు చదువుకుని, ఉద్యోగాలు చేస్తూ ఇంటా బయటా కూడా కష్టపడుతూ అష్టావధానాలూ, శతావధానాలు అవలీలగా చేస్తున్నా పురుషులకి వారిపట్ల వున్న చులకనభావం పోదా? ఇద్దరూ కలసిమెలసి పనిచేసుకుంటే అందులో ఎంత ఆనందముంటుంది? అది లేకపోగా కనీసం వాళ్ళకి సానుభూతి కూడా లేకపోతే ఎలా?

ఇద్దరూ సమానమేనని ఉపన్యాసాలు వినడం, కథల్లో చదవడమే తప్ప నిజజీవితంలో మాత్రం అది సాధ్యం కాదా? అదో అందమయిన కలగానే మిగిలిపోతుందా?

ఇలా వర్ష ఎడతెరిపి లేని ఆలోచనలతో సతమతమవుతుండగా గిరిజపైకి వచ్చి "ఏంటో దీర్ఘాలోచన?" అంది.

"పిల్లులు ఎలకలతో చెలగాటం మానేసి చెలిమి ఎప్పుడు చేస్తాయా అని ఆలోచిస్తున్నా'' అంది వర్ష.

"నువ్విలా లోకభిన్నమయిన ఆలోచనలే చేస్తావు. ఇంకానయం కాకులు తెల్లగా వుండాలి, ఆకాశం ఆకుపచ్చగా వుండాలి అనకు అందరూ నవ్వుతారు'' అంది తల్లి నవ్వుతూ.

"నవ్విపోనీగాక నాకేటి సిగ్గు అని మా అన్న కృష్ణశాస్త్రి ఎప్పుడో అన్నారు. అయినా పైపై రంగులూ అందాలూ ఎలా వున్నా నాకేం పట్టింపు లేదు. ఎప్పుడూ ఆలోచించేది గుణగణాల గురించే''

"సర్లే నన్ను ఆఫీసు మాన్పించి, నువ్వు మానేసింది ఈ పనికిమాలిన ఆలోచనల కోసమా? టిఫినయినా తినలేదు, కిందికి రా'' అంటూ తల్లి కిందికి దిగుతుంటే వర్ష ఆవిణ్ణి అనుసరించింది.

అప్పటికే హర్ష కూడా కాలేజీకి వెళ్ళిపోయాడు.

వర్ష, గిరిజ ఇద్దరూ ఏకంగా భోజనం చేశారు.

"అమ్మా! నువ్వేలానూ రెడీ అయ్యున్నావు, ఏదయినా సినిమాకి...?"

"జ్వరమని సాకు చెప్పి సినిమాలకీ, షికార్లకీ వెళ్తే ఛఛ..."

"నీ సిన్సియారిటికి మెచ్చితినమ్మా... స్వీకరించు నా బహుమానం" అని ఫ్లవర్‌వాజ్‌లో వున్న ఓ పూవు తీసి నాటకఫక్కీలో ఇచ్చింది వర్ష.

గిరిజ నవ్వు ఆపుకుంటూ కోపంగా చూసింది.

"మరీ నేను పూర్వపు రాణీని కానుగా ఏ చంద్రహారమో ఇవ్వడానికి... కాదమ్మా నీ లీవులు నువ్వు వాడుకుంటున్నావు. రీజన్ ఏదో రాయాలి, ఆరోగ్యం బాలేదంటే అబ్జక్ట్ చేయడానికి వుండదు గనుక అలా చెప్పాను. దీనికి నువ్వేదో తప్పుచేసినట్లు ఫీలవడమెందుకు?" అంది వర్ష.

"అయ్యిందేదో అయ్యింది ఇక ఆ విషయం గురించి వాదోపవాదాలెందుగ్గానీ, నేను పడుకుంటున్నాను, మీ నాన్నొస్తే లేపు'' అంది గిరిజ.

"నువ్వు పడుకుంటే నేను ఇంట్లో వుండేం చేయాలి? తలుపేసుకో నేను బిందూ వాళ్ళింటికెళ్తాను'' అంది.

★ ★ ★

చిత్రని చూసి చాలా కాలమయిందని ఆదివారం ఉదయం భోజనం చేసి వెళ్ళింది వర్ష.

గేటు తీసి లోపలికెళ్ళబోతూ చిత్రని చూసి హడలిపోయింది.

చిత్ర ప్రేతకళతో చర్మం చుట్టిన ఎముకల గూడులా వుంది.

ఒక్క నిమిషం కళ్ళప్పగించి చూసి, "చిత్రా! ఏమైంది?" అంది.





అంతే చిత్ర వర్షని వాటేసుకుని బావురుమని ఏడ్చింది.

చాలాసేపు ఆమె అలా ఏడ్చింది, వర్షకి అయోమయంగా వుంది. "చెప్పు చిత్రా! ఏమైంది, ప్లీజ్ చిత్రా, ఏడవకు'' అంటూ వర్ష అనునయిస్తూంటే చిత్ర నెమ్మదిగా తేరుకుంది.

"అమ్మకి పెరాల్సిస్ వచ్చింది'' అని చెప్పి మళ్ళీ కుమిలికుమిలి ఏడవసాగింది చిత్ర.

వర్షకి ఆమెని ఎలా ఓదార్చాలో తెలియలేదు. తనూ ఆమెతో కలసి కొంతసేపు విలపించింది.

"ఈ విషయం నాకు ఫోను చేసి ఎందుకు చెప్పలేదు?" అని ఆమె అడగలేదు. పెళ్ళో పేరంటమో అయితే అడగొచ్చు కానీ ఇలాంటి సమయాల్లో ఎవరికయినా బుర్రలు సరిగా పనిచేయవు.

జానకిని చూసి వర్ష తట్టుకోలేకపోయింది. ఒక కాలు, ఒక చేయి పట్టు తప్పాయి. ఆవిడ ఎదురుగా నిలబడితే కన్నీళ్ళు సెలయేళ్ళయి ప్రవహించేట్లున్నాయి. పేషెంట్ ముందు ఏడిస్తే వాళ్ళ ధైర్యం ఇంకా సన్నగిల్లుతుందని ఇవతలికొచ్చేసింది.

మహేంద్ర కూడా చిత్రలాగే కళావిహీనంగా వున్నాడు. మగవాళ్ళు బాధపడినా త్వరగా బయటపడి బహిర్గతం చేయరు. ఆయన పైకి ఏడవడం లేదన్న మాటేగానీ అంతర్మథనం వల్ల అంతకంటే కృశించిపోయి వున్నారు.

"అయాం సారీ అంకుల్! నాకసలు తెలీదు ఇలా అయ్యిందని. కాజువల్‌గా చిత్రని చూసెళ్దామని వచ్చాను'' అంది వర్ష ఆగని కన్నీళ్ళతో.

"వూరుకోమ్మా! చెప్పకుండా నీకెలా తెలుస్తుంది'' అంటూ ఆత్మీయంగా తల నిమిరాడు మహేంద్ర.

సరస్వతీ, నారాయణల దగ్గర కూడా చాలాసేపు కూర్చుంది. వర్ష వారికి ఓదార్పు మాటలు చెప్పలేకపోగా ఒకరకంగా వయసులో పెద్దవారు కావడాన వారే ఆమెని ఓదార్చవలసి వచ్చింది.

మధ్యాహ్నం రెండు గంటలకి ఇల్లు చేరింది. ఆమె మనసు మనసులో లేదు. స్వయంగా కళ్ళతో చూసినా అది నిజం కాదేమో కలలా మాయమయితే బాగుండు అన్పించసాగింది. ఆ అవిటిబ్రతుకు ఎంత దారుణమో ఊహించడానికే భయపడింది.

విషయం విని గిరిజ కూడా బాధపడింది.

తల్లిని తీసుకుని మళ్ళీ వెళ్ళింది వర్ష, సాయంత్రం వరకూ వుండి వచ్చారు ఇద్దరూ.

  

మహేంద్ర తిండి తినడం లేదు, గడ్డం గీసుకోవడం లేదు, పదిరోజులకే పిచ్చివాడిలా తయారయ్యాడు.

తల్లీ తండ్రీ పదేపదే బలవంతం చేస్తే కూతురు బ్రతిమిలాడితే వెళ్ళి రెండు మెతుకులు తిన్నాననిపిస్తాడు.

ఏదో గంటా అరగంటా కునికిపాటే తప్ప ఆయనకి నిద్ర కూడా పట్టడం లేదు. ప్రతి నిమిషం కుమిలిపోతున్నాడు.

మహేంద్ర సహజంగా సౌమ్యుడు. వీలయినంతవరకూ ఎవరినీ బాధపెట్టకూడదనుకునే రకం. తనవల్ల ఇతర్లు నొచ్చుకుంటే సహించలేడు. కృష్ణవేణిని తానింకా వాంఛించడం సబబు కాదని ఆయనకు తెలుసు. కానీ అది పెళ్ళయ్యాక చపలచిత్తంతో చేసిన పని కాదు. అసలు కృష్ణవేణితోనే తన పెళ్ళయితే తనకి ఇంత మనోవేదన వుండేది కాదు గదాని ఎన్నోసార్లు అనుకున్నాడు.

మొదట కృష్ణవేణిమీద కోపంతో పెళ్ళిచేసుకోవడాన భార్యని బాగానే చూసుకున్నాడు. కనీసం కృష్ణవేణి మళ్ళీ తన జీవితంలో ప్రవేశించకపోయినా బావుండేది. ఆమె తననే మనసులో నిలుపుకుని పెళ్ళి చేసుకోలేదని తెలిశాక తాను ప్రవరాఖ్యుడిలా చలించకుండా వుండలేకపోయాడు. ఇద్దరికీ శారీరక సంబంధం లేకపోయినా ఆ అపేక్షవల్ల తాను



తరచు బెంగుళూరు వెళ్ళడం తద్వారా జానకిని నొప్పించడం ఇదంతా ఆయనకి మనశ్శాంతి లేకుండా చేస్తూ వచ్చింది.

ఇక ఇప్పుడు జానకికి పక్షవాతం రావడంతో తానే ఈ అనర్థానికి కారకుడేమో పైవాడు ఈ రూపంలో శిక్షిస్తున్నాడేమో అనిపించసాగింది.

"ఇప్పుడు నా కాళ్ళూ చేతులూ కూడా పడిపోయాయి కదా, ఇద్దరూ యదేచ్ఛగా వూరేగండి'' అని జానకి మౌనంగానే తిడ్తున్న భావన కలగసాగింది మహేంద్రకి.

ఈ పదిరోజుల్నుండీ మహేంద్ర ఆఫీసుకి పోవడంలేదు. చిత్ర దగ్గరుండి తల్లి పనులన్నీ చూస్తున్నా ఆమె వేరే పనిలో వుంటే మహేంద్రే చూస్తున్నాడు.

తన భుజం ఆమె చేతికింద మోపి బాత్రూంకి కూడా తీసికెళ్తున్నాడు, నిస్సంకోచంగా.

వర్ష ప్రతిరోజూ ఆఫీసు నుండే ఒకసారి చిత్ర ఇంటికెళ్ళి చూసి తర్వాత ఇంటికి వెళ్తోంది.

మహేంద్రని చూసి వర్ష నిజంగానే చలించిపోయింది. ఆమె అప్పటివరకూ స్త్రీలకు సేవలు చేసే మగవాళ్ళని చూడలేదు.

చిత్ర చెప్పినదాన్నిబట్టి వర్షకి మహేంద్ర పట్ల పెద్దగా సదభిప్రాయం లేదు. పరస్త్రీపై వ్యామోహమున్న వ్యక్తిగానే చూసింది. ఈ క్షణాన ఆయన్ని పూర్తిగా అర్థంచేసుకోవడానికి ప్రయత్నించింది.

★ ★ ★

చిత్రతల్లికొచ్చిన పెరాల్సిస్ హడావిడిలో తన తల్లి ఆఫీస్ టెన్షన్ చిన్న గీతయిపోయింది వర్షకి.

మనిషి తనకి లేదా తనవాళ్లకి కలిగిన ఆపదకాలంలో భూతకాలాన్ని తల్చుకుని భవిష్యత్తుతో పోల్చుకుని దారుణమయిన లోటుగా భావించి భయంకరంగా ఊహించుకుంటాడు. అది ఉద్యోగం ఊడడం కావచ్చు, శరీరంలో ఒక భాగం కోల్పోవడం కావచ్చు లేదా అసలు మనిషే చనిపోవడం కావచ్చు. కానీ ఎంత ఘోరమయిన సంఘటన అయినా, మరింత ఊహాతీతమయిన విపత్తునయినా తట్టుకునే శక్తి మనిషికుంది. అందుకే ఊహించినంత బాధాకరంగా అనుభవముండదు.

అందుకే జానకికి ఒక కాలూ, చేయీ దాదాపు పూర్తిగా సత్తువ కోల్పోయినా అది అనుభవిస్తున్న ఆవిడకీ, చూస్తున్న వ్యక్తులకీ కూడా అలవాటయిపోయింది.

వంటింట్లో కూరకి పోపు పెడుతున్న తల్లి పక్కన నిలబడి ఫ్లాస్కులోంచి కాఫీ ఒంపుకుంటూ "అవునూ మీ బాసుడు ఏవంటున్నాడమ్మా?" అంది వర్ష.

"ఆయనేవంటాడు? కొత్తగా చెప్పేదేముంది?"

"అసలా పెక్యూలియర్ కారెక్టర్‌నోసారి చూడాలనుందమ్మా. బాసైనంతలో అలా హడలగొట్టాలా?"

"అతడే కాదు పవరుంటే నూటికి తొంభై మంది ఇంతే'

"అలా అందరినీ జనరలైజ్ చేయకులేమ్మా. మా బాస్ ఎంత మంచి వ్యక్తో తెలుసా? ఆయనకున్నంత కన్సర్న్, కన్విన్సింగ్ నేచర్ అరుదుగా వుంటుంది. అసలు బాసంటే అలా వుండాలమ్మా. సబార్డినేట్స్ అని తీసిపడేయరు. అవసరమయితే చిన్నవాళ్లు చెప్పినా అది లాజికల్‌గా వుంటే ఒప్పుకుంటారు. అబ్బో ఇలా చెప్పుకుంటే పెద్ద లిస్టవుతుందిలే' అంటూ అక్కణ్ణుంచి వెళ్లిపోయింది వర్ష.

ఆరోజు బిందు ఫోనుచేసి "వర్షా! ఈరోజు ఇంటికి రాగలవా?" అంది.

"అలాగే వస్తాను, ఏవిటో విశేషం?"

"చాలా గొప్ప విశేషం, యూ కాంట్ ఈవెన్ ఇమాజిన్. సనత్‌నగర్ కాదు, సైదాబాద్‌లో వున్నాను'' అని పెట్టేసింది.

వర్ష తల్లి ఆఫీస్కుకి ఫోనుచేసి బిందు ఇంటికి





వెళ్తున్నట్లు, ఆలస్యంగా వస్తాననీ చెప్పింది.

బిందు పలకరింతగా నవ్వింది, మాట్లా డ్తోందిగానీ అందులో కళాకాంతీ లేదు. జయలక్ష్మి, మధుమతి కాసేపు మాట్లాడివెళ్లారు. సింధు టీ తెచ్చి ఇచ్చింది.

"ఏంటీ ఆఫీసుకి పోలేదా, నీరసంగా వున్నావేం?" అంది వర్ష.

"పద పైకెళ్లి మాట్లాడుకుందాం" అంది బిందు.

ఇద్దరూ పైకి వెళ్లారు. పిట్టగోడకి ఆనుకుని నిలబడ్డారు.

కొద్దిసేపటి నిశ్శబ్దం తర్వాత ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా "నేను డైవోర్స్ తీసుకుందామనుకుంటున్నాను'' అంది.

"ఈరోజేం ఏప్రిల్ ఫస్ట్ కాదే?"

"వర్షా! నేను చెప్తోంది నిజం"

బిందు ఎక్స్‌ప్రెషనూ, చెప్పే తీరూ చూస్తే వర్షకి తల తిరిగినంతపనయ్యింది. అసలు వెంటనే మాట్లాడలేకపోయింది.

"అసలు నేనింత తొందరపడి అతన్నెందుకు చేసుకున్నానా అని బాధగా వుంది. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే ఏం లాభం?"

"ఏమయింది బిందూ? నువ్వెందుకిలా మాట్లాడ్తున్నావు? నా మైండంతా బ్లాంక్‌గా వుంది. పెళ్లంటే తమాషాగా వుందా నీకు? ఈ విషయాన్నింత కూల్‌గా ఎలా చెప్పగలుగుతున్నావు?"

బిందు విరక్తిగా నవ్వింది.

"బిందూ! నువ్వు నమ్ముతావో లేదో, 'మేడ్ ఫర్ ఈచదర్' అనేది మీకు మాత్రమే వర్తిస్తుందని ఎన్నోసార్లు అనుకున్నాను. మీరెంతో అన్యోన్యంగా, ఆత్మీయంగా వుంటారనీ భార్యాభర్తలంటే మీలా వుండాలనీ అనుకునేదాన్ని. అసలు నా దృష్టే సోకిందేమో'' అంటున్న వర్ష ప్రతి పలుకులో ఆవేదన వ్యక్తమవుతోంది.

బిందు తను చెప్పాల్సింది అయిపోయింది అన్నట్లు శూన్యంకేసి చూస్తూ మౌనంగా కూర్చుంది.

వర్షకి అసలు కేస్ డీటెయిల్సేమీ తెలీకుండా మంచివాడుగా భావిస్తున్న వ్యక్తికి అర్ధాంతరంగా ఉరిశిక్ష విధించినట్లు అల్టిమేటమ్ ఇస్తే ఎలా వుంటుందో అలా వుంది.

"ఏం జరిగిందో చెప్పు బిందూ, ప్లీజ్"

"అతని ప్రవర్తన నాకు నచ్చడం లేదు''

"కేవీ ఉత్త బోళాశంకరుడిలా మాట్లాడ్తుంటాడు. అతనికసలు డిప్లొమసీ తెలీదు, ఈ మాట నువ్వూ అన్నావు ఇదివరకు. మర్చిపోయావా? అలాంటిది..."

"అవును తెల్లటివన్నీ పాలని నమ్మే స్వభావం మనది. అతడెప్పటికీ అమాయకుడు కాడు, కేవలం అమాయకత్వం నటించి మనని ఫూల్స్‌ని చేశాడు''

"అవన్నీ తర్వాత తేల్చుకుందాంగానీ, ముందు కేవీ చేసిన తప్పేంటో చెప్పు బిందూ!"

"హి ఈజ్ నాటెటాల్ ఫెయిర్. ఏదో చేస్తానని చెప్పి మరేదోచేసి, ఇంకేదో చేశానని చెప్పేరకం"

వర్షకి అప్పటివరకూ వున్న అసహనం, గాబరా అంతా క్షణంలో ఆవిరయిపోయినట్లు అన్పించింది. తేలిగ్గా నవ్వి "అమెరికాలాంటి దేశాల్లో గురక పెడతాడనీ, గొడ్డులా నిద్రపోతాడనీ విడాకులు తీసుకుంటారట, అని వింతగా చెప్పుకునేవాళ్లం. నాగరికత పెరిగిపోతోందికదా, అందులో కూడా వాళ్లకి తీసిపోమని నీలాంటివాళ్ళు నిరూపించాలి మరి'' అంది వర్ష కాస్త వ్యంగ్యంగానే.

"వర్షా! నువ్వేమన్నా నిన్ను తప్పుపట్టను. నీ ప్లేస్‌లో నేనున్నా ఇలాగే మాట్లాడేదాన్ని, అదంతా అతడు కలిగించిన ఇంప్రెషన్ మహిమ. పైపైన చూస్తే అర్థంకాదు'' అంది బిందు.

"ఆc గొప్పేలే, నువ్వే కనిపెట్టావు, గ్రేట్ డిస్కవరీ. 'నీకెప్పుడూ పార్షియాలిటీనే, ఆడవా

ళ్లనే సపోర్ట్ చేస్తావు' అని చిత్ర తిట్టేది. కానీ అది ఎంతమాత్రం నిజంకాదు. తాగి, తన్నే భర్తని వదిలేయకపోతే ఎంత తప్పో నిష్కారణంగా వదిలేస్తాననడం కూడా అంతే తప్పు. నువ్వెంతో తెలివైందానివని ఇన్నాళ్లూ మురిసిపోయాను, ఇంత తెలివితక్కువగా మాట్లాడతావని కలలో కూడా అనుకోలేదు బిందూ! అతను ఫెయిర్ కాదు, అందుకే అతన్నుండి విడిపోదామనుకుంటున్నాను అని చెప్పడానికి నీకు సిగ్గుగా లేదా బిందూ? ఆ మాటకొస్తే ఈ లోకంలో ఎవరూ ఫెయిర్ కాదు. ఆఖరికి జన్మనిచ్చిన తల్లిదండ్రుల దగ్గర కూడా కొన్ని విషయాలు దాస్తాము. అంతమాత్రాన మనం ఫెయిర్ కామా?" వర్ష కోపం, బాధ మిళితం కాగా బిందు బాధపడుతుందేమోనన్న విచక్షణాజ్ఞానం కూడా కోల్పోయి అలా అనేసింది.

"అయిందానికీ, కానిదానికీ అబద్ధమాడే వ్యక్తిని నమ్మేదెలా? నమ్మకం లేని వ్యక్తితో కలిసి బ్రతికేదెలా?" అంది బిందు.

"అతనంత అబద్ధాలు చెప్పి, ఎవరినయినా హత్యలు చేసొస్తున్నాడా?" చికాగ్గా అడిగింది వర్ష.

"అత్యవసర పరిస్థితిలో హత్య చేసినా నిజాయితీగా ఒప్పుకుంటే క్షమించొచ్చు. కానీ ఎంత చిన్న తప్పు అయినా సరే చేసి దొరక్కుండా పారిపోదామని ప్రయత్నించేవాళ్లని క్షమించలేను వర్షా! ఈ విషయంలో నిన్ను నేను కన్విన్స్ చేయలేకపోవచ్చు, కానీ నీకు చెప్పాలన్పించింది, అందుకే చెప్తున్నాను. నువ్వు నన్ను సమర్థించకపోయినా ఫరవాలేదు.

వర్షకి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

ఆ తర్వాత బిందూ కేవీ అబద్ధాలు చెప్పేతీరూ, ఎలా దొరికిపోయాడో, అతనంటే పూర్తి విముఖత ఎలా ఏర్పడిందో విపులంగానే చెప్పింది.

అంతా ఓపిగ్గా విన్న వర్ష "ఇంతకీ ఈ విషయం అమ్మా వాళ్లకి చెప్పావా?" అని అడిగింది.

"లేదు, వాళ్లకెలా చెప్పాలో అర్థంకావడంలేదు. నా పెళ్లయిందని గొప్ప సంతోషంలో వున్నారు. ఈ వార్త చెప్పి వాళ్లని దానికి దూరం చేయాలంటేనే బాధగా వుంది''

వర్ష మౌనంగా నిట్టూర్చింది.

ఇంకొంతసేపు వుండి పొద్దుపోయింది, మళ్లీ కలుస్తానని చెప్పి అన్యమనస్కంగా బయల్దేరింది.

వర్ష ఇంటికొచ్చి స్నానం, భోజనం అయ్యాక డైరీతీసి ఇలా రాసింది.

"పెళ్లయి తిన్నగా సంవత్సరం కాలేదు, అప్పుడే బిందు కేవీనుండి విడిపోవాలని చూస్తోంది. ఆ మాట వినేసరికి ముందు అయోమయంగా అనిపించింది. తర్వాత కోపం, బాధ, చికాకు వగైరా అన్నీ కలిగాయి. ఎంతో తెలివయినవాళ్లు కూడా ఆవేశంలో ఎంత తలతిక్క నిర్ణయాలు తీసుకుంటారో చెప్పాలంటే బిందూనే బెస్ట్ ఎగ్జాంపుల్.

"ఏమో, ఏం జరగనుందో నాకేం అర్థం కావడంలేదు''

వర్ష డైరీ అల్మరలో పెట్టి, పడుకుని కళ్లు మూసుకుంది.



మహేంద్ర పదిహేనురోజులు సెలవు పెట్టిన మీదట ఇక తప్పనిసరయి ఆరోజు ఆఫీసుకి బయల్దేరాడు. వెళ్లగానే ఆపరేటర్ చెప్పింది, అతనికి నాలుగుసార్లు బెంగుళూర్‌నుండి కాల్ వచ్చిందని.






ఎవరో తెలుసు. కనీసం ఏం చెప్పింది- అని కూడా అడగకుండా నిర్లిప్తంగా తల పంకించి తన సీట్‌లోకి వెళ్లిపోయాడు. కొంత సేపయ్యాక కృష్ణవేణి నంబర్ చెప్పి ఆపరేటర్‌ని ట్రంకాల్ బుక్ చేయమని చెప్పాడు.

కృష్ణవేణి లైన్లోకి రాగానే క్లుప్తంగా భార్య విషయం చెప్పి, తనెంత అప్‌సెటయ్యాడో వివరించి, ఆమె క్షేమసమాచారాలు కనుక్కొని ఫోను పెట్టేశాడు.

మహేంద్ర అప్పటికే సాగరాన్ని మధించినట్లు అంతర్మథనం చెందిన తర్వాత కృష్ణవేణి విషయంలో ఒక నిర్ణయానికొచ్చాడు.

ఆరోజు రాత్రి భోజనం కూడా చేసేసి, ఇక తననెవరూ డిస్టర్బ్ చేయరని నమ్మకం కుదిరాక కృష్ణవేణికి ఉత్తరం రాయడం మొదలుపెట్టాడు.

"నా కృష్ణవేణికి...

చిత్రంగా వుందికదూ తెలుగులో రాస్తుంటే. నిజమే, నీకెప్పుడూ ఇంగ్లీషులోనే రాసేవాడిని. అది ఫాషన్ అని ఎప్పుడూ అనుకోకపోయినా అలవాటయిపోయింది. అయితే ఈసారి ఈ ఉత్తరం జానకికి కూడా చూపదలిచాను. అందుకే తెలుగులో రాస్తున్నాను.

బహుశా ఇదే నీకు నేను రాసే చివరి ఉత్తరం అవుతుంది. అర్థాంతరంగా ఇలా చదువుతుంటే నీకు అయోమయంగానే వుంటుంది. ప్రస్తుతం నీ పరిస్థితి నేను అర్థం చేసుకోగలను.

కానీ కృష్ణా! చూపరుల దృష్టిలో వంచకులమై, ఎవరితోనూ చెప్పుకోలేని ఆవేదనతో, అశక్తతతో మన జీవితాలని ఇప్పటికే నరకం చేసుకున్నాము. ఇప్పుడే నా కళ్లు తెరుచుకుంటున్నాయి. ఇదిలా కొనసాగడానికి వీల్లేదు. మనం చేయరాని నేరమేం చేయలేదు. దొంగల్లా, దోషుల్లా నిలబడాల్సిన అవసరంలేదు.

తానొకటి తలిస్తే దైవమొకటి తలిచాడన్న ట్లు నిన్ను చేసుకోవాలనుకుని, జానకి మెడలో తాళికట్టాను. నిజంగా ఆమెలో వంక పెట్టా ల్సిన అంశమంటూ లేదు. నువ్వు మీ నాన్నని ఎదిరించక, నన్ను ఆయన అవమానిస్తుంటే చూస్తూ వూరుకుని పరోక్షంగా నువ్వు కూడా అవమానించావని పట్టుదలకి పోయి పెళ్లి చేసుకున్నాను. అందుకే నిన్ను త్వరగానే మర్చిపోయాను.

కానీ ఎప్పుడయితే నువ్వు నా కారణంగా పెళ్లి చేసుకోకుండా వుండిపోయావని విన్నానో అప్పుడే మళ్ళీ నీ పాత ప్రేమికుడినైపోయాను. ఇది పద్ధతి కాదు సంసారస్థుల లక్షణం కాదని పెద్దలు నిలదీయొచ్చు. నాది తప్పే కావచ్చు, కానీ నేను దేవర్షిని కాను, మామూలు మని షిని.

సరే అదంతా పాత విషయం, ఇన్నాళ్ల సంఘర్షణ తర్వాత ఈరోజు నాకు కొత్త ఆలో చన వచ్చింది.

కృష్ణా! ప్రేమ పేరుతో పెళ్లయిన నన్ను తల్చుకుంటూ, నువ్వు ఒంటరిగా మిగిలిపోవ డంలో అర్థంలేదు. మనిషికి సాంఘిక అవ సరాల కోసమయినా ఒక వ్యక్తితోడు తప్పనిస రిగా కావాలి. లైలామజ్నూ, పార్వతీ, దేవదా సు కథలు చదివి మనం నేర్చుకోవాల్సింది ఒకరు దూరమైతే రెండోవాళ్లు పిచ్చివాళ్లు అవుతారని కాదు, అలా ఎందుక్కావాలని ప్రశ్నించుకోవడం ముఖ్యం. జీవితంలో ప్రేమ లేదా పెళ్లి భాగమే కానీ అదే జీవితం కాదని మనకి తెలిసిన విషయమే.

అందుకే నీకు చెప్పేది, చెప్పాల్సిందీ ఒకటే. నేను నీకు స్నేహితుణ్ణి మాత్రమే. కానీ నా వాడని చెప్పుకోగల వ్యక్తి నీకు కావాలి. అలాంటి నీకు తగిన వ్యక్తిని నేను ఎన్నిక చేశాను. నాపై నీకు నిజంగా అభిమానం, నమ్మకం వుంటే నా నిర్ణయాన్ని అంగీకరి స్తావు. తొందరపడకుండా తీరికగా ఆలో చించు.

కృష్ణా! జీవితంలో అన్నిటికంటే ప్రధాన మైంది నిశ్చింతగా, నిర్భయంగా తిరగగల గడం. అలా చేయలేనినాడు మనిషి ఆనందా న్ని అనుభవించలేడు. ఇది నేను ఎక్కడో చదివింది, విన్నదీ కాదు. అనుభవం నేర్పిన పాఠం. నేను నిన్ను మళ్లీ కలిసినప్పట్నుండీ ఆనందం అనే పదాన్నే మర్చిపోయాను. ఇలా అంటున్నందుకు అపార్థం చేసుకోకు. నీమీదు న్న అభిమానం నీవైపుకు మళ్లించేది. కానీ తప్పు చేస్తున్నానేమో అన్న భావన నన్ను చిత్రహింస పెట్టేది. దీన్ని సెన్సిటివ్‌నెస్ అనొ చ్చో లేదో తెలీదుగానీ ఏం చేసినా ఇతర్లని లక్ష్యపెట్టనివాళ్లే సుఖపడగలరేమో అన్పి స్తోంది.

నువ్వు నామాట కాదనవనే నమ్మకం నా కుంది. నువ్వొక్కసారి హైదరాబాద్ వస్తే అతన్ని కూడా చూసినట్లుంటుంది. వీలయి నంత త్వరగా వస్తావని ఆశిస్తూ...

మహేంద్ర''

ఉత్తరం రాయడం ముగించి మడిచి ఎన్వొ లప్‌లో పెట్టి జానకిని సమీపించాడు మహేంద్ర.

జానకి గోడవైపుకి ఒత్తిగిలి పడుకుంది.

"నిద్రపోతున్నావా జానకీ!?" సౌమ్యంగా అడిగాడు మహేంద్ర.

ఆమె తల అడ్డంగా తిప్పుతూ ఇటు తిరి గింది.

"ఒకసారి ఈ ఉత్తరం చదువు'' అంటూ ట్యూబులైటు వేసి అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

జానకి సంశయంగా తీసుకుని ఆతృతగా, ఆసాంతం చదివింది. ఆ క్షణంలో ఆవిడ మాటలకందని ఆనందాన్ని అనుభవించింది. పోగొట్టుకున్న అమూల్యమయిన వస్తువేదో తిరిగి లభ్యమయిన భావన కలిగింది. ఏడ్చి నా, నవ్వినా కన్నీళ్లే వస్తాయనే మాట నిజంచే స్తూ కళ్ళవెంట నీళ్లొచ్చాయి. అప్పుడామెకి భర్తమీద కొండంత ప్రేమ వెల్లువలా పుట్టుకొ చ్చింది. ఆయన్ని పసిపాపలా ఒడిలో చేర్చు




కుని ఓదార్చాలనీ, ఇన్నాళ్లూ తాను అనుభవించిన నరకయాతన ఆయన సన్నిధిలో చెప్పుకుని తాను కూడా సేదతీరాలని బలంగా అనిపించింది.

జానకి మనోభావాలన్నీ తనకు తెలుసునన్నట్లు మహేంద్ర సిగరెట్ కాల్చుకుని ఒక అరగంటాగి తిరిగి భార్య దగ్గరికొచ్చాడు.

కొన్ని సంవత్సరాల తర్వాత వాళ్లిద్దరూ కల్మషాలన్నీ కన్నీళ్లలో కొట్టుకుపోగా ఆత్మీయంగా మాట్లాడుకున్నారు. మనసులు కలబోసుకున్నారు.

★ ★ ★

వర్ష ఆదివారంరోజు మళ్లీ సైదాబాద్ వెళ్లింది.

ఆరోజు బిందుగాక జయలక్ష్మి, మధుమతి మాత్రమే వున్నారు. సింధు, తిలక్ వాళ్ల పెదనాన్న ఇంటికెళ్లారట. జగన్నాథం కూడా ఇంట్లో లేడు.

ఆడవాళ్లు ముఖ్యంగా పెళ్ళయ్యాక పగటిపూట దాదాపు వంటింట్లోనే గడుపుతారు. వాళ్లకి వంటింటితో వున్న ఎటాచ్‌మెంట్ అలాంటిది. మధుమతి, జయలక్ష్మి వంటింట్లోనే వున్నారు.

ఎప్పుడూ ఎంతో చలాకీగా వుండే బిందు అందుకు పూర్తి భిన్నంగా వుంది. వాళ్లిద్దరూ గదిలో కూర్చున్నారు.

"బిందూ! నువ్వొచ్చాక కేవీ రాలేదా?"

"రెండు సార్లొచ్చాడు''

"ఏమంటున్నాడు? అసలు అతని ఉద్దేశమేంటి?"

"ఇంటికి రమ్మని బ్రతిమిలాడాడు. వాళ్ల అమ్మా వాళ్లకి తెలిస్తే బాగోదని గొడవ"

వర్షకి బిందు చెప్పేతీరు చూస్తే కోపమొచ్చింది. అయినా బయటపడలేదు. ఆమెనెలా కన్విన్స్ చేయాలా అని ఆలోచిస్తోంది.

అవతలివాళ్లు కూడా మనసున్న మనుషులేనని, వాళ్లూ హర్టవుతారని ఆలోచించకపోతే ఎలా? అతనికి తనవాళ్లంటూ వున్నారు. భార్య అతిచిన్న విషయాలకే అలిగి పుట్టింటికొచ్చేస్తే అతను చులకనయిపోతాడు. ఆమెకోసం పరిగెత్తుకొస్తే కూడా భార్యావిధేయుడంటూ గేలిచేస్తారు. ఇందుకు ఎవర్నీ తప్పుపట్టలేం. మన సామాజిక పరిస్థితులలా వున్నాయి. వాటిలో ఆరోగ్యకరమయిన మార్పులు రావాలి నిజమే. కానీ చాలాసార్లు పరిస్థితులు మన చెప్పు చేతల్లోనే వుంటాయి. తెలివిగా ఆలోచించి మనకి అనుకూలంగా మార్చుకోవచ్చు.

నిజానికి కేవీ తరపునించి ఏమీ వినకపోయినా కేవలం బిందు చెప్పిందే వింటున్నా వర్షకి కేవీని తప్పుపట్టాల్సిందేమీ కన్పించలేదు.

"బిందూ! నీ ఎదురుగా నిన్నెప్పుడు మెచ్చుకుని వుండకపోవచ్చు. కానీ మనసులో మాత్రం గొప్పగా భావించేదాన్ని. దేని గురించయినా బాగా ఆలోచిస్తావనీ, మంచి నిర్ణయాలు తీసుకుంటావనీ... కానీ, ఈ ఒక్క విషయంలో మాత్రం నువ్వు తొందరపడుతున్నావు. నిజానికి నువ్వే నాకు దగ్గరిదానివి, కేవీ నిన్నుబట్టి వచ్చినవాడే. అయినాసరే ఇందులో కేవీకంటే నీమీదే కోపమొస్తోంది''

బిందు కాస్త చికాగ్గా చూసింది.

"భార్యా భర్తల్లో ఇద్దరూ నిజాయితీగా వుండాలనీ, ఒకర్నొకరు డామినేట్ చేయకుండా వుండాలనీ నీకంటే ఎక్కువగా చెప్పేదాన్ని. కానీ నిజాయితీ అంటే భార్యని తప్ప తక్కిన వాళ్లని కళ్లెత్తి చూడొద్దనీ, పల్లెత్తి మాటాడొద్దనీ కాదుగా''

"నేనేం అలా అనలేదు..."

"ఎలా అన్నా దాని భావం అలాగే వుంది. ఒకరకంగా నువ్వు మీ ఆయన్నే అనుమానిస్తున్నా ఆ అమ్మాయిలని కూడా అవమానిస్తున్నావు. వాళ్లు, కేవీ ఒకేసారి వెళ్లడం ఏక్సిడెంటల్ కావచ్చు. నువ్వు తొందరపడి మాట అనేస్తే అది నిజం కాకపోతే ఎన్ని క్షమాపణలు కూడా దాన్ని తుడిచేయలేవు''

"నేనంత తెలివితక్కువగా అనుమానించే

వ్యక్తిని కాదు. కాయిన్‌కెప్పుడూ టూ సైడ్స్ వుంటాయి. అసలతని తప్పేం లేదన్నట్లు మాట్లాడ్తావే?"

"బిందూ! రోడ్డుమీద ఎవరయినా హేండ్సమ్‌గా వున్న అబ్బాయి కనిపిస్తే మనం మాత్రం అరే ఎంత బావున్నాడు? అని ముచ్చటగా చూడమా? ఆ మాత్రానికే మననెవరయినా వంకపెట్టి మాట్లాడ్తే ఎంత నొచ్చుకుంటాం? ఒక అందమయిన వస్తువో, మనిషో కనిపిస్తే దాన్ని ప్రశంసాపూర్వకంగా చూడడం మానవ నైజం. ఇంత సహజమయిన విషయాన్ని సంకుచితంగా ఆలోచించడం సరయిన పద్ధతి కాదు. దేనికయినా కొన్ని లిమిట్స్ వుంటాయి. అవి దాటితేనే ప్రమాదం"

బిందు తల వంచుకుని వింటోంది. వర్ష వీలయినంత స్వరం తగ్గించి మాట్లాడుతోంది.

"పోనీ, ఏ అమ్మాయితోనయినా సినిమాకో, షికారుకో వెళ్లాడంటే చెప్పు, అప్పుడు నీకంటే ముందు నేను పోట్లాడతాను''

"ఆc అంత ధైర్యం లేదులే"

వర్షకి నవ్వు ఆగలేదు.

"పిచ్చిబిందూ! చూశావా, నీకూ అతని మీద ఇంకా నమ్మకం ఉంది. లేకపోవడానికి అతను చేసిన నేరాలూ, ఘోరాలూ ఏమున్నాయి గనుక. ఎన్ని చెప్పినా ఆడవాళ్ళంత నిబ్బరంగా మగవాళ్ళు వుండరు. అయినా వాళ్ళు హద్దులు మీరనంతవరకూ మనం కూడా పట్టించుకోకూడదు. మరీ నిన్ను తప్ప ఇంకెవర్నీ చూడొద్దని కళ్ళకి గంతలు కడతావా చెప్పు? అలా చేస్తే పిల్లిని గదిలో పెట్టి కొట్టినట్లవుతుంది. అప్పుడు రిజల్ట్ ఎలా వుంటుందో నీకు తెలుసుకదా! ఇక నాకు పర్మిషన్ ఇస్తే..."

"వెళ్దుగానిలే, తొందరేమిటి?"

"వుంటే నీకే నష్టం. చెవికింద జోరీగలా''

అప్పుడప్పుడే మూడ్‌లోకి వస్తున్న బిందు నవ్వింది.

"హమ్మయ్య, నామీద ఇంతసేపటికి కనికరం కలిగిందా? బిందూ! ఒక్కటి అడుగుతాను, కాదనవుగా''

బిందు ఏమిటన్నట్లు చూసింది.

"నువ్వు సనత్‌నగర్ వెళ్ళాలి, వీలయితే ఈరోజే..."

ఆమె అవునూ కాదూ అనలేదు. బిందు ముందయితే అతనిమీద అలిగి వచ్చేసింది కానీ, నెమ్మదిగా ఆలోచిస్తే తనే తొందరపడినట్లు ఆమెకే అనిపించింది. కానీ అలాని వెంటనే తిరిగి వెళ్ళిపోతే బెట్టు సడలిపోతుందని వెనకాడుతోంది. ఇప్పుడు మరోసారి కేవీ ఒచ్చి బతిమిలాడితే వెళ్ళాలని ఆమె ఉద్దేశం. తనంతట తను వెళ్ళాలంటే బెరుగ్గా ఉంది.

వర్ష కూడా ఆమెలో ఒస్తున్న ఆశించిన మార్పు గమనించి అంతకంటే రెట్టించలేదు.

అప్పుడే బెల్లు మోగితే బిందు వెళ్ళి తలుపు తీసింది. కేవీనే వచ్చాడు

కుర్చీలో కూర్చుంటూ "దేవిగారు ఇంకా శాంతించలేదా?" అంటూ నవ్వాడు.

బిందు దగ్గి, పక్కనే కనిపిస్తున్న గదిలో వర్ష ఉన్నట్లు కనుసైగ చేసి "మంచినీళ్ళు కావాలా?" అంది.

"హలో, బాగున్నారా?" అంటూ ఇవతలకొచ్చింది వర్ష.

"ఆc ఆc... బావున్నాను. మీరొచ్చి ఎంత సేపయింది?" అన్నాడు.

బిందు ఈలోపు నీళ్ళగ్లాసు తెచ్చి అందించింది.

ఇంకో పది నిమిషాలు ఉండి అందరితో చెప్పి బయల్దేరింది వర్ష. వెళ్ళేముందు బిందు దగ్గర మరోసారి మాట తీసుకుంది. ఎవరూ గమనించకుండా అతని వెంట వెళ్తానని ఒప్పుకుంది బిందు.

వర్ష ఆరోజు మళ్ళీ డైరీలో ఇలా రాసింది-

"మొత్తానికి నేను భయపడినట్లు ఏమీ కాలేదు. బిందు నేను క్లాస్ తీసుకున్నందుకే





మారిపోయిందని నేననుకోను. తను సహజంగా తెలివైంది. అందుకే రియలైజ్ అయింది. అందుకయితే నాకు సంతోషంగానే ఉంది.

కానీ... కేవీని చాలారోజుల తర్వాత ఈరోజే చూశాను. పాపం బాగా చిక్కిపోయాడు. మొహం కూడా జీరో వాట్ బల్బ్‌లా కళాకాంతీ లేకుండా ఉంది. మాట్లాడాడన్నమాటేగానీ అందులో రవంత ఉత్సాహం లేదు. అంత సరదామనిషి ఈవేళ కొత్తగా, ఉత్త మొహమాటస్తుడిలా, బెరుకుగా... ప్చ్ ఇంకెలాగో కనిపించాడు. మాటమాటకీ తడుముకుంటున్నట్లు... తిన్నగా నా ముఖంలోకి చూసి మాట్లాడ్డానికి కూడా భయపడుతున్నట్లు అనిపించింది. అతన్నలా చూస్తుంటే చాలా వెలితిగా, అసంతృప్తిగా ఫీలయ్యాను. బిందుమీద ఎంతో కోపమొచ్చింది. తను అతన్ని అంత భయపెడుతోందా...?"

వర్షకి ఇక రాయాలనిపించలేదు. పెన్ను మూసి విసుగ్గా డైరీ మూసేసింది.

★ ★ ★

ఉత్తరాన్ని ఒకటికి పదిసార్లు చదివింది కృష్ణవేణి. ఓ గంటసేపు దేవుడిముందు కూర్చుని ధ్యానం చేసుకుంది. అప్పటికి గుండె తేలికయినట్లు అనిపించింది.

మంచంమీద పడుకుని ఆలోచిస్తోంది.

'నిజమే! నేనూ దొంగలాగే, దోషిలాగే బతుకుతున్నాను. ఇటు ఇరుగూ పొరుగూ, అటు ఆఫీసులో కొలీగ్స్ కూడా గుసగుసలు పోవడం, చెవులు కొరుక్కోవడం తను ఎన్నోసార్లు గమనించింది. కానీ అవన్నీ మహేంద్ర కోసం సహించింది. కారణం మహేంద్రని తను ప్రాణప్రదంగా ఇష్టపడింది. తనేం టీనేజ్‌లో లేదు. నడివయసు వస్తోంది. అయినా చిత్రమేమిటో అతనిమీద ప్రేమ తగ్గడంలేదు. బహుశా అది మోజు కాకపోవడమే అందుకు కారణం కావచ్చు.

మహేంద్రని చూస్తే తనకి పరవశం. అతని మాటలు వింటే అదో గొప్ప అనుభూతి. అతను తననెంత ప్రభావితం చేశాడంటే మరో వ్యక్తిని భర్తగా ఊహించుకోలేకపోయింది. అందుకే ఇలా మిగిలిపోయింది.

తను అంతగా ప్రాణప్రదంగా కొలిచే వ్యక్తి తనకి ఏమీ కాడనే నగ్నసత్యం తనని ఎన్నోసార్లు బాధించింది. ఎవరయినా పరిచయస్థులు ఎదురయినప్పుడు కేవలం ఫ్రెండుగా తప్ప మరోవిధంగా పరిచయం చేయలేదు. అలాంటి అనేక సమయాల్లో తనవాడని చెప్పుకోదగ్గ వ్యక్తి తనకి లేడేమని విలపించింది.

ఒంటరితనంతో విసిగిపోయిన తనకి ఇటీవలికాలంలో పెళ్ళి చేసుకోవాలనే ఆలోచన కూడా రాకపోలేదు. కానీ ఈ వయసులో తననెవరు చేసుకుంటారు అని తనని తనే నిందించుకుంది. కనీసం ఇలాంటి ఆలోచనలు స్నేహితులతో పంచుకోవాలంటే కూడా మొహమాటంగా ఉంటుంది. తానో గొప్ప ప్రేమికురాలిననే భ్రమలో ఉందే తప్ప ఆప్యాయతా, అనురాగం, అండదండలు అన్నీ కోల్పోయింది.

మహేంద్ర చెప్తున్నట్లు ప్రేమకథల్లో ఉన్మత్తులయిపోవడంకాదు ఆదర్శం. అవి చదివి అలా జీవితాలు వ్యర్థం చేసుకోకుండా చైతన్యవంతులు కావాలి.

మహేంద్ర మంచివాడు కాబట్టి తను అవకాశాలు కల్పించినా అతను ఎన్నడూ హద్దులు మీరలేదు. అలాంటి ఉన్నతభావాలు కలవాడు గనుకనే తను ఇంతగా ఆరాధించింది.

కృష్ణవేణి అలా ఆలోచిస్తూనే నిద్రపోయింది.

పొద్దున్నే లేచి అద్దంలో ముఖం చూసుకుంటే తన వయసు తగ్గినట్లు అనిపించింది. అక్కడక్కడ కనిపిస్తున్న తెల్ల వెంట్రుకలని లోనికి దూర్చే ప్రయత్నం చేస్తూ తనలో తనే నవ్వుకుంది.

★ ★ ★

ఆవేళ వర్ష పుట్టినరోజు.

మామూలుగా చిత్ర, బిందూలని పిలవకపో

యినా ఏదో టైంలో కలిసి విష్ చేస్తారు.

అయితే ఈసారి కొంత ఎక్కువసేపు కలిసి గడిపినట్లుంటుందని డిన్నర్‌కి రమ్మని పిలిచింది.

వాళ్ళనే గాక ఈశ్వరీదేవి పట్ల గల ప్రత్యేకాభిమానంతో ఆవిణ్ణి పిలిచినప్పుడు

ఆవిడ పెద్దగా నవ్వి "నీ పెళ్ళికొస్తాలేమ్మా ఇప్పటికొదిలెయ్ నన్ను'' అంది.

"ప్లీజ్ మేడం! అలా అనకండి'' అంది వర్ష.

"ఈ స్థూలకాయాన్ని కదిలించడం కాస్త కష్టమేనమ్మా. పోనీ ఒకపని చేయకూడదూ! రేపు నువ్వూ, నీ స్నేహితులూ ఇక్కడికే వచ్చేయండి. నీ పుట్టినరోజు సందర్భంగా నా వంట రుచి చూద్దురుగాని. తర్వాత కులాసాగా కబుర్లు చెప్పుకుందాం"

ఒక నిమిషం వర్షేం మాట్లాడలేదు.

"ఇలా అయితే నువ్వు విశ్వం పాటలు కూడా వినచ్చు'' అంది మళ్ళీ ఈశ్వరి.

"విశ్వంగారు పాటలు పాడతారా?" అంది వర్ష.

"రేపు విందుగానిలే'

"అయితే తప్పకుండా వస్తాం మేడం"

"ఇప్పుడు నచ్చావు నాకు'' అంది ఈశ్వరి.

తర్వాత చిత్రకి ఫోను చేసి ఆ సంగతి చెప్తే సరే కలిసి వెళ్దాం అంది.

బిందుమాత్రం "ఈశ్వరీదేవిగారితో నాకు అంతగా పరిచయం లేదుకదా, వాళ్ళింటికి రాములే' అని చివరికి సరేనని ఒప్పుకుంది.

★ ★ ★

"మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే'' అంది చిత్ర మ్యూజికల్ గ్రీటింగ్‌కార్డ్ చేతిలోపెట్టి.

వర్ష థాంక్స్ చెప్పి దాన్నందుకుని ఆ సంగీతం వినడంలో లీనమయిపోయింది.

"నే వెళ్ళాక సెల్ అయిపోయేవరకూ విందుగాని ఇప్పుడుమాత్రం కాస్త నా సంగతి చూడు తల్లీ'' అంటూ కార్డు లాక్కుని పక్కన పెట్టేసింది చిత్ర.

"మేటర్ బాగుంది. అవునూ ఈ కార్డొక్కటేనా గిఫ్టులూ గట్రా లేవా? నేనేదో గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్లో ఉన్నానే' అంది వర్ష.

"నీ మొహానికి అవొక్కటే తక్కువ" అంది చిత్ర.

"నా మొహానికేం తక్కువ? 'మిస్ దోమల్‌గుడా' అని బిందూ ఎప్పుడో సర్టిఫికెట్ ఇచ్చింది తెలుసా?"

"ఇంకేం మరి, ఫోటోతోసహా మీ పత్రికలో నే రాసుకోకపోయావా?"

"బాగుంటుందంటావా చిత్రా?" నవ్వాపుకుంటూ అడిగింది.

"బాగోకేం? ఫొటో చూసిన పెళ్ళికాని అబ్బాయిలంతా ఫేంటయి పడిపోతారేమో'' అంటూ నవ్వింది చిత్ర.

ఆవేళ ఆదివారం కూడా కావడాన ఎవరికీ ఇబ్బంది లేకపోయింది.

వాళ్ళిద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటుండగా గిరిజ సేమ్యా బౌల్స్‌లో పెట్టి తెచ్చింది.

ఇంతలో హర్ష వచ్చి కూర్చున్నాడు.

"మంచి కేసెట్ ఏదైనా పెట్టు హర్షా'' అంది వర్ష.

కాసేపు ఆడియోకాసెట్సన్నీ కుళ్ళగించి, చివరికి మాల్గాడి శుభ పాటలు పెట్టాడు.

"ఈమె వాయిస్‌కి మురిసిపోవాల్సిందేగానీ పాటల మీనింగ్‌మాత్రం ఛండాలంగా ఉంటుంది'' అంది చిత్ర.

"నిజమే... కళబతుకు వేశ్యకంటే హీనంగా తయారవుతోంది'' అంది వర్ష.

ఉన్నట్లుండి "చిత్రక్కా నువ్వు గజల్‌కీ కాగజ్ చూశావా?" అన్నాడు.

"అదో సినిమా ఒచ్చిందా?" అంది చిత్ర.

"నేనూ విన్లేదు. ఎందులో ఆడుతోంది?" అంది వర్ష.




"స్మితా థియేటర్లో' అన్నాడు హర్ష.

"అదెక్కడుందిరా బాబూ?" అంది వర్ష.

"ఎల్లో హిల్స్‌లో. మళ్ళీ అవెక్కడ అనకు'' అన్నాడు హర్ష.

"ఓహెూ! రెడ్‌హిల్స్ పక్కనా?" వర్ష వెక్కిరించింది.

"నువ్వూ మాటలు నేర్చావే హర్షా'' అంది చిత్ర.

గొప్ప జోక్ వేశానన్నట్లు సిగ్గుపడుతూ నవ్వాడు హర్ష.

"అయితే బిందూవాళ్ళు డైరెక్టుగా మేడంవాళ్ళింటికే వస్తారా?" అంది చిత్ర.

అవునన్నట్లు తలూపింది వర్ష.

"ఇంతకీ బిందూ ప్రాబ్లం పూర్తిగా సాల్వయినట్లేనా? ఇపుడేమంటోంది?" అంది చిత్ర.

"ప్రస్తుతానికి ఐనట్లే. కానీ చిత్రా! అనుమానం అనేది రాకుండానే వుండాలిగానీ, ఒకసారి వచ్చాక ఇక ఆ తేడా కనిపిస్తూనే ఉంటుంది. ఒకరిమీద ఒకరికి నమ్మకం ఎప్పటికీ పోకూడదు''

"పరవాలేదే నీక్కూడా విషయాలు తెలుస్తున్నాయి''

"తెలీకేం? నేనేం చంటి పాపాయిననుకున్నావా? ఏదేమయినా చిత్రా! బిందూకి ఒకరోజు తీరిగ్గా స్ట్రాంగ్ డోస్ ఇవ్వాలి. కేవీని తోలుబొమ్మనాడించినట్లు ఆడిస్తోందని నా అనుమానం" అంది వర్ష.

"స్త్రీ పక్షపాతివికదా, అందుకు సంతోషించు మరి''

"ఛఛ... ప్రాణస్నేహితులే అర్థంచేసుకోకపోయాక ఈ బతుకెందుకు? ఏ దారమూ లేదే ఉరేసుకుందామంటే'' అంటూ అటూ ఇటూ వెతకసాగింది.

"నిజంగా నువ్వు అంతటి ఘనకార్యం చేయాలేగాని ఎంచక్కా మా ఆంటీకి పెళ్ళి చేసే శ్రమ తప్పిపోతుంది'' అంటూ నవ్వింది చిత్ర.

వర్ష కూడా శృతికలిపింది.

చిత్ర తినడం పూర్తయ్యాక వర్ష ఫ్రిజ్‌లోంచి రెండు థమ్సప్ బాటిల్స్ తెచ్చింది.

"హర్షకి?" ప్రశ్నించింది చిత్ర.

"నాకు కూల్‌డ్రింక్ పడదు'' అనేసి హర్ష వెళ్ళిపోయాడు.

"మగవాళ్ళకి కూల్‌డ్రింక్స్ సరిపోవులే' అంది వర్ష.

మెల్లగా సిప్ చేస్తూ "ఇంతకీ ఆంటీకెలా ఉంది?" అంది.

"బాగానేఉంది. నీకు మొన్నే చెప్పానుకదా, కృష్ణవేణిగారి విషయం సెటిలయిపోయాక అటు నాన్నా, ఇటు అమ్మా కూడా హాయిగా వున్నారు. ఇన్నేళ్ళూ వాళ్ళసలు నవ్వడం మర్చిపోయారు తెలుసా? ఇప్పుడు మళ్ళీ ఇన్నాళ్ళకి ఇల్లు ఇల్లులా ఉంటోంది'' ఈ మాటలు చెప్తున్నప్పుడు చిత్ర కళ్ళు కాంతితో మెరిశాయి.

"ఎప్పుడూ కృష్ణవేణి అనేదానివే?!" అంటూ కళ్ళెగరేసింది వర్ష.

"నిజమే వర్షా! నాకు ఇదివరకు ఆవిడమీద గౌరవం లేదు. కానీ ఆవిణ్ణి చూశాకమాత్రం చాలా అభిమానంగా ఆత్మీయంగా అనిపించింది. అమ్మ కూడా ఎంత మర్యాద చేసిందో తెలుసా? నిజానికి అమ్మకి ఇప్పుడు ఆరోగ్యం బాగోలేదు. అయినా మునుపటితోపోలిస్తే చలాకీగా, సతోషంగా ఉంటోంది. నాన్నలో కూడా ఎంత మార్పొచ్చిందో చెప్పలేను.

"మనిషికి తిండీ, బట్టా ఉన్నంతలో సరిపోదు. హాయిగా, ఆనందంగా ఉండగలగాలి. అయితే ఆ ఆనందం ఒక్కొక్కరికీ ఒక్కొక్కరి వల్ల కరువవుతోంది. సరే ఆంటీవిషయం అలా సాల్వయింది. కానీ చిత్రా, ఏదోవిధంగా ఒక మనిషిమీద ఇంకో మనిషి డామినేషన్ తప్పదా? భార్యని భర్త లేదా భర్తని భార్య, అత్తని కోడలు, లేదా కోడలిని అత్త ఆఫీసులో బాసు...?"

"చివరిదేదో కొత్తగా ఉందే?!" అంది చిత్ర.

వర్ష తన తల్లి భయమూ బెంగలు క్లుప్తంగా వివరించింది.

చిత్ర విని సాలోచనగా తలూపింది.

"ఒకరకంగా ఆధిపత్యం చెలాయించేవాళ్ళ కంటే దాన్ని సహించేవాళ్ళదే తప్పని పిస్తుంది'' అంది వర్ష మళ్ళీ.

"అది అన్నిసార్లూ నిజంకాదు వర్షా! కొన్ని సార్లు పరిస్థితుల ప్రభావం బలంగా ఉంటుంది'' అంది చిత్ర.

"ఏమో బాబూ! నువ్వుమాత్రం మీ ఆయన్నీ, అత్తగార్నీ డామినేట్ చేయకు, నిన్ను చేస్తే ఊరుకోకు'' అంది వర్ష.

"మరి నీ సంగతో?"

"ఇందాకేగా నా మొహం బాగోదన్నావు. నన్నెవరు చేసుకుంటారు?" అంది వర్ష బుంగ మూతి పెట్టి.

"గంతకుతగ్గ బొంత ఎవడో ఒకడు దొరక్కపోతాడా?" అంటూ నవ్వింది చిత్ర.

"నవ్విన నాపచేనే పండుతుందట. నా కోసం ఏ రాకుమారుడో ఒచ్చినప్పుడు నువ్వే మూర్ఛపోతావు''

"వారెవా, ఏమి డ్రీము?" అంది చిత్ర రాగంతీస్తూ.

"ఇక వెళ్దామా మరి?" అంటూ లేచి టేప్ ఆఫ్ చేసింది. లోపలికి వెళ్ళి హర్షని కూడా రమ్మంటే రానన్నాడు. తల్లికి చెప్పి ఇద్దరూ బయల్దేరారు.

ఇద్దరూ వెళ్ళేసరికి ఈశ్వరీదేవి, విశ్వం కబుర్లు చెప్పుకుంటూ గులాబ్‌జాం తింటున్నారు.

"విష్యూ మెనీ హ్యాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే'' అన్నాడు విశ్వం వర్షనుద్దేశించి.

"చాలా థాంక్సండీ. స్వీట్ తీసుకోండి'' అంటూ దారిలో కొన్న కలాకండ్ బాక్స్ మూత తెరిచి పట్టుకుంది.






"థాంక్యూ"

"మేడం మీరూ తీసుకోండి"

"నీ పేరుతో స్వీటు చేసి, ముందు మేమే తిన్నాం. ఏదో పెద్దవాళ్ళమైపోయాంగా" అందావిడ నవ్వుతూ.

"నీసంగతేమోగానీ నన్నుమాత్రం కలపకు. నేనప్పుడే పెద్దవాళ్ళ లిస్టులో చేరను" అన్నాడు విశ్వం.

"ఆయన పదహారేళ్ళ బాలాకుమారుడులేమ్మా. నీకు పుట్టినరోజు శుభాకాంక్షలు. బిందూవాళ్ళేరి?" అంది ఈశ్వరీదేవి.

"వాళ్ళిద్దరూ తిన్నగా ఇక్కడికే వస్తామన్నారు"

"ఏం చిత్రా? ముందు మీ ఇద్దరికే గులాబ్ జాం పెట్టి, టీ ఇస్తాను. తర్వాత వంటలో దిగుదాం"

చిత్ర సరేనన్నట్లు తలూపింది.

వాళ్ళు తింటూండగా ఈశ్వరీదేవి బియ్యం చేటలో పోసి తెచ్చి రాళ్ళు ఏరుతూ మాట్లాడ్తోంది.

విశ్వం "ఇంతకీ మెనూ ఏమిటి?" అంటూ సిగరెట్ ముట్టించాడు.

"ఇప్పటికే ఇంటిదగ్గర స్వీట్, కారా తినొచ్చాం. ఇక్కడ సెకెండ్ కోటా కూడా లాగిస్తున్నాం. ఇంక అన్నమేం తింటాం" అంది వర్ష.

"ఇదిగో ఈ నాజూకులు నాకు గిట్టవు. పుష్టిగా తిండి తినాలి. నిష్ఠగా పని చేయాలి. అది నా సిద్ధాంతం. వంటావార్పూ అయ్యేసరికి మీరు తిన్నది అరిగిపోతుంది. ఇంకా లేదనుకుంటే మా పక్కింటి మేడ పదిసార్లు ఎక్కి దిగండి" అంది ఈశ్వరి.

"అబ్బ వాళ్ళనెందుకు అలా అదరగొడ్తావు? పిల్లలకెప్పుడూ మెల్లగా చెప్పాలి. కండగలవాడే మనిషని గురజాడ చెప్పలా" అన్నాడు విశ్వం.

టీ కూడా తాగేక చెంగుదోపారు. చిత్ర ఆలుగడ్డలు కడిగి, ఉడకబెట్టింది. వర్ష కొబ్బరి తురుముతుంటే విశ్వం గబగబా వచ్చి ఆమె

ను లెమ్మని తను యంత్రంలా చకచకా తురిమేశాడు.

ఈలోపు చిత్ర గోరుచిక్కుడుకాయలు కడిగి తెచ్చింది. వర్ష కత్తిపీట ముందు కూర్చోబో తుంటే వద్దని విశ్వం ఐదారుకాయలు ఒకే సారి పట్టుకుని చకచకా తరగడం చూస్తుంటే వర్షకి వీడియో కాసెట్ ప్లేలో వుంచి, ఎఫ్ఫెఫ్ చేస్తే ఎలా వుంటుందో అలాగే అన్పించింది.

వర్ష ముసిముసిగా నవ్వుతుంటే చిత్ర వచ్చి "ఇదేం బాగాలేదండీ! పిల్లలం మే ముండగా ఈ పనులు మీరు చేయాలా?" అంది.

"అవునండీ, పనులు మాకొదిలేసి, మీరు పాటలు పాడండి ప్లీజ్' అంది వర్ష.

"వర్ష 20 నిమిషాల్లో చేసే పని నేను రెండు నిమిషాల్లో చేయగలను. ఆ టైం సేవ్ చేయడా నికి నేను కోస్తున్నాను. ఇది కాగానే నా పాటలు'' అన్నాడు విశ్వం పని ఆపకుండానే.

ఈశ్వరి పులిహోరకోసం చింతపండు గుజ్జు తీస్తోంది. వర్ష పచ్చడికోసం టొమేటోలు, పచ్చిమిరపకాయలు వేయించసాగింది. చిత్ర కుకర్ రెడీచేస్తోంది.

విశ్వం ముక్కలు తరగడం పూర్తయ్యాక డిష్ చిత్ర చేతికిచ్చి "ఇంకేం చేయాలి?" అన్నాడు.

"పాటలు..." అంది చిత్ర.

ఇక అప్పుడు పడక్కుర్చీలో రిలాక్సింగ్‌గా కూర్చుని పాటలు మొదలుపెట్టాడు విశ్వం.

భక్తి, ప్రేమ, సరదా అనే తారతమ్యం లేకుండా తెలుగు, హిందీ అనే భేదం లేకుండా ఘంటసాల, బాలమురళి, జేసుదాసు, రఫీ, పీబీ శ్రీనివాస్ అనే తేడా లేకుండా తనకి ఇష్టమయిన, శ్రోతలు కోరిన పాటలు పాడాడు.

చిత్ర, వర్షల సంబరానికి అంతేలేదు. కాసెట్లకంటే స్వయంగా పాడుతున్నప్పుడు వింటే కలిగే థ్రిల్ వేరేగా ఉంటుంది. ఆ స్వరమధురిమలకి వారి హృదయాలు పరవశించి, పులకరించాయి.

"సర్, మీరేమాత్రం ట్రై చేసినా ఈపాటికెంతో పేరు ప్రఖ్యాతులొచ్చేవి'' అంది వర్ష.

"నేను శాస్త్రీయ సంగీతం నేర్చుకోలేదు. అందుకే అలాంటి ప్రయత్నాలేమీ చేయలేదు'' అన్నాడు విశ్వం ఎంతో నిరాడంబరంగా.

'ఈ లోకంలో అనేక రంగాల్లో ప్రతిభాపాటవాలుండీ కేవలం శ్రద్ధలేని కారణంగా కొంత మంది, అవకాశం లేక అనేకమంది అనామకంగా ఉండిపోతున్నారు. ముఖ్యంగా మన తెలుగులో అయితే మరీ ఘోరంగా ఒకే ఒక గాయకుడు దాదాపు ఏకచ్ఛత్రాధిపత్యం వహించినట్లు పాడడం చూస్తే కడుపు తరుక్కుపోతుంది. ఆ గాయకుడికి ప్రతిభ లేదనికాదు. కానీ అంతకంటే ప్రతిభ ఉన్నవాళ్ళు కూడా తెలుగు నేలమీద గుర్తింపు లేకుండా ఉండిపోతున్నారు. సంవత్సరాల తరబడి ఒకే స్వరం వింటున్న తెలుగువాళ్ళకి వెరైటీ అక్కర్లేదా?' అనుకుంది వర్ష మనసులో.

మొత్తానికి వాళ్ళకప్పుడు పనిచేస్తున్నామన్న భావనే కలగలేదు. దాదాపు వంటకార్యక్రమం పూర్తవుతుండగా బిందు, కేవీ వచ్చారు.

"నయం తినే టైంకయినా వచ్చావు'' అంది చిత్ర బిందుతో.

అందుకు సమాధానంగా "సారీ మేడం! త్వరగా రావాలనే అనుకున్నాం. మా అత్తయ్యగారికి ఒంట్లో బావుండలేదు. కేవీ డాక్టర్ దగ్గరికి తీసికెళ్ళాడు. అందుకే కాస్త ఆలస్యమయింది'' అంది ఈశ్వరినుద్దేశించి బిందు.

"ఏం ఫరవాలేదు, వచ్చారు అంతేచాలు. అసలు గెస్టులతో చేయించాలనేది నా ఉద్దేశం కాదుగానీ..." అంది ఈశ్వరి.

"మేం గెస్టులం కాము, శిష్యులం" అంది వర్ష.

"అరే, పుట్టినరోజు పాపాయి పనిచేస్తోందే'' అంటూనే పుట్టినరోజు శుభాకాంక్షలు తెలియజేసింది బిందు.

"థాంక్స్‌గానీ మీరెంత మిస్సయ్యారో





మీకు తెలీదు'' అంది వర్ష ఊరిస్తున్నట్లు ముఖంపెట్టి.

బిందు క్వశ్చన్‌మార్క్ ముఖం చూసి విశ్వం పాటలు పాడిన విషయం చెప్పింది చిత్ర.

తర్వాత అంతా కలిసి హాయిగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు.

కేవీ మాట్లాడుతున్నప్పటికీ మొదట్లో కనిపించిన చొరవ కనబడడంలేదు. అప్పటి హాస్యం, నవ్వు లేవు. నవ్విన నవ్వులో కూడా నిస్తేజపు ఛాయలు కనిపిస్తున్నాయి.

"ఏంటండీ, ఇన్ని మాటలే మాట్లాడాలి అంటూ బిందూ ఏమయినా కండిషన్ పెట్టిందా?" అంది వర్ష నవ్వుతూ.

కేవీ కూడా నవ్వుతూ "ముందు ముందు పెడ్తుందేమోగానీ ఇప్పటికయితే అలాంటిదేమీ లేదు'' అన్నాడు.

బిందూ కేవీని చూసి మూతి తిప్పింది.

"ఏమ్మా ఎలా ఉన్నాయి మీ సంసార సరిగమలు?" అంది ఈశ్వరి బిందునుద్దేశించి.

బిందు జవాబుగా చిరునవ్వు నవ్వి ఊరుకుంది.

"త్వరలో చిత్రది కూడా అయిపోతే ఇక మిగిలేది వర్షేనన్నమాట. ఏం వర్షా! నువ్వూ ఎవర్నయినా చూసుకున్నావా?" అంది మళ్ళీ ఆవిడే.

వర్ష తల అడ్డంగా ఊపింది లేదన్నట్లు.

"దానికి సమానత్వం పిచ్చికదా మేడం. ఒక త్రాసులో వేసి తూచి మరీ చేసుకుంటుందేమో'' అంది చిత్ర.

"సోషలిజం, సమానత్వంలాంటి భావాలు నీకు అర్థంకావుగానీ..." అంటూ వర్ష కూడా నవ్వింది.

"అవసలు ఆచరణసాధ్యాలేనా మీరు చెప్పండి మేడం" అంది చిత్ర.

అంత సిల్లీ ప్రశ్నకి జవాబు చెప్పడం అనవసరమన్నట్లుగా ఈశ్వరి నోరు మెదపలేదు.

"అనవసరంగా మేడం మూడ్ పాడుచేయకు. ఎందుకు సాధ్యంకాదూ. అక్షరాలా ఆచరణీయం అవుతుంది. ఏ వ్యవస్థలో మార్పు రావాలన్నా ముందు దానికి బలౌతున్నవాళ్ళు ఎదురుతిరగాలి, పోరాడాలి. అప్పుడే వస్తుంది ఆశించిన మార్పు. అంతే తప్ప మన ప్రయత్నం లేకుండా ఏమీ జరగదు. ఇక్కడ డామినేషన్ని తీసుకున్నా అంతే దానికి ఎవరు గురౌతున్నారో వాళ్ళు కదా వ్యతిరేకించాలి'' అంది వర్ష.

"ఈ విషయంలో ప్రతి ఒక్కరూ ఆత్మవిమర్శ చేసుకోవాలమ్మా. మనమీద ఒకళ్ళు ఆధిపత్యం చెలాయిస్తే మనమెంత బాధపడ్తామో మనం ఇంకొకళ్ళమీద పెత్తనం చేస్తే వాళ్ళూ అలా బాధపడ్తారని గ్రహించాలి ఆ స్పృహ అందరికీ వుండాలి. ఇంక మిగతా ఆర్థికమయిన ఇబ్బందులు, అనారోగ్యం, అలాంటి ఇతర సమస్యలు ఏవీ శాశ్వతమైనవి కానేకావు'' అంది ఈశ్వరీదేవి.

"అప్పుడు ఇంటింటా, ప్రతినోటా నవ్వుల జల్లు కురుస్తుంది. భయాలూ, బెంగలూ, టెన్షన్లూ లేని ఆ నవ్వులో వెన్నెల చల్లదనం, మల్లెల పరిమళం..." అంటూ వర్ష చెపుతుంటే

చిత్ర అందుకుని "ఇది ఏ నవల్లో డైలాగ్ తల్లీ!?" అంటూ వెక్కిరిస్తూ నవ్వింది.

బిందుకి ఆ సంభాషణ విన్నాక ఏదో వెలితిగా అన్పించింది. ఆత్మావలోకనం చేసుకుంటూ ఉండిపోయింది.

భోజనాలు ముగిశాయి. అందరూ వక్కనములుతున్నారు.

రీజనల్ ఫిల్మ్ వస్తుందికదాని విశ్వం వెళ్ళి టీవీ పెట్టాడు. 'బూస్ట్ ఈజ్ ది సీక్రెటాఫ్ మై ఎనర్జీ' అంటూ వస్తున్న ఎడ్వర్టైజ్‌మెంట్ విని-

"స్మైల్ ఈజ్ ది సీక్రెటాఫ్ అవర్ ఎనర్జీ' అంది వర్ష.

అందరూ పెద్దగా నవ్వారు.



# 'పయనం'పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన వేదప్రభాస్ నవల 'పయనం'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## జీవన పయనం

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

మనిషి జీవితంలో స్థిరపడడానికి అనేక పయనాలు చేస్తూంటాడు. బ్రతుకుదెరువు కోసం సుదూరతీరాలకు పోయి వివిధ పరిస్థితులు, అనుభవాలను ఎదుర్కొని బ్రతుకును దిద్దుకుంటాడు.

ప్రతి సమస్యకు ఒక పరిష్కారం వుంటుంది. సమస్య వచ్చిన వారి కోణంనుంచి పరిష్కారం సరైందేననిపిస్తుంది. వ్యక్తియొక్క చైతన్య స్థాయినుంచి పరిష్కార మార్గాలు, పరిష్కారాలు మారుతుంటాయి. ప్రభాకరం చైతన్యస్థాయి... అతను ఎదిగిన ఫీల్డులో అంతకన్నా గొప్ప పరిష్కారాన్ని కనుగొనలేదు. ఇన్‌కంటాక్స్ అధికారులతో రైడ్ చేయించిన తర్వాత దొర మాటలకు ప్రభాకరం తిరిగి ఆలోచనలో పడతాడు. అదే ప్రభాకరం వ్యక్తిత్వం. డబ్బు సంపాదించాలని, ఇతరులను మోసగించి, వారి శ్రమశక్తిని దోచి తాను బాగుపడాలనుకునే దయ, కరుణలేని కాంట్రాక్టర్లయిన దొరల పనితీరు ఈ నవలలో స్పష్టంగా కనిపిస్తుంది. క్వార్టర్ల నిర్మాణం, కాంట్రాక్టర్ల తీరుతెన్నులు, టెండర్ షెడ్యూళ్లు, రింగ్ ఫార్మ్ కావడం... ఇన్‌స్పెక్షన్లు, మెస్... పనిస్థలాలు... ఇదంతా ఎంతో సహజంగా రాయడం రచయిత నైపుణ్యతకు నిదర్శనం.

ఈ నవలలో అనేక సంఘటనలు మనసును కలిచివేస్తాయి. శ్రీరాములు పరిస్థితి, పనిమనిషి యశోదకు ప్రభాకరం వెయ్యి రూపాయలు ఇచ్చినప్పుడు యశోద మాటలు హృదయాన్ని కదిలిస్తాయి. దొరలు, కార్మికులు, సూపర్‌వైజర్లు, వారి స్వభావాల... మానసిక విశ్లేషణతో నవల కూడుకున్నది.

నవలలో ప్రధాన స్థలమైన గోదావరిఖని-ప్రస్తుతం మూడు లక్షల జనాభాతో, ఎత్తయిన భవనాలు, క్వార్టర్లు, వేలాది గుడిసెలు, లక్షలాది వాహనాలు, విస్తరించిన బొగ్గుగనులు, ఎరువుల కర్మాగారం, ఎన్టిపిసిలతో పారిశ్రామిక కేంద్రంగా వెలుగొందుతోంది. ఈ నవలలోని కథాకాలం దాదాపు 30 సంవత్సరాల క్రితంది కావడం. అప్పుడు క్వార్టర్ల నిర్మాణం... మట్టి రోడ్లు, చిన్న దుకాణాలు, బ్రాందిషాపులు, బొగ్గులారీలు... జనసంచారంలేని ప్రదేశాలు... పాతజ్ఞాపకాలను తెప్పిస్తాడు. అవసరం... పని... ఓపిక... పట్టుదల మనిషిని రాటుదేల్చుతుందని, ఎన్ని పయనాలు చేసినా ప్రభాకరం లాంటివాళ్లు అభివృద్ధిలోకి వస్తారని తెలియజెప్పిన 'పయనం' నవల ఉత్తమ నవలగా పేర్కొనవచ్చు.

**-రామశంకర్,**
గోదావరిఖని

## సీరియస్ రచన

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'పయనం' నవల ప్రశంసకి, విమర్శకి కూడా అనువైన ఓ సీరియస్ రచన.

ప్లస్ పాయింట్స్‌కి వస్తే- ముందుగా చెప్పు




కోవలసింది 'ఆద్యంతం' చదివించే సుగుణం, వాడిన మాండలికం బాగుంది. సైట్‌లో పనిజరిగే తీరూ, కంట్రాక్టర్ల ఆలోచనాసరళి, వర్కర్ల జీవనవైవిధ్యం, వీటికి చెందిన వివరణ పుష్కలంగా ఉంది. ప్రభాకరం పనిలో చేరింది లగాయితు చూపిన శ్రద్ధ, సమర్థతవల్ల ఎలా పైకివచ్చి, దొరకి అతిసన్నిహితుడు కాగలిగాడో చూపించినతీరు హృద్యంగా ఉంది.

ఇక ప్రతికూల విమర్శకి వస్తే- అసలు గమ్యం అంటూ లేని పయనాన్ని ప్రారంభించిన ప్రభాకరానికి, మధ్యలో తనకి ఏది గమ్యం అనే ఆలోచన వచ్చి, చివరికి గమ్యం కుదరని పయనమే ప్రారంభమయింది. హీరో దూరదృష్టి లోపం, విలన్ (దొర) దురదృష్టజాతకం మనకి కనిపిస్తాయి. సుఖమయిన గమ్యం కోరుకునే ప్రభాకరం తన మార్గాన్ని సుగమం చేసుకోడానికి చేపట్టిన పయనం ఎటు? అన్నది తేలనేలేదు. నవలలో వినోదాత్మక సన్నివేశం యువతను కాస్తంత గిలిగింతపెట్టేది సింగమ్మతో ప్రభాకరం సంగమం. ఇది హీరో ఉదాత్త జీవనశైలికి ఓ 'విఘాతం' కాగా కథకి ఏమాత్రం ఉపయోగపడని సన్నివేశం. పైగా ఇది సరిగ్గా అతను సాకేతను కలవడానికి వెళ్లేముందే జరగడం అతని హీరో ఇమేజ్‌ని దెబ్బతీసింది.

దొర ద్రోహబుద్ధి తెలిసిన ప్రభాకరం అతన్ని వదలిపోవాలని అనుకోవడమే గాక, దొరకి తగిన గుణపాఠం చెప్పాలనుకుని అతనిని ఇన్‌కమ్‌టాక్స్, విజిలెన్స్ డిపార్ట్‌మెంటుకి దొరికిపోయేలా చేస్తాడు. ఆమాత్రందానికి దొరని అంతకుముందు లాకప్‌లోంచి విడిపించడమెందుకు? దొర దొరికిపోతే తనకి కలిగిన 'తృప్తి' ప్రభాకరం పయనానికి గమ్యం చూపగలిగిందా? ప్రభాకరం తాను ఓ సామాన్య, సగటు సాంఘిక జీవిననే సత్యాన్ని విస్మరించాడు.

-దంతుర్తి చినరామచంద్రరావు,
రామచంద్రపురం

## వృత్తి నవల

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'పయనం' కుటుంబగాథా పరిమితినుంచి ఒక ప్రత్యేక వృత్తిశాఖా సంబంధితమైన ఇతివృత్తంతో నవ్యత్వాన్ని సంతరించుకుంది. కాంట్రాక్టుల రంగం, కంట్రాక్టర్ల పనితీరు, శ్రామికులతో వాళ్ల ప్రవర్తన, కాలనీలు కట్టడాలు- అన్నీ కాస్త కొత్తగా, విషయపరిజ్ఞానాన్నందించేదిగా ఉంది. పూవుకు తావిలా ఆ ఇతివృత్తానికి తెలంగాణా మాండలికం ప్రాణం పోసింది. ఆ భాషవల్లనే నవలకి చదివించే గుణమబ్బింది.

కథావస్తువు, భాష, శైలి విషయాల్లో వేదప్రభాస్‌గారు అభినందనీయులు. ఒకవిధంగా వృత్తినవలగా తీర్చిదిద్దారీ పయనాన్ని. అయితే నాయకుడైన ప్రభాకరం తాను చేయగలిగిన దాన్ని చాలా ఆలస్యంగా చేశాడనిపించింది. అదీ అనుకోని అవాంతరంగా ఆ ప్రేలుడు జరిగితే తప్ప అప్పటికే క్రుంగి ఉన్న దొరని మరికొంత కృంగదీశాడంతే. 'ఏదో చేయాలి. గుణపాఠం నేర్పాలి' అంటూ సస్పెన్స్ సృష్టించి, చివరికి అందరికీ తెల్సిన పాతపద్ధతిలోనే దొరను బిగించడం బహుశా మరింత సస్పెన్సు సృష్టించడమనుకున్నారేమో రచయిత.

సాకేత ఉదంతం అనవసరమేమో! విష్ణుపవన్ పాత్ర యువపోలీసు అధికారులకు ప్రేరణ. పాణి, వెంకట్రావు పట్టుదలగా తమ జీవితాన్ని నిలబెట్టుకున్న యువతకు ప్రతీక. శ్రీరాములుగారు అనాదిగా దోపిడీ వ్యవస్థకు గురవుతున్న మధ్యతరగతి వర్గానికి మచ్చుతునక. వీరందరి కలగలపుతో మధ్యతరగతి, మేధావివర్గపు అంతర్గత తిరుగుబాటును మెత్తని కత్తిలాగా, కాల్చని చిచ్చులాగా చెప్పి చరిత్రసత్యాన్ని పునరుద్ఘాటించిన నవలారచయితగా శ్రీ వేదప్రభాస్‌గార్ని, ప్రచురణకర్తలను అభినందిస్తున్నాను.

-సి.లక్ష్మి,
హనుమకొండ



## దిశలేని 'పయనం'

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

పయనం నవల కథాంశం బాగుంది. కథలో కొంతసేపు కంట్రాక్టరు మరుగై ప్రభాకరం చుట్టూ తిరిగి శ్రీరాములు పాత్రను చంపినప్పుడు ప్రభాకరం పాత్రను నడిపినతీరు బావుంది. అయితే ప్రభాకరం పాత్రను ముగించినతీరు చాలా అసంతృప్తిగా, అసలు కథే దిశలేని పయనంలా అనిపించింది. ఎందువల్లనంటే శ్రీరాములు కుటుంబానికి న్యాయం చెయ్యాలని తపించే ఆ పాత్ర చివర్లో ఆ కుటుంబాన్నే మరచి దొర పాత్రపై ప్రతీకారమే ధ్యేయంగా భావించడం కనపడింది. అలాకాక దొర జైలు నుండి వచ్చాక ప్రభాకరం దొరకు నచ్చచెప్పి శ్రీరాములు కుటుంబానికి ఇల్లు రిజిస్ట్రేషను, వాటాసొమ్ము ఇప్పిస్తే బావుణ్ణు. అదేవిధంగా దొర కూడా ప్రభాకరానికి అతని చెల్లి పెళ్లికి డబ్బు ఇచ్చి, ప్రభాకరాన్ని తన కంపెనీలో చిన్న వాటాదారునిగా చేస్తే అటు ప్రభాకరం జీవితపయనానికి ఒక గమ్యాన్నిచ్చినట్లు దొరకు అతని కంట్రాక్టు పనుల్లో చురుగ్గా తనలాగా పనిచేసే వ్యక్తి దొరికి ఆ కంపెనీ నిలబడ్డాన్కి పనికొచ్చినట్లుఅయి కథ ఒక కొలిక్కి వచ్చినట్లుండేది. మరింత హుందా అయిన ముగింపు ఇచ్చినట్లయ్యేది.

-ఎన్.వి.ఎస్. రామలింగేశ్వరరావు,
హైదరాబాద్

## 'సస్పెన్స్'

*(ఐదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరు?' అంటూ కూలీల వ్యధాభరిత కష్టగాథల్ని ఒకేఒక వాక్యంలో వివరించిన కవి అక్షరావేశం స్ఫురణకు వచ్చింది, మార్చి 'చతుర' నవల 'పయనం' పఠించిన తర్వాత.

పలుకుబడిగల వివిధ కేటగిరీల కంట్రాక్టర్లు ఆయా పనుల నిర్మాణానికి ఒకరాయి ఎత్తకుండా, పలుగుపారలు పట్టకుండానే, కూలీల చెమటయే పెట్టుబడిగా, తెలివిపరులైన కార్యదక్షతగల సూపర్‌వైజర్ల సలహాలతో కాసులేరుకుంటున్నారు. ఇది సహజమే అయినా, దాదాపు అందరికీ తెలిసిన విషయమే అయినా రచయిత వేదప్రభాస్ తనదైన శైలిలో నూతనత్వంతో సగటు పాఠకుడికి సంపూర్ణంగా కథనంతా చదివేలా చేయటంలో సఫలీకృతులయ్యారు.

రచయిత కంట్రాక్టర్ ప్రకాశరావును సినిమా విలన్‌లా ఎంతో నీచుడిగా, ధనమదాంధుడిగా, కోపిష్టిగా, నోటిదురుసుగల గర్వపోతుగా చిత్రించాలని కథలో ప్రయత్నించినట్లుగా స్పష్టమౌతోంది. అయితే ప్రకాశరావ్ పాత్రను రచయిత తాను అనుకున్నట్లుగా తయారుచేయలేకపోయాడని అనిపిస్తోంది. అలాగే ప్రభాకరంను మంచి వ్యక్తిత్వం, నిజాయితీ గలవాడిగా ఒక సందర్భంలో వివరించినా మేస్త్రీ మరదలు 'సింగమ్మ'కు అతిసులువుగా లొంగిపోవటం, శృంగారరసం ఒలికించటం ప్రభాకరం పాత్రకు రచయిత కావాలని మచ్చ తెచ్చినట్లుగా ఉంది. ఫలితంగా రచయిత పేర్కొన్న హీరో ప్రభాకరం నిలకడ, పాలలాంటి మనసు లేనివాడనే తేటతెల్లమవుతోంది. ఇక సాకేత పాత్రను కూడా కావాలనే రచయిత అతితొందర్లో రంగంనుండి తప్పించారు.

ఆఖర్లో "నేను అందరు కంట్రాక్టర్లలా కాకుండా నిజాయితీగా వర్క్ చేస్తున్నా" అని ప్రకాశరావ్ ప్రభాకరంతో అనటం అసహజంగా ఉంది. అంత నిజాయితీగా ఉన్న కాంట్రాక్టర్ మరి, కోట్లకు పడగలెత్తగలడా? అన్న ప్రశ్న పాఠకుడిలో రేకెత్తకమానదు.

కాంట్రాక్ట్ పర్వంను వివరంగా, ప్రతీ చిన్న కదలికకు అక్షరరూపం ఇస్తూ, నవలను మలచిన రచయిత అభినందనీయుడే.

-యం. రమేష్‌యాదవ్,
కరంజి (టి)




# తెల్లమచ్చలు:



తెల్లమచ్చలు 30 గంటలలో మారడం ప్రారంభమవుతాయి. త్వరలోనే శాశ్వతంగా చర్మం రంగులోకి మారుతాయి. 7 రోజులకు సరిపడు మందు ఉచితం.

# తెల్లజుట్టు:



అకాలంలో జుట్టు తెల్లబడకుండా సహాయపడే ఆయుర్వేద చికిత్స, తెల్లజుట్టు నల్లగా మారుతుంది మరియు జుట్టు రాలడం ఆపుతుంది. చికిత్స కోసం వెంటనే వ్రాయండి.

ఒక ఫియల్ 35/-, 3 ఫియల్స్ 90/-

టెస్టుకోసం ఉచితమందు

**VAIDYA MK MATHUR (MK)**

P.O. Katri Sarai (GAYA)

# తెల్లమచ్చలు:



తెల్లమచ్చలు 30 గంటలలో మారడం ప్రారంభమవుతాయి. త్వరలోనే శాశ్వతంగా చర్మం రంగులోకి మారుతాయి. 7 రోజులకు సరిపడు మందు ఉచితం.

# తెల్లజుట్టు:



అకాలంలో జుట్టు తెల్లబడకుండా సహాయపడే ఆయుర్వేద చికిత్స, తెల్లజుట్టు నల్లగా మారుతుంది మరియు జుట్టు రాలడం ఆపుతుంది. చికిత్స కోసం వెంటనే వ్రాయండి.

ఒక ఫియల్ 35/- 3 ఫియల్స్ 90/-

టెస్టుకోసం ఉచితమందు

**RANI AYURVED (HA)**

P.O. Katri Sarai (GAYA)

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

**మే చతుర నవల స్పృహ**

సమీక్షకుని పేరు : ..................................................................

చిరునామా : ..................................................................

..................................................................

..................................................................

..................................................................

# చతుర ప్రపంచం

## త్రిపాదుడు

**మూ**డోకాలు సాధారణంగా చేతికర్రరూపంలో మునలాళ్ళకే వుండేట్లు మూడుకాళ్ళ మునలాళ్ళు అంటూ వుంటారు జనం. వయసు పెరిగేకొలదీ అవయవాల్లో నత్తువతగ్గి, నడవలేక చేతికర్రనాధారంగా తీసుకుంటారు వృద్ధులు. కానీ పుట్టుకతోనే ముచ్చటగా మూడుకాళ్ళతో పుట్టాడు ఫ్రాంక్‌లాటినీ. 1907 జూన్ 8వ తేదీన ఫ్రాన్స్‌లో సిసిలీ సిటీలోని ఓ నర్సింగ్‌హోమ్‌లో అలేఖా లాటినీ అనే మహిళకి మూడు కాళ్ళతో పుట్టాడు ఫ్రాంక్. **అప్పటికే ఆవిడకి ఏడుగురు ఆడపిల్ల**టుగా ఒక కాలు అదనంగా ఏర్పడిందనీ" అన్నాడు. అయితే తల్లి మాత్రం తన బిడ్డకు అనహ్యకరంగా కనిపించే ఆ మూడోకాలును ఆపరేషన్ అయినా చేసి తీసెయ్యమని డాక్టరుని బతిమాలింది.

"ఆ అవకాశమే వుంటే తప్పక ఆపరేషన్ చేసేవారమనీ, కానీ మూడుకాళ్ళ నిర్మాణం బలిష్టంగా వుండడంవల్ల ఆపరేషన్ కారణంగా పక్షవాతమయినా రావచ్చు లేదా ప్రాణమయినా పోవచ్చు" అని తెల్పిచెప్పాడు డాక్టరు.

చేసేదేంలేక పిల్లవాడిని పెంచింది తల్లి. చదువులో ఎన్నో మెడల్స్ నంపాదించుకున్నాడు ఫ్రాంక్. **తన మూడవకాలితో** ఓ నర్కస్




లు, ఫ్రాంక్‌తో కలిపి ముగ్గురు మగపిల్లలు. మిగిలిన పిల్లలందరు ఆరోగ్యంగా పుష్టిగా వుండి ఏ విధమయిన అవయవలోపం లేకుండా వుండగా, ఫ్రాంక్ మాత్రం మూడు కాళ్ళతో పుట్టేసరికి, ఖంగారుపడి ఏడవడం మొదలుపెట్టింది తల్లి. పిల్లవాడిని పరీక్షించిన డాక్టరు "అలేఖకు కవలపిల్లలు పుట్టవలసిందనీ, కానీ బిడ్డ ఎదుగుదల ప్రారంభమయ్యేనరికి రెండు పిండాలు కలిసిపోయి ఒకే బిడ్డగా ఎదిగాయని, అందులో పొరపాట్రూప్‌ని ఆకట్టుకుని అందులో పనిచేసి లెక్క లేనంత నంపాదించాడు. అదే నమయంలో రోజులో కొంతభాగం ఫుట్‌బాల్ ఆడేవాడు ఫ్రాంక్. అమెరికాలోను, ఐరోపా దేశాల్లోను ఫుట్‌బాల్ ప్లేయర్‌గా ఫ్రాంక్ పేరు మారుమోగింది.

ఫుట్‌బాల్ ఆటగాళ్ళ టీమ్‌లోనూ, ప్రేక్షకుల్లోనూ కూడా ఫ్రాంక్ మూడవకాలు చర్చనీయాంశంగా వుండేది. ఆటలో పొరపాటున బంతి ఫ్రాంకు వద్దకు వచ్చిందంటే చాలు ప్రత్యర్థి గుండెలదిరేవి. ఫ్రాంకు తన మూడవకా

లితో ఒక్క తన్ను తన్నితే వెళ్లి గోల్‌లో పడేది బంతి.

ఫ్రాంక్ వైవాహిక జీవితం కూడా ఆనందంగానే గడిచింది. మార్టినీ అనే అమ్మాయిని పెళ్లాడిన ఫ్రాంక్ నలుగురు పిల్లల తండ్రి అయ్యాడు. పిల్లలందరూ ఎలాంటి అంగవైకల్యం లేకుండా ఆరోగ్యంగా వున్నారు. 1977లో, 70 సంవత్సరాల వయసులో ఫ్రాంక్ మరణించాడు. అంతవరకూ కూడా అతని మూడోకాలు అతనికెంతో ఊతంగానే వుండేది.

# దీర్ఘాయుష్మాన్‌భవ!

పరిపూర్ణ ఆయుర్దాయం అంటే ఒకప్పుడు వందేళ్ళు పైమాటగానే చెప్పుకునేవారు. అప్పట్లో తక్కువ జనాభా, పరిమిత వాతావరణ కాలుష్యం, వాహనాల సంఖ్య అతి తక్కువ కావడంతో రోడ్డు ప్రమాదాలు అంతగా లేకపోవడంలాంటి ఎన్నో కారణాలు మనిషి అల్పాయుష్కుడు కాకుండా వుండటానికి దోహదంచేసేవి.

కానీ ప్రస్తుత పరిస్థితులను చూస్తే ఎభైఏళ్ళ దాకా ఎటువంటి ఒడిదుడుకు లేకుండా బతికితే గొప్పే అన్న పరిస్థితి వచ్చింది. ప్రకృతి వైపరీత్యాలే కాకుండా ప్రమాదాలు, హింసాకాండలతోపాటు, శరీర దారుఢ్యం కూడా మనిషికి నగటున తక్కువనే చెప్పొచ్చు. కనీవినీ ఎరుగని అనేకరోగాలు శరీరంలోకి ప్రవేశిస్తున్నాయి.

పెద్దపెద్ద నగరాల్లో పొద్దున్న బయటకి వెళ్ళిన మనిషి సాయంత్రం ఇల్లు చేరేదాకా అనుమానమే. ఒకమూల వైద్యశాస్త్రం పురోగమిస్తోందనీ, దాంతో మనిషి ఆయుఃప్రమాణం పెరిగే అవకాశం కూడా వుంటోందని శాస్త్రజ్ఞులు ఎంత మొత్తుకున్నా దాన్ని పూర్తిగా నమ్మలేకపోతున్నాం.

అయితే పరిశోధనల ప్రకారం అమెరికా, రష్యా, జపాన్ మొదలయిన దేశాల్లో చాలా మంది 100 సంవత్సరాలు పైగా బతుకుతున్నారని తేలింది. సామాన్యులకు ఇది ఆశ్చర్యంగా అనిపించినా శాస్త్రజ్ఞులుమాత్రం అందులో వింతేమీ లేదనీ, మానవశరీర నిర్మాణం 100 సంవత్సరాలు బతకడానికి అనువుగానే వుంటుందనీ, దానికి కొద్దిపాటి మానవప్రయత్నం అవసరమనీ అంటున్నారు.

అమెరికా, రష్యాలకు చెందిన శాస్త్రజ్ఞుల బృందం ఒకటి అమధ్య కలిసికట్టుగా 100 సంవత్సరాలు దాటిన 28,000 మంది ప్రజలను ఇంటర్వ్యూచేశారు. వారు ఈ దీర్ఘాయుష్షుకి ఏదైనా ప్రత్యేక పద్ధతులు అవలంబించడం కారణమా లేక ప్రకృతిసిద్ధంగా వారు అంత కాలం బతకగలిగారా అన్నది వారి ఇంటర్వ్యూలో ముఖ్యప్రశ్న.

డాక్టర్ డిమిత్రిశబటోరి అనే ఆయన 105 ఏళ్ళు పైబడిన 1000 మందిని చేసిన ఇంటర్వ్యూప్రకారం చూస్తే ఒక్కొక్కళ్ళూ ఒక్కొక్క కారణాన్ని చెప్పారు.

వంశపారంపర్య లక్షణాలు కొంత ప్రభావితం చేస్తాయనీ, ఇదికాక తల్లితండ్రులు కూడా కనీసం 70 సంవత్సరాలు బతకాలనీ కొందరన్నారు. మరికొందరు ధూమపానం, మద్యపానం లేకపోవడమే తమ దీర్ఘాయుష్షులోని రహస్యమన్నారు. వాతావరణ కాలుష్యంలేని గ్రామీణ జీవితం కూడా దోహదకారి అవుతుందని కొందరన్నారు. వైవాహిక కుటుంబ జీవితం స్వచ్ఛంగా, శాంతియుతంగా వుండటం ఇంకో కారణమన్నారు. కష్టపడి పనిచేయడం ఒక కారణం. క్రమశిక్షణతో కూడిన ఆహార నియమాలు అవసరమనీ, జీవితంలో ప్రతి విషయానికి తృప్తి పడటం కూడా దీర్ఘాయువుకి దోహదం చేస్తుందని కొందరన్నారు. డాక్టర్ డిమిత్రి పరిశోధనలో మరో విషయం కూడా బయటపడింది. 100 ఏళ్ళు పైబడిన పురుషులకంటె 100 ఏళ్ళు పైబడిన స్త్రీల సంఖ్య ఆరురెట్లు ఎక్కువగావుంది. అంటే నియమపాలనలో స్త్రీలే ముందంజవేస్తున్నట్టుగా తెలుస్తోంది.

శాస్త్రజ్ఞుల పరిశోధనలో వెల్లడయిన మరో విషయం ఏమంటే మెదడును ఉత్సాహంగా పెట్టుకుంటే శరీరం ఎక్కువకాలం నిలుస్తుందనీ, అంటే ఏమీ పని చెయ్యకుండా సోమరిలా కూర్చోడంవల్ల మెదడు కూడా చు

రుకు తగ్గి ఆ ప్రభావం శరీరంమీద పడుతుందనీ అంటున్నారు. అంటే మెదడు చురుకుదనం శరీరంమీద, శరీరం చురుకుదనం మెదడుమీద పడుతుందని డాక్టర్ల అభిప్రాయం. కాబట్టి ప్రతి మనిషి ఏదో ఒక పరిశ్రమ చేస్తే శరీర దారుఢ్యం పెరిగే అవకాశముందని తెలుస్తోంది.

101 సంవత్సరాల వయసుగల ఒక అమెరికన్ తను ఎక్కువగా పచ్చి ఉల్లిపాయలు **తినడమే తన దీర్ఘాయువులోని రహస్యం** అన్నాడు.




102 సంవత్సరాల మహిళ తను 14 మంది పిల్లల తల్లిననీ, రోజులో 24 గంటలూ వాళ్ళ ఆలనా పాలనాతోనే గడిచిపోతుందనీ, కాబట్టి ఎలాంటి చీకూ చింతా పెట్టుకునేందుకు కూడా టైము వుండదనీ, బహుశా అదే తన దీర్ఘాయువుకి కారణం కావచ్చునీ అంటోంది.

మరో 100 ఏళ్ళ వృద్ధుడు కేవలం తను చేసే సైకిలింగ్‌వల్లే ఇంత దారుఢ్యంగా వున్నానన్నాడు. 105 సంవత్సరాల మరో వృద్ధుడు తనెప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ హుషారుగా వుంటాననీ, అదే తననింకా పసివాడిలా వుంచుతోందనీ అంటాడు.

సమయానికి చేసే ఆరోగ్యకరమైన భోజనం మనిషికెప్పుడూ ఆయుష్షును పెంచుతుందంటారు వైద్యులు. తేనె కూడా దీర్ఘాయువుకి తోడ్పడుతుందని కొందరి అభిప్రాయం. అమెరికాకు చెందిన నియోల్ లియోలిన్ అనే డాక్టరు 'కొంతమంది రష్యనులు నిత్యం తేనె సేవిస్తారనీ, దాంట్లో వుండే అమూల్యమైన విటమినులు, లవణాలు మనిషి శరీరాన్ని వజ్రసమానం చేస్తుందనీ' అంటాడు.

తేనె తరువాత పచ్చి ఉల్లిపాయలు, కారెట్లు, క్యాబేజీ, యాపిల్స్ మొదలయిన కూరలు, పళ్ళు శరీర దారుఢ్యాన్ని బాగా పెంచుతాయని తెలుస్తోంది. ఇదికాక తినుకునే ఆహారంలో సమతౌల్యంతోపాటు, సమతూకం, సరైన సమయం ఇవన్నీ కూడా అవసరం అంటున్నారు వైద్యులు. శరీరపు బరువును అతిగా పెరగనివ్వకుండా ఎత్తుకి, వయసుకి తగిన బరువును నిలుపుకుంటూరావాలి.

డాక్టర్ డల్లాస్ చెప్పినప్రకారం ముప్పైఏళ్ళ వయసులో 80 కిలోలుంటే, 60 ఏళ్ళు వచ్చేసరికి 60 కిలోలుండాలి. పైగా ఆయన చెప్పిన మరో రహస్యం 'ఇవన్నీ పాటించినా బ్రహ్మచారులకన్నా పెళ్లయినవాళ్ళకే ఎక్కువకాలం బతికే అవకాశం మరింత మెరుగ్గా వుంటుంద'ని. కాబట్టి పెళ్ళొద్దని భీష్మించుకున్న బ్రహ్మచారులు పట్టునడలించవలసి రావచ్చు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.




**PET 14 DX**
**PET 14 SE**
**PET 14 V**
**Portable**
**B & W TVs**

మరియు అనేక రకాల
మోడల్స్‌లో అనుదిన
కార్యక్రమాలు మీ కోసమే
రిజర్వు చేయబడినవి

# Solidaire®

దేశమంతటా
విజయభేరి మ్రోగిస్తోంది












ఉంది
దేనిలో
అంటే
ఉంది

అందరికోసమే **Solidaire®** B&W TV ఉన్నది

Insight-S3999

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402